శ్రీరస్తు

# శ్రీ వేఙ్కటాచల మాహాత్మ్యము

(తెలుగు వచనము)




రచయిత:

శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామి

---

తిరుమల - తిరుపతి దేవస్థానముల ప్రచురణము

తిరుపతి.

1958

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము

పుట.


| | | |
|---|---|---|
| 1. | మునులు సూతుని వేంకటాచలమాహాత్మ్యమును జెప్పుమని కోరుట .... | 1 |
| 2. | విష్ణుమూర్తి శ్వేతవరాహరూపమున భూమినెత్తి తెచ్చుట .... | 2 |
| 3. | వైకుంఠమునుండి గరుడుడు క్రీడాచలమును దెచ్చుట .... | 2 |
| 4. | శ్రీ స్వామిపుష్కరిణీ మాహాత్మ్యము ... | 3 |
| 5. | క్రీడాద్రి (వేంకటాద్రి) కి నామభేదములు .... | 5 |
| 6. | వేంకటాద్రియందు భగవంతుని యద్భుతకృత్యములు ... | 6 |
| 7. | కాపిలాది పదియేడు తీర్థముల మాహాత్మ్యము .... | 10 |
| 8. | శ్రీరాముడు వేంకటాద్రికి వచ్చుట .... | 12 |
| 9. | వానరులు వైకుంఠగుహను బ్రవేశించుట .... | 13 |
| 10. | వైకుంఠగుహ ప్రభావము .... | 15 |
| 11. | రావణాది రాక్షసులచే బీడింపఁబడిన దేవర్షులు మహావిష్ణువును వెదకుట .... | 15 |
| 12. | చతుర్ముఖునితోగూడి దేవర్షులు వేంకటాద్రికి వచ్చుట .... | 17 |
| 13. | పుత్రార్థియగు దశరథుడు వేంకటాద్రికి వచ్చుట .... | 18 |
| 14. | దశరథుడు స్వామి పుష్కరణీ తీరమున తపము చేయుచున్న మునులను జూచుట .... | 20 |
| 15. | శ్రీ భగవంతుడావిర్భవించుట .... | 20 |
| 16. | బ్రహ్మాదులు విమానమును బ్రవేశించి శ్రీనివాసుని దర్శించుట .... | 22 |
| 17. | బ్రహ్మాదులు విష్ణుమూర్తికి రావణోపద్రవమును నివేదించుట .... | 24 |
| 18. | భగవంతుడు చతుర్ముఖుని ప్రార్థనను నెరవేర్చి వేంకటాద్రియందు సర్వజనులకు ప్రత్యక్షముగా నుండుటకంగీకరించుట .... | 26 |
| 19. | భగవంతుడు బ్రహ్మోత్సవమున కంగీకరించుట .... | 27 |
| 20. | శ్రీ వేంకటేశ్వర మహోత్సవ వైభవము .... | 29 |
| 21. | శ్రీ వేంకటేశ్వర మహోత్సవ సేవాఫలము .... | 29 |
| 22. | వేంకటాద్రియందు పుష్పోద్యానములను నిర్మించి పుష్పార్చన చేసినవారికి కలుగు ఫలము .... | 30 |
| 23. | బ్రహ్మోత్సవావభృథ స్నానము .... | 31 |

పుట.

24. ఫల్గునీ తీర్థమాహాత్మ్యము .... 32
25. జాబాలితీర్థమాహాత్మ్యము .... 32
26. కలియుగమున వేంకటేశుని లీలలు ... 33
27. సనకసనన్దన తీర్థమాహాత్మ్యము .... 35
28. కాయరసాయనతీర్థమాహాత్మ్యము .... 35

## ద్వితీయాశ్వాసము

1. వేంకటాద్రిమాహాత్మ్యము .... 36
2. కుమారధారతీర్థమాహాత్మ్యము .... 36
3. తుంబురుతీర్థమాహాత్మ్యము .... 36
4. ఆకాశగంగామాహాత్మ్యము .... 37
5. పాండవతీర్థమాహాత్మ్యము .... 37
6. పాపనాశనతీర్థమాహాత్మ్యము .... 37
7. దేవతీర్థమాహాత్మ్యము .... 37
8. ఆకాశరాజు జన్మవృత్తాంతము .... 38
9. పద్మావత్యుత్పత్తి వృత్తాంతము .... 38
10. వసుదాసుని జన్మవృత్తాంతము .... 39
11. నారదఋషి పద్మావతికి సాముద్రికము చెప్పుట .... 39
12. పద్మావతి సఖులతోగూడ నుద్యానవనమున కేగుట .... 40
13. శ్రీనివాసుడు మృగయార్థ ముద్యానవనమున కేగుట .... 40
14. శ్రీనివాసుడు పద్మావతిని పరిణయమాడుటకు కారణములు ... 41
15. పద్మావతి సఖులు వకుళమాలికకు పద్మావతి వృత్తాంతమును జెప్పుట .... 45
16. పులిన్దస్త్రీ ధరణీదేవి ప్రశ్నకు సమాధానము చెప్పుట .... 45
17. పద్మావతి తనకోరికను తల్లికి నెరిగించుట .... 46
18. వకుళమాలిక ధరణీదేవికి శ్రీనివాసుని వృత్తాంతము జెప్పుట .... 46
19. శ్రీనివాసునకును పద్మావతికిని వివాహము నిశ్చయింపబడుట .... 47
20. శ్రీనివాసు డలంకృతుడై వివాహనిమిత్తము దేవతలతోగూడ వియద్రాజపురమున కరుగుట .... 49
21. పద్మావతీ పరిణయము .... 50
22. కలియుగమున శ్రీనివాసుని దర్శించినవారి వృత్తాంతము .... 51
(వసువను నిషాదుని వృత్తాంతము, రంగదాసుడను శూద్రుని వృత్తాంతము, తొండమానురాజు వృత్తాంతము)

పుట.

23. పద్మసరోవరమాహాత్మ్యము .... 55
(వీరశర్మయను బ్రాహ్మణుని వృత్తాంతము, భీముడను కులాలుని వృత్తాంతము)

## తృతీయాధ్యాయము

1. మునులు సూతుని వేంకటాచలమాహాత్మ్యమును జెప్పుమని కోరుట .... 62
2. కృతయుగమున వృషాచలమను పేరు కలిగిన విధము .... 63
3. త్రేతాయుగమున నంజనాచలమను నామము పొందిన విధము .... 64
4. ద్వాపరయుగమున శేషశైలమను నామము కలిగిన విధము ... 64
5. కలియుగమున వేంకటాచలమను నామము కలిగిన విధము ... 66
6. భగవంతుడు వైకుంఠమును విడిచి వేంకటాద్రికేగిన విధము .... 70
7. వల్మీకమున లీనుండై యున్న శ్రీనివాసునికి గోవు క్షీరసేచనము చేయుట .... 72
8. గోపాలుడు కుఠారముతో శ్రీనివాసుని గొట్టుట .... 73
9. శ్రీనివాసుడు చోళరాజును శపించుట .... 74
10. శ్రీనివాసుడు చోళరాజునకు వరమిచ్చుట .... 75
11. శ్రీ వరాహస్వామి శ్రీనివాసునకు వేంకటాద్రియందు స్థానము నిచ్చుట .... 75
12. ఆకాశరాజునకు సంతానప్రాప్తి కలిగిన విధము ... 77
13. నారదముని పద్మావతికి భావిశుభమును జెప్పుట .... 78
14. పద్మావతికి శ్రీనివాసుడు దర్శనమిచ్చి యామెతో సంభాషించుట .... 79
15. శ్రీనివాసుడు వకుళాదేవికి తన యభిలాషను దెలుపుట .... 81
16. పద్మావతియొక్క పూర్వజన్మవృత్తాంతము ... 82
17. వకుళావళి పద్మావతిసఖులను కలిసికొనుట .... 84
18. శ్రీనివాసుడు ఎఱుకలసానిరూపమును ధరించి నారాయణపురమునకేగుట .... 85
19. ఎఱుకలది పద్మావతి యస్వాస్థ్యమునకు గారణము నెరింగించుట .... 86
20. పద్మావతి శ్రీనివాసుని వరించినట్లు ధరణీదేవితో జెప్పుట .... 87
21. పద్మావతిసఖులతోగూడ వకుళావళి ధరణీదేవిచెంతకు వచ్చుట .... 88
22. ఆకాశరాజు బృహస్పతిని, శుకమునిని రప్పించి వారితో నాలోచించుట .... 89
23. పద్మావతిని శ్రీనివాసునికి కన్యాదానము చేసెదనని యాకాశరాజు ప్రతిజ్ఞ చేయుట .... 91
24. ఆకాశరాజు శ్రీనివాసునకు శుభలేఖ పంపుట .... 91
25. శ్రీనివాసునితో వకుళాదేవి పద్మావతీ పరిణయ వృత్తాంతమును జెప్పుట .... 93
26. శ్రీనివాసునియాజ్ఞపైని బ్రహ్మాదుల నాహ్వానించుటకు శేషశేషాశనులు వెళ్లుట.... 93

| | | |
|---|---|---|
| | | పుట. |
| 27. | చతుర్ముఖుడు శేషాచలమునకు వచ్చుట .... | 94 |
| 28. | శేషాద్రికి రుద్రాదులరుదెంచుట ... | 95 |
| 29. | విశ్వకర్మ వివాహపురమును నిర్మించుట .... | 95 |
| 30. | శ్రీనివాసుడు దేవతలను ఋషులను వివాహకార్యములందు నియోగించుట.... | 96 |
| 31. | వివాహార్థము కరవీరపురమునుండి రమను రప్పించుట .... | 97 |
| 32. | పద్మాలయ శ్రీనివాసునకు మంగళస్నానము గావించుట .... | 99 |
| 33. | శ్రీనివాసుడు పరిణయాంగముగా కులదేవతయగు శమీకవృక్షమును ప్రతిష్ఠించుట .... | 100 |
| 34. | శ్రీనివాసుడు పరిణయమునకు కుబేరునివద్ద ధనమును ఋణముచేయుట .... | 101 |
| 35. | శ్రీనివాసుడు వేంకటాద్రికివచ్చిన దేవతలకు ఋషులకు సంతర్పణచేయుట.... | 102 |
| 36. | శ్రీనివాసుడు సపరివారముగా నాకాశరాజపురమున కేగుట .... | 104 |
| 37. | శ్రీ శుకుడు శ్రీనివాసుని కాతిథ్యమిచ్చుట .... | 105 |
| 38. | సపరివారముగా నాకాశరాజు శ్రీనివాసు నెదుర్కొనుటకు వచ్చుట .... | 106 |
| 39. | వివాహార్థము శ్రీనివాసు నాహ్వానించుటకు నాకాశరాజు తన్మందిరమున కేగుట | 107 |
| 40. | పద్మావతీ శ్రీనివాసుల వివాహము .... | 109 |
| 41. | శ్రీనివాసుడు పద్మావతితో శేషాచలమునకు పయనమగుట .... | 110 |
| 42. | ఆరుమాసము లగస్త్యాశ్రమమున నుండుటకు శ్రీనివాసుడు నిశ్చయించుట .... | 111 |
| 43. | ఆకాశరాజు నిర్యాణము .... | 112 |
| 44. | రాజ్యముకొరకు తొండమాన వసుదానులు కలహించుట .... | 113 |
| 45. | శ్రీనివాసుడు తొండమానుని దివ్యాలయము కట్టింపుమని ప్రేరేపించుట .... | 116 |
| 46. | తొండమానుని పూర్వజన్మవృత్తాంతము .... | 117 |
| 47. | శ్రీనివాసుడు తొండమానుడు నిర్మించిన మందిరమును ప్రవేశించుట .... | 117 |
| 48. | బ్రహ్మ దీపారోపణమును భగవదుత్సవమును జేయించుట .... | 120 |
| 49. | భగవదాజ్ఞపైని బ్రహ్మ భగవన్మూర్తి చతుష్టయమును నిర్మించుట .... | 121 |
| 50. | బ్రహ్మ జరిగించిన యుత్సవక్రమము .... | 122 |
| 51. | కూర్మడను ద్విజుని వృత్తాంతము .... | 124 |
| 52. | తొండమానుడు శ్రీనివాసునకు సహస్రనామార్చన చేయించుట .... | 128 |
| 53. | భీముడను కులాలుని వృత్తాంతము .... | 130 |
| 54. | శ్రీనివాసుడు తొండమానునకు మోక్షము నిచ్చుట .... | 132 |


పరిశిష్టము


| | | |
|---|---|---|
| 55. | శ్రీ వేంకటేశాష్టోత్తర శతనామావళి .... | 133 |






తిరుపతి

శ్రీ వేంకటేశ్వరస్వామివారు.

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

శ్లో॥ శ్రియః కాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీ వేఙ్కటనివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్ ॥
శ్రీవేఙ్కటాచలాధీశం శ్రియాధ్యాసితవక్షసమ్ ।
శ్రితచేతనమన్దారం శ్రీనివాసమహం భజే ॥

### 1. మునులు సూతుని వేంకటాచలమాహాత్మ్యము జెప్పుమనికోరుట

ఓ సూతుడా! శ్రీమహావిష్ణువుయొక్క స్వయంవ్యక్త స్థలములన్నిటిలోను దేనియందు విష్ణువునకు ప్రీతియధికమో, యెచ్చట యన్ని కోరికలును సిద్ధించునో, యెచ్చట విష్ణుమూర్తియొక్క చరిత్ర మత్యద్భుతమో, యెచ్చట నివసించు మనుజులకు హరి ప్రత్యక్షమగుచున్నాడో, విష్ణుమూర్తియొక్క యెచ్చటి చరిత్రము శ్రవణానన్దజనకమో యట్టి యద్భుతమైనట్టియు నయనానన్దకరమైనట్టియు వైష్ణవక్షేత్రమునుగురించి మాకు చెప్పవలయునని శౌనకాది మహామునులు సూతుని గోరిరి.

ఓ మునులారా! మీ రిట్లపూర్వచరిత్రము నడుగుట నాకు సంతోషకరముగానున్నది. నాకు కూడ నట్టి శ్రీమహావిష్ణువుయొక్క చరిత్రమును చెప్పుటకు కౌతుకము కలదు. శ్రీహరియొక్క క్రీడలతో కూడుకొనినట్టియు, వివిధములైన యాతని చరిత్రములతో కూడినట్టియు, సమస్త సిద్ధులను నిచ్చునట్టియు, పరైశ్వర్యములను కలుగజేయునట్టియు,

సర్వాశ్చర్య కరంబై నట్టియు, శుభప్రదమైనట్టియు, పుణ్యమైనట్టియు, పవిత్రమైనట్టియు, నాయుష్కరమైనట్టియు, సర్వమంగళకారకమైనట్టియు శేషాచల సంబంధమైన వారాహకల్ప వృత్తాంతమను శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును చెప్పెదను; శ్రద్ధతో వినుండని సూతుడిట్లు చెప్ప దొడంగెను.

## 2. విష్ణుమూర్తి శ్వేతవరాహరూపమున భూమినెత్తి తెచ్చుట

ప్రళయకాలమునందు ప్రపంచమంతయు జలమయము కాగా భూమి యా జలములో నిమగ్నమయ్యెను. అప్పుడు వటపత్రశాయియగు శ్రీ మహావిష్ణువు బ్రహ్మదేవునిచే తిరిగి సృష్టియారంభింప జేయుటకు తాను శ్వేతవరాహరూపమునెత్తి ప్రళయజలమునందు మునిగి వెదకి భూమిని పట్టి పైకితెచ్చుసందర్భమున హిరణ్యాక్షు డసురాగా నతనితో పోరాడి యతనిని సంహరించి భూమిని పైకెత్తి స్థాపించి బ్రహ్మదేవుని తిరిగి సృష్టి ప్రారంభింపుమని యాజ్ఞాపించెను. పిదప దుష్టులను శిక్షించి, సజ్జనులను రక్షించి లోకము ననుగ్రహించు నుద్దేశముతో నా శ్వేత వరాహరూపియగు శ్రీమహావిష్ణువు ఈ లోకమున కొంతకాలముండుటకు నిశ్చయించుకొనెను. (వరాహపురాణము 33-వ అధ్యాయము.)

## 3. వైకుంఠమునుండి గరుడుడు క్రీడాచలమును తెచ్చుట

ఈ లోకమున కొంతకాలముండుటకు నిశ్చయించుకొని శ్రీహరి తన నివాసమున కర్హమగు స్థలము నన్వేషించుచు గోమతీనదికి దక్షిణ మున యరువది యోజనముల దూరముననుం, పూర్వసముద్రమునకు పశ్చి మమున నైదుయోజనముల దూరమునను సువర్ణముఖీనది కుత్తరంబుగా నుండు దివ్యస్థలమునందుండుటకు నిశ్చయించుకొని యచ్చట గరుడుని యాగమనమును నిరీక్షించుచుండెను. గరుడుండును వైకుంఠంబునకేగి యప్రాకృతమైనట్టియు, యమేయమైనట్టియు, సర్వరత్నమయమైనట్టియు,

బంగారు శిఖరము కలిగినట్టియు, సుపనిషదాత్మకమైనట్టియు, సురద్రుమములచే శోభితమైనట్టియు, తదాశ్రితములగు పక్షిసంఘముల యాలాపములచే శ్రవణానందజనకమైనట్టియు, పుష్పించిన లతలచే దివ్యసౌరభయుక్తమైనట్టియు, పాడుచున్న కిన్నరులతో గూడినట్టియు, పెక్కు సెలయేళ్ళచే మానసాహ్లాదము గలుగజేయుచున్నట్టియు, నిత్యముక్త కామరూపులచే సేవించబడుచున్నట్టియు, మూడు యోజనములు వెడల్పును, ముప్పది యోజనములు పొడవును కలిగినట్టియు, శేషరూపమైనట్టియు, హరికి శేషభూతమైనట్టియు, సర్వభూతములకు శేషియైనట్టియు నతి పవిత్రమైనట్టియు, చూచినంతనే మోక్షదాయకమైనట్టియు నారాయణగిరి యను పేరుగలిగిన శ్రీవిష్ణుమూర్తియొక్క క్రీడాశైలమును భుజమునం దిడుకొని భగవంతుని పరివారపరిచారకులతోగూడ దేవుని సమీపించి యాయన నిర్దేశించిన స్థలమున దాని నుంచెను. శ్వేతవరాహరూపుడగు విష్ణువు దానినధిష్ఠించి స్వామిపుష్కరిణికి పశ్చిమభాగమున కోటిసూర్య సమప్రభమగు విమానమునందుండెను. తరువాత కొన్నిదినములకు స్వామిపుష్కరిణికి దక్షిణభాగమున మరియొక విమానమున శంఖచక్ర గదాధరుడగు శ్రీనివాసు డుద్భవించెను. (వ. పు. 34-వ అధ్యాయము.)

## 4. శ్రీస్వామిపుష్కరిణీ మాహాత్మ్యము

అప్పుడు బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు, ఋషులు, గంధర్వులు, మరుత్తులు మొదలగువారందరును వచ్చి హిరణ్యాక్షుని వధించుటకు స్వీకరించిన దంష్ట్రాకరాళవదనయుక్తాత్యుగ్రభయంకర వరాహరూపుడగు శ్రీమహావిష్ణువును నమస్కరించి స్తుతించి దేవమనుష్యాదుల నివాసార్థము మీరు భూమిని సముద్ధరించినారు కనుక వారిని రక్షించుటకు సౌమ్యమైన రూపమును ధరించి ధ్యానయోగమునం దశక్తులైన దేవమనుష్యాదులకును, స్త్రీ శూద్రులకును వరముల నిచ్చుచు నిచ్చటనే వసియింపుడని

ప్రార్థించిరి. అప్పుడు విష్ణువు ప్రసన్నుడై, చతుర్భుజయుక్తమైన శ్రీ భూ సహితమైన శరత్పూర్ణేందువదనమైన సర్వాభరణభూషితమైన సౌమ్య రూపమును ధరించి వైకుంఠముకంటె శ్రేష్ఠమైన వేంకటాద్రియందు నివసించెదననియు, మనుష్యులకు ప్రార్థించిన యర్థముల నిచ్చెదననియు నానతిచ్చెను.

క్రీడాద్రితోఁగూడ స్వామిపుష్కరిణి గరుడునిచే వైకుంఠమునుండి తెచ్చి భూమియందు నుంచబడినది. ఇది శ్రీభూదేవులకు మిక్కిలి ప్రియమైనది. అప్రాకృతజలముతో కూడినది. సుగంధయుక్తమైనది. మనోహరమైనది. గంగాది సర్వతీర్థములకును జన్మస్థలము. విరజవలె సర్వపాపములను పోఁగొట్టును. స్వర్ణస్తేయము, సురాపానము మొదలగు మహాపాతకములను నశింపజేయును. స్నానమాత్రముననే ఐహికఫలము లన్నింటిని నిచ్చును. దీని దర్శనమువల్లను, త్రాగుటవల్లను, స్మరించుటవల్లను సమస్తసిద్ధులును కలుగును. స్నానమువలన ఇష్టసిద్ధి కలుగును.

స్వామిపుష్కరిణీస్నానం సద్గురోః పాదసేవనమ్
ఏకాదశీవ్రతం చాపి త్రయమత్యన్త దుర్లభమ్ ॥
దుర్లభం మానుషం జన్మ దుర్లభం తత్ర జీవనమ్
స్వామిపుష్కరిణీస్నానం త్రయమత్యంతదుర్లభమ్ ॥

(వరాహపు. 35-వ అధ్యాయం)

## 5. క్రీడాద్రి (వేంకటాద్రి) కి నామభేదములు

క్రీడాద్రి యొక్కొక్క కారణంబుచే నొక్కొక్క నామంబును బొంది పెక్కు నామంబులచే వెలయుచున్నది. అందు కొన్ని సకారణంబుగా బేర్కొనబడినవి. చింతించినదానినంతను నిచ్చుటచే చింతామణి యనబడుచున్నది. జ్ఞానమునిచ్చునది యగుటచే జ్ఞానాద్రియని చెప్పబడుచున్నది. సర్వతీర్థమయమగుటచే తీర్థాద్రియను పేరును పొందినది.

పుణ్యపుష్కరిణులు విశేషముగా నుండుటచే పుష్కరాద్రి యనబడుచున్నది. ఈ గిరిమీదను యమధర్మరాజు తపమాచరించి యుండుటచే దీనికి వృషాద్రియను వ్యవహారము కలిగెను. బంగారుమయమగుటచే కనకాద్రి యనబడుచున్నది. నారాయణుడను విప్రుండు పూర్వ మీ నగముపై గొప్ప తపమాచరించి, యీ పర్వతము తనపేరున వెలయవలయునని విష్ణుమూర్తిని కోరెను. అందుచే దీనికి నారాయణాద్రియను నామము కలిగెను. వైకుంఠమునుండి తేబడుటచే వైకుంఠాద్రి యనబడుచున్నది. హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని ననుగ్రహించుటకు నారసింహావతార మిందు వెలయుటచే నిది సింహాచలమని పలుకబడుచున్నది. అంజనాదేవి యిందు తపమాచరించి దేవసాహాయ్యకారకుడైన హనుమంతుని కనుటచే దీని కంజనాద్రి యను వ్యవహారము కలిగినది. వరాహక్షేత్ర మిందుండుటచే దీనికి వరాహగిరియను పేరు కలిగెను. నీలుడను వానరేంద్రు డెల్లప్పుడును నిచ్చట యుండుటచే దీనికి నీలగిరి యను వ్యవహారము కలిగినది.

వేంకార మమృతబీజము. కటమన నైశ్వర్యము. అమృతైశ్వర్యముల సంఘమగుటచే నీ గిరి వేంకటాద్రి యనబడుచున్నది. శ్రీనివాసుడు దీని నధిష్ఠించియుండుటచే నిది శ్రీనివాసగిరి యనబడుచున్నది. భగవంతుని క్రీడలతో నిండియుండుటచే వైకుంఠపురవాసులు దీని నానందాద్రి యందురు. శ్రీపదయుక్తమగుటచేతను శ్రీనివాసమగుటచేతను దీనికి శ్రీశైలమనునది సార్థకనామ మగుచున్నది. (వరాహపు. 38-అధ్యాయం)

## 6. వేంకటాద్రియందు భగవంతుని యద్భుత కృత్యములు

ఈ గిరియొక్క మాహాత్మ్యమును విని కొందరు ఋషులు దీని మీదను నివసించుటకువచ్చి కొన్ని దినములైన పిదప అచ్చట యజ్ఞము చేయనారంభించిరి. అప్పుడు వారికి శ్రీమహావిష్ణువు లక్ష్మీసమేతుడై

ప్రత్యక్షమై యజ్ఞభాగమును స్వయముగా స్వీకరించెను. అప్పుడు మును లంపటు నాశ్చర్యముతోను ప్రీతితోను కూడినవారై, తమ భాగ్యమును కొనియాడి తమ జీవితమును సఫలమైనదని సంతోషించిరి.

పూర్వము మరియొక సమయమున శ్రీహరి వేంకటాద్రియందు విహరించుచుండగా, శరీరమంతయు సడలిపోయినట్టియు, దృష్టిబలము తగ్గినట్టియు, కాస్యవంగినట్టియు, నాకలిదప్పికలచే బాధపడుచున్నట్టియు, దారితప్పి యొక బండపై కూల్బొనియున్నట్టియు నొక వృద్ధబ్రాహ్మణుడు కనబడెను. అతడు కౌండిన్యుడను తనపుత్రునికొరకు కేకవేయుచుండెను. "శతవృద్ధుడనగు నన్ను విడచి యెచ్చటికి పోయితివిరా, కౌండిన్యుడా" అని యరచుచుండెను. అప్పుడు కుమారవేషమున నున్న శ్రీహరి, "ఇచ్చట మనుష్యులెవ్వరును లేరే? కౌండిన్యుడెచ్చటనున్నాడు! ఎందుల కట్లరచుచున్నావు?" అని యడిగెను. అప్పుడు వృద్ధుడు "అయ్యో, అటులైనచో నేను దూరమగు నాశ్రమమునకు నెట్లు పోగలను? బంధువులు లేనిచో నే నశక్తుడనుగదా? ఇట్టి దుర్బలుడైన నన్ను విధి యింక నెందుకు యీ లోకమునందుంచుచున్నాడు? కొనిపోకూడదా?" అని మొరబెట్టెను. అది విని కుమారరూపమును ధరించియున్న విష్ణుమూర్తి "ఓ బ్రాహ్మణోత్తముడా! నీ శరీరము జర్జరితమైయున్నది. నీకు కన్నులు కనబడుటలేదు. నీ కింకను జీవనేచ్ఛకలదా! లేక నీవు వెనుక జెప్పినది నిజమా? చావనెంచితివా?" అని సోపహాసముగా ప్రశ్నించెను. దాని కావిప్రుడు "నాకు జీవనేచ్ఛ నిజముగా లేదు. కాని నిత్యమైన జ్యోతిష్టోమము మొదలగు కర్మలు నాచే ననుష్ఠింపబడలేదు. ఇట్లు దేవతలకు నా ఋణమును తీర్చుకొనక యెట్లు మరణించగలను?" అని ప్రత్యుత్తర మిచ్చెను. అదివిని శ్రీహరి యాతనిని తన కరంబు గ్రహింపుమని యానతిచ్చి, యతనిని తోడ్కొనిపోయి యొక శుభధారయందు స్నానము చేయుమని చెప్పెను. స్నానముచేసి లేచుసరికి ఆ విప్రుడు పదియారేండ్ల

ప్రాయపు కుమారుడుగా మారియుండెను. అప్పుడు శ్రీహరి యావిప్రుని "నీవు చేయదలంచుకొనిన కర్మల నాచరింపుము. అందుకు తగిన శరీరమునేగాక ధనమునుకూడ నీకిచ్చుచున్నానని" చెప్పి, చూచు దేవ మనుష్య గంధర్వాదులందరును నాశ్చర్యపడుచుండగా నంతర్ధానమయ్యెను. వృద్ధుడు స్నానముచేయగా కుమారుడగుటచే ఆ ధారకు 'కుమారధార' యని దేవతలు పేరిడిరి.

(వరాహపు. 37-అధ్యాయం)

పూర్వము సాంకాశ్యమును శంఖణుడను చంద్రవంశపు రాజు పాలించుచుండెను. పరంపరాప్రాప్తమగు నా రాజ్యము సామంత రాజులచే నాక్రమింపబడి శంఖణుడు భార్యలతోను నమాత్యులతోను రాజ్యమునుండి వెడలగొట్టబడెను. ఆ రాజు దుఃఖించి దక్షిణమునకు జని సేతువువద్ద సముద్రమున స్నానముచేసి, తిరిగి యుత్తరముగాబోయి సువర్ణముఖిని చేరి యందు స్నానముచేసి, దాని యుత్తరతీరమందున్న పద్మసరోవరమును సమీపించి యందు స్నానముచేసి నిత్యకర్మల ననుష్ఠించి విచారముతో నిద్రించెను. రాజ్యభ్రంశమువలన కలిగిన దుఃఖముతో నున్న యా రాజున కొక యశరీరవాక్కు వినబడెను, అది యిట్లు "ఓ రాజా ! విచారింపకుము. ధైర్యము నవలంబింపుము. ఇట కుత్తరమున క్రోశదూరమున వేంకటాద్రియను మహాగిరి కలదు. అచ్చట నిర్హేతుక దయామయుడును నాశ్రితావనుడును నగు కమలాపతి కలడు. అచ్చట వికసించిన పద్మములతో శోభించుచున్న స్వామి పుష్కరిణియను సరస్సు కలదు. దాని పశ్చిమ తీరమున సుందరమైన నగము కలదు. నీ వచ్చటకు పోయి యా సరస్తీరమున కుటీరమును నిర్మించుకొని, త్రిసంధ్యలయందును నా సరస్సున స్నానముచేసి చతుర్భుజుడై శంఖచక్రపాణి యగు హరిని శ్రద్ధతో ఆఱుమాసము లర్చింపుము. అట్లుచేసినచో నీ రాజ్యమును నీవు పొందెదవు". అది

విని యారాజు విచారమును విడచి వెంటనే వేంకటాద్రికేగి యశరీర వాక్కు చెప్పినట్లు చేసెను. అప్పుడు సరోవర మధ్యనుండి శ్రియఃపతి కోటిసూర్య సమప్రభతో సుద్భవించి పది దిక్కులను ప్రకాశింపజేయుచు శంఖచక్రగదాపాణిగా శ్రీభూదేవులతో కూడ ప్రత్యక్షమయ్యెను. శంఖణుడు వెంటనే లేచి శ్రీహరికి నమస్కరించి రాజ్య స్వామ్యమును కోరెను. అప్పుడు శ్రీహరి "విచారింపకుము. నీవు మహాభక్తితో స్వామిపుష్కరిణిలో స్నానముచేసితివి. గనుక నీకు స్వామిత్వము సిద్ధించును. ఈరీతిగా యెవరెవరు స్వామిపుష్కరిణిలో స్నానము చేయుదురో వారందరికి వారివారి భక్తి ననుసరించి స్వామిత్వము సిద్ధించును. నీవు పోయి నీరాజ్యమును పొందుము" అని పలికి యంతర్ధానమును పొందెను. శంఖణుడు సంతోషించి నిజభార్యలతో స్వదేశమునకు పయనమయ్యెను. అప్పుడు గోదావరీతీరమున తన ప్రజ లెదురుగా వచ్చి "సామంతరాజు లందరును యొకరితో నొకరు పోరి రాజ్యమును విడుచుకొనిరి. కాబట్టి నీవు వచ్చి యథాపూర్వము మమ్ము లను పాలింపుము" అని చెప్పి అతనిని పిలుచుకొనిపోయి రాజ్యమున పట్టాభిషిక్తుని జేసిరి. ఇట్లు స్వామిపుష్కరిణియను నామ మా సరస్సు నకు, తీర్థము లన్నిటికిని స్వామిని యగుటవల్లనే కాక స్వామిత్వమును ప్రసాదించుటచే గూడ నన్వర్థమగుచున్నది.

(వరాహపు. ३३-వ అధ్యా.)

మధ్యదేశమున నాత్మారాముడను బ్రాహ్మణుడుండెను. అతను మహాకులప్రసూతుండుగాను దేవబ్రాహ్మణపూజకుడుగాను నుండెను. అతడు మిక్కిలి విష్ణుభక్తుడును వేదవేదాన్తపారగుడుగానుండెను. అతని తండ్రి చనిపోయిన కొలదిదినములకే యతని ధనమంతయును పోయెను. వృత్తి నశించెను. ఎవరును లక్ష్యపెట్టకుండిరి. తన యవస్థను తలంచు కొని యతను విచారించి "యేమి చేయుదును, యెచ్చటికి పోయెదను"

అని చివరకు వేంకటాద్రికి వెళ్ళుటకు నిశ్చయించుకొనెను. అతను కపిలతీర్థమునకుపోయి స్నానముచేసి కపిలేశ్వరుని దర్శించి, క్రమముగా పదునేడు తీర్థములలోను స్నానముచేసి వేంకటాద్రికిఁ బోయెను. తీర్థములలో స్నానము చేయుటచే పాపమంతయు బోయి చిత్తనైర్మల్యము కలవాడయ్యెను. వేంకటాద్రిచరియను కూర్చుండి చింతాశోక పరాయణుడుగా నుండెను.

సమీపమున గుహలో ధ్యానయోగ పరాయణుడును జ్వలనోపముడును నగు సనత్కుమారయోగీంద్రుని గనెను. అతను గొప్పయోగీంద్రుడనియు భూతభవిష్యద్వర్తమానముల నెఱిగిన వాడనియు తెలిసికొని తన యవస్థను గురించి యతని నడుగవలయునని నిశ్చయించుకొని యతనిని సమీపించి నమస్కరించి పాపాత్ముడనగు నేను నిన్ను శరణు పొందుచున్నాను. నాకు హితమునుపదేశింపుమని ప్రార్థించెను. అతను కొంతసేపు ధ్యానించి యిట్లు పలికెను. "నీవు పూర్వజన్మమున పాపములు చేసియుంటివి. అందుకు ఫలమిప్పు డనుభవించుచున్నావు. అనేక దానవిఘ్నముల జేసితివి. సుఖముగానున్నవారికి నానా విధములగు పీడలను కల్పించితివి. అనాచారములు చాలగా జేసితివి. ప్రణతార్తిహరుడగు విష్ణువును భక్తితో గొలువలేదు. అయినను నీకు తరుణోపాయము కలదు. చెప్పెదను వినుము. సర్వలోకములకు జననియగు మహాలక్ష్మి సర్వపాపములను పోగొట్టగలదు, సర్వసంపదలను నియ్యగలదు. ఆమె వ్యూహమంత్రమును నీకుపదేశించెదను. ఆమెను శీఘ్రముగా గొలువుము" అని మంత్రమునుపదేశించి యంతర్ధానమును పొందెను.

ఆత్మారాముడు మిక్కిలి సంతసించి స్నానమాచరించి మంత్రమును జపించుచు వేంకటాద్రిపైకి వెళ్లెను. అచ్చట ననేకతీర్థములను వీక్షించుచు స్వామిపుష్కరిణియొద్దకు చేరెను. అందు స్నానముచేసెను. స్నానముచేయగానే యతని పాపముపోయి శరీరమతనికి చులకనగా

గనబడెను. ఆ పుష్కరిణీ తీరమున అనేకరత్నఖచితమగు బంగారు విమానమున సర్వాభరణసంపూర్ణుడును పీతాంబరధరుడును శ్రీభూమి సహితుడును నగు వేంకటేశ్వరుడు ప్రత్యక్షమయ్యెను. ఆత్మారాము డతనికి సాష్టాంగప్రణామము నాచరించి ముగ్ధుడై యతని యెదుట నిలిచెను. సర్వజ్ఞుడును కరుణారూపుడును నగు శ్రీనివాసుడతని మనోగతాభిప్రాయము నెఱింగి "భయపడకుము, నీపాపములను క్షమించితిని. నీకు దీర్ఘాయువును, దీర్ఘకాలము మహదైశ్వర్యమును ప్రసాదించితిని. నీ యిష్టమువచ్చినట్లనుభవింపుము" అని పలికెను. ఆత్మారాముడు తిరిగియు సాష్టాంగప్రణామము నాచరించి లేచుసరికి హరి యంతర్ధానమయ్యెను. ఇది స్వప్నమా నిజమా యని వితర్కించుకొనుచు నాత్మారాముడు వేంకటాద్రిని దిగి దాని దరి నివాస మేర్పరచుకొని దీర్ఘకాలము సర్వసుఖముల ననుభవించుచు జీవించెను. (వరాహపు. 39-వ అధ్యా.)

## 7. కాపిలాది సప్తదశ తీర్థముల మాహాత్మ్యము

వేంకటాద్రికి క్రిందను కాపిలతీర్థము కలదు. దాని ప్రక్కనుండు కాపిలలింగము పూర్వము కపిలమహామునిచే పాతాళమున పూజింపబడు చుండినది. ఆ లింగము భూమిని భేదించుకొని పాతాళము నుండి పై కెగసినది. సమస్తదేవతలు ప్రార్థించగా నది భూమియందు స్థాపితమైనది. దానియెదుట భూమిని భేదించుకొని కపిలపైకి నిర్గమించినది. కాపిలతీర్థము సర్వపాపప్రణాశనము.

దానిపైభాగమున పరమపావనమైన శక్రతీర్థము కలదు. అహల్యా సఙ్గసముద్భూతమగు పాపము శక్రునకిందు స్నానము చేయుటచే తొలగినది.

దానిపైభాగమున పుణ్యమైన విష్వక్సేన తీర్థముకలదు. వరుణుని కుమారుడగు విష్వక్సేనుడు దీనిసమీపమున దుష్కరమైన

తపమాచరించి హరియొక్క సారూప్యమునుపొంది సేనాపతిత్వమును సంపాదించెను.

దానిపైన పంచాయుధ తీర్థములు కలవు. వానికి పై భాగమున అగ్నితీర్థము కలదు. దానికిపైన బ్రహ్మహత్యాది మహాపాతకములను నశింపజేయు బ్రహ్మతీర్థము కలదు. ఆ పైని సప్తమునితీర్థములనెడి యేడు తీర్థములుకలవు. ఈ తీర్థములన్నియు నుత్తరోత్తరము దశాధిక ఫలముల నిచ్చునవిగా నున్నవి.

పూర్వమొక బ్రాహ్మణుడు ప్రపంచమంతను తీర్థయాత్ర చేయ దలంచినవాడై బయలువెడలెను. అతనికి శ్రీ మహావిష్ణువు స్వప్నమందు ప్రత్యక్షమై "ఎందుకంత శ్రమపడెదవు. వేంకటాద్రియందు సప్తదశ తీర్థములు కలవు. వానిలో నీవు స్నానముచేసినచో సర్వతీర్థములలో స్నానముచేసిన పుణ్యమును బడసెదవు" అని యానతిచ్చెను. ఆ బ్రాహ్మణుడు శ్రీ మహావిష్ణువు చెప్పినప్రకారము తీర్థయాత్రనుండి విరమించి వేంకటాద్రినిపొంది యా పదియేడు తీర్థములలోను యథా శాస్త్రముగా స్నానము చేసి తీర్థయాత్రఫలమును పొందెనని ప్రతీతి కలదు.

భువనత్రయములో గల సమస్తతీర్థములకు ప్రకృతి భూతములగు తీర్థములు వేంకటాద్రియందు గలవు. అందుచే వేంకటాద్రిని ప్రదక్షిణము చేసినచో భూప్రదక్షిణము చేసిన ఫలము లభించును. బలరాముడు వేంకటాచలమును దర్శించగానే తీర్థయాత్రాఫలమును పొందెనని చెప్పుచున్నారు.

శ్రీ కృష్ణుడుపదేశించగా ధర్మరాజాది పాండవులు వేంకటాద్రికి వచ్చి యొక సంవత్సరము పాండవతీర్థమున నిత్యము స్నానముచేయుచు నందుండిరి. సంవత్సరాంతమున ధర్మరాజునకు 'ఈ తీర్థమున'

స్నానముచేయుచు మీరొక సంవత్సరము గడిపితిరి కనుక ఆ పుణ్యముచే మీరు క్షీణపాపులై యుద్ధమునందు జయమును పొంది మీ రాజ్యమును సంపాదించుకొనెదరు '' అని స్వప్నమున వినబడెను. అది మొదలా తీర్థమునకు పాండవతీర్థమని ప్రతీతి కలిగినది.

(వరాహపు. 40-వ అధ్యా.)

## 8. శ్రీరాముడు వేంకటాద్రికి వచ్చుట

ఋష్యమూకపర్వతమునుండి వానరసైన్యముతోగూడ రావణ వధార్థము వెళ్ళుచు శ్రీ రా ము డు శేషాచల సమీపమునకు వచ్చెను. అప్పుడాంజనేయుని తల్లియగు యంజనాదేవి రాముని సమీపించి నమస్కరించి యిట్లు పలికెను :— '' నీ యాగమనమును నిరీక్షించుచు నీ గిరియందు నేనును నీ కాననమున తపమాచరించుచున్న నీ మునులును వేచియున్నాము. మమ్మందర ననుగ్రహించి వెళ్లదగుదువు ''. అప్పుడు శ్రీరాముడు '' నేనిప్పుడు వచ్చినచో కాలాతీత మగును. నేనిప్పుడు త్వరగా వెళ్లవలసి యున్నది. తిరిగి వచ్చునప్పుడు తప్పక మీ గిరికి వచ్చెదను '' అని ప్రత్యుత్తర మిచ్చెను. శ్రీరాముడానతిచ్చిన మాటలను విని హనుమంతుడు ప్రణమిల్లి యిట్లు పలికెను. '' ఈ వానరసేన శ్రాన్తమై యున్నది. యెచ్చటనో యొకచోట విశ్రమించవలసి యున్నది. ఈ పర్వతము మార్గమందే యున్నది. అదియునుగాక యిది పుష్పఫలద్రుమములతో నిండియున్నది. అనేకములగు సెలయేళ్ళతో కూడియున్నది. ఇందు స్వాదుకందమూలములను విశేషముగా నున్నవి. వృక్షములలో తేనె విశేషముగా నున్నది. ఇదంతయు విచారించి తమ యిష్టమువచ్చినట్లాజ్ఞాపింపుడు. '' అన రాముడతని యభిప్రాయమును గ్రహించి యా పర్వతముమీఁద విశ్రమించి వెళ్ళుట కంగీకరించెను.

శ్రీరాముడు వేంకటాద్రిమీది కెక్కుచు, బ్రహ్మలోకమునకు పోవనెంచి తపస్సుచేయు చున్నట్టివాడును, శ్రీరాముడు సౌమిత్రితో గూడ నిచ్చటికి రాగా వారిని నమస్కరించి పిదప బ్రహ్మలోకమును పొందుమని బ్రహ్మచే వరంబొసంగబడిన వాడునగు నిర్లోముడను విప్రుని పూజను స్వీకరించి యతనిని బ్రహ్మలోకమునకు బంపి ఆకాశగంగను చేరి యచ్చట యంజనాదేవియాశ్రమమున పూజను గైకొని యచ్చట నుండి స్వామిపుష్కరిణికి వచ్చెను. అచ్చట సౌమిత్రి. సుగ్రీవ, అంగద, జాంబవంత, నీలాదులతో పుష్కరిణిలో శ్రీరాముడు స్నానముచేసి దాని నైరృతిభాగమున ప్రత్యేకముగా పర్ణశాలల నేర్పరచుకొని వారితో స్వాదుఫల మూల మధువులను భుజించి యక్కడ సుఖముగా నుండెను. వానరులు రుచ్యములైన ఫలములను భుజించి మధువును త్రాగి యా పర్వతమున విహరించుచుండిరి.

(వరాహపు. 41-వ అధ్యా.)

## 9. వానరులు వైకుంఠగుహను ప్రవేశించుట

స్వామిపుష్కరిణికి ఈశాన్య భాగమున నొకగుహకలదు. గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు, మైందుడు, ద్వివిదుడు, సుషేణుడు మొదలగు వానరులు చీకటిగ్రమ్మిన యా గుహను ప్రవేశించిరి. సింహతుల్యపరాక్రములగు నా వానరులందరును తిమిరావృతమైనప్పటికిని నాగుహలో చాలదూరము వెళ్ళిరి. అచ్చట కోటిసూర్య సమప్రభ కలిగిన యొకజ్యోతిని వారు కనిరి. అందు బంగారుమయమైన యొక పురము కానవచ్చెను. ఆ పట్టణము రమ్యోద్యానశతములతోడను, స్ఫటికమువంటి శుద్ధజలముతో నిండిన నదులతోడను, రత్నమాణిక్య వైడూర్యముక్తాది మణినిర్మిత గోపురములతోడను, అనేక మండపములతోడను, ప్రాసాదములతోడను, అనేక

పీఠికశతములతోడను, స్వర్గమంగళములతోడను శోభించుచుండెను. అందు నివసించు జనులందరును చతుర్భుజులుగాను శంఖచక్రధరులుగాను, సర్వాభరణభూషితులుగాను, శుక్లవసనులుగాను, దివ్యచందనలిప్తాంగులుగాను, పరమానందపూరితులు గాను నుండిరి. ఆ పురమధ్యమున దివ్యమైనట్టియు, సూర్యసన్నిభమైనట్టియు అత్యున్నతమై మేరుశృఙ్గతుల్యమైనట్టియు, మనోహరమైనట్టియు మణిమండపములతో కూడుకొన్నట్టియు, సర్వవాద్యధ్వనియుక్తమైనట్టియు, నృత్తవాదిత్రసంపన్నమైనట్టియు, కిన్నరస్వరములతో కూడినట్టియు విమానము కనబడెను. ఆ విమానమందు పూర్ణచంద్ర నిభాననుడును, చతుర్భుజుడును. శంఖచక్రధరుడును, పీతాంబరధారియు, కాంచనాసన సమాసీనుడును, ఫణామణి మహాకాన్తి విరాజిత కిరీటుడును, భోగిభోగ సమాసీనుడును. సర్వాభరణ భూషితుడును, ఆసనముమీద నుంచబడిన దక్షిణకరము కలవాడును, ప్రసారిత దక్షిణపాదము కలవాడును, శ్రీభూదేవులచే సేవించబడుచున్నవాడును, వైజయంతిచే ప్రకాశించుచున్నవాడును, శ్రీవత్సకౌస్తుభములతో కూడిన వక్ష స్థలము కలవాడును, వనమాలచే నలంకరింపబడినవాడును, ఛత్రచామరములతో సేవించుచున్న స్త్రీలతో కూడినవాడును నగు పరమపురుషు నొకని చూచిరి. వానిని చూచి వారు విస్మయావిష్టచేతనులుకాగా నొక చతుర్భుజుడగు నద్భుత పురుషుడు దండమును నెత్తి వారి నందరిని బెదిరించెను. ఆ వానరులందరును భయపడి యా గుహనుండి బైటికి పరుగులిడిరి. ఆ యాశ్చర్య దృశ్యమును వారితరవానరులకు దెలుపగా వారందరును రావణుడే యట్టి మాయారూపమును ధరించి వారిని వంచించెనని తలంచి అందరును కలసి యా గుహను వెదకుచు వెళ్ళిరి. కాని వారికి తిరిగి యాగుహ కానరాదయ్యెను. వారందరు నది భ్రమయనితలంచి మిన్నకుండిరి. మరునాడు శ్రీరాముడు వానరులతో గూడ వేంకటాద్రిని దిగి లంకకు

పోయి రావణుని సంహరించి సీతను పొంది యయోధ్యకు జని భరత శత్రుఘ్నులతో చేరి స్వామిపుష్కరిణీ మాహాత్మ్యమువలన రాజ్యమును పొంది పట్టాభిషిక్తుడయ్యెను.

## 10. వైకుంఠగుహాప్రభావము

వైకుణ్ఠగుహ మునులకును యోగులకును దుర్జ్ఞేయము. పరమాత్ముని మాయచే నది దేవతలకుకూడ దుర్జ్ఞేయము. వైకుంఠమే పరమేశ్వరుని లీలచే వానరులకు ప్రకాశింపజేయబడినది. గుహయందు వానరులచే జూడబడిన శంఖచక్రధరులు పరమానన్దరూపులగు నిత్యముక్తులు. వారు సర్వదా బ్రహ్మానందము ననుభవించుచుందురు. భగవంతునితో గూడ కామరూపములతో సంచరించుచుందురు. సర్వదా భగవత్కైంకర్యమును చేయుచుందురు. వారు వేంకటాద్రినాశ్రయించి యుందురు. ఆ పర్వతమునందు జనాధిక్యము కలిగినప్పుడు వారు గుహలో నివసించుచుందురు. వైకుంఠము వానరుల కాగుహలో నగపడుటచే దానికి వైకుంఠగుహయని నామముకలిగెను.

(వరాహపు. 42-వ అధ్యా.)

## 11. రావణాదిరాక్షసులచే పీడింపబడిన దేవర్షులు శ్రీ మహావిష్ణువును వెదకుట

పూర్వమొకప్పుడు జాబాలి, కాశ్యపుడు, గౌతముడు, అగస్త్యుడు, వామదేవుడు, శతానన్దుడు మొదలగు మునులును, సనకాదియోగులును, ఇంద్రాదిదేవతలును హిరణ్యకశిపుని వంశసంభూతులగు దురాత్ములగు రావణాదిదైత్యులచే పీడింపబడినవారై విష్ణుమూర్తికి తమబాధలను నివేదించుటకు కలసి బైలువెడలిరి. విష్ణుమూర్తిని వెదకుచు వారు క్షీరసాగరమున కుత్తరతీరమును పొంది జనార్దనుని స్తుతించుటకు మొదలుపెట్టిరి.

కొంతసేపటికి శంఖచక్రగదాధరుడగు నొక వైకుణ్ఠవాసి వారికి ప్రత్యక్షమై "ఓ మునీశ్వరులారా! మీ రెందుల కిచ్చటికి వచ్చితిరి. కమలాపతి యిట లేడు. భూమియం దేదోయొక పర్వతముమీద విహరించుచున్నాడు. మీరచ్చటికి పొండు" అని పలికి యంతర్హితుడాయెను.

క్షీరాబ్ధిని విడచి భూమియందు రమాపతి యెందులకు నివసించుచున్నాడని వారు విచారించుచు క్షీరాబ్ధినుండి మరలి భూమికి పయనమయిరి. మార్గమధ్యమున వారికి శుద్ధస్ఫటికమువలె శుభ్రమైనట్టియు మహతీ వీణను వాయించుచున్నట్టియు, కర్పూరోర్ధ్వపుండ్రధారియునగు నారదముని వైకుంఠమునుండి వచ్చుచు కనబడెను. అప్పుడామునులు నారదునిచూచి " ఓ మునీంద్రా! యెచ్చటనుండి వచ్చుచున్నావు. నీకు మూడులోకములును తెలియునుగదా. అందు నీ వెరుంగని విషయము లేదుకదా, లక్ష్మీవల్లభు డెచ్చట నున్నాడు చెప్పుము. రావణాది దైత్యులు మనుష్యులను, తాపసులను, యోగులను, మునులను, బాధపెట్టుచున్నారు. వారిని నిగ్రహించుటకు విష్ణుమూర్తికే శక్తికలదు. కాని మరెవ్వరికినిలేదు. అతని శరణువేడవలసియున్నది. అతడెచ్చట నున్నాడో చెప్పుము" అని యడిగిరి. వారి ప్రశ్నకు నారదుడు "నేనును నారాయణుని దర్శించుటకు పరమపదమునకు వెళ్ళితిని. కాని యచ్చట నొకడు నాతో విష్ణుమూర్తి భూలోకమున నేదో యొక గిరిపైని రమతోగూడ విహరించుచున్నాడని చెప్పెను. అందుచే నేను మరలి వచ్చుచున్నాను. బ్రహ్మలోకమునకు వెళ్ళుదుము రండు. పితామహునకు సర్వము తెలియును. నారాయణుడెచ్చట నున్నదియు నతను చెప్పగలడు " అని సమాధానమిచ్చి వారి నందరిని బ్రహ్మలోకమునకు కొనిపోయెను. అచ్చట నగ్నివలె ప్రకాశించుచున్నట్టియు, మూర్తీభవించిన వేదశాస్త్రములవలె నున్నట్టియు, గాయత్రీ సావిత్రీ సరస్వతులచేతను, కిన్నర గంధర్వ సిద్ధసంఘములచేతను, దిక్పాలకులచేతను సేవింపబడు

చున్నట్టియు పద్మాసనాసీనుడై యున్నట్టియు చతుర్భుజుడైన చతుర్ముఖుని దర్శించిరి. సాష్టాంగప్రణామము లాచరించిరి. చతుర్ముఖుడు వారిని కుశలప్రశ్న చేయగా వారు "స్వామీ, నీకృపచే మాకందరకు మంగళమగుచున్నది. కాని రావణుడను దుష్టరాక్షసునివల్ల గొప్పబాధ కలుగుచున్నది. కర్మానుష్ఠానతత్పరులగు మునులను హింసించుచున్నాడు. తపోవ్యయమునకువెరచి వా రా బాధలను సహించుచు వచ్చిరి. కాని యికను సహింప జాలరు. సర్వోపాయ విశారదుడగు విష్ణువుమాత్రమే వారిని చంపుటకు శక్తుడు. అత డీ భువనత్రయమున మాకెక్కడను కనబడలేదు. కాబట్టి యిక నీవే మాకు శరణము. మమ్ము రక్షింపుము" అని ప్రార్థించిరి.

(వరాహపు. 43-వ అధ్యా.)

## 12. చతుర్ముఖునితోగూడ దేవర్షులు వేంకటాద్రికి వెళ్లుట

అప్పుడు బ్రహ్మదేవుడు వారికి రావణవృత్తాంతము నిట్లుచెప్పెను. "పూర్వము రావణునిచే గొప్ప తపమాచరింపబడినది. దానిచే నతనికి మనుష్యేతరులచే నవధ్యత్వము లభించినది. అతనికి మనుష్యుని వల్లనే వధ నిశ్చయింపబడినది. అందుచే నతనిని చంపుటకు విష్ణువే మనకు గతి. అతడిప్పుడు భూలోకమున వేంకటాద్రియందున్నవాడు. రాక్షసులను జంపుట కతనిని మనమిప్పుడు ప్రార్థింపవలసియున్నది. అని చెప్పి మరియు "రండు. నేనుకూడ వచ్చెద నతనిని వెదకుటకు, ఆలస్యము చేయకుడు, కాని విష్ణువును దర్శించుట సులభముకాదు. సానువులయందు, నదులయందు, సెలయేళ్ళయందు, గుహలయందు, వెదకవలసియున్నది. అతనికి వేంకటాద్రి చాల ప్రియమైన పర్వతము, పక్షిమృగాది రూపములను ధరించి రమతో క్రీడించుచుండును. గిరిప్రదక్షిణమున నతనికి నతిప్రీతి కలదు. కాబట్టి ప్రదక్షిణరూపముననే

యీ గిరియందతనిని వెదకుదము. ఇక్ష్వాకువంశ ప్రభుడగు దశరథ మహారాజు పుత్రసంతానము కొఱకై నీ నగమునకు వచ్చి స్వామి పుష్కరిణీ తటమున గొప్పతపస్సును చేయును. అతని తపమునకు మెచ్చి విష్ణుమూర్తి యతనికి ప్రత్యక్షము కాగలడు " అని చతుర్ముఖుడు నుడివెను. ఈ బ్రహ్మవాక్యములను విని దేవర్షులు బ్రహ్మలోకమును విడచి శేషశైలమును చేరిరి. అచ్చట వారు శ్రమదీర్చుకొని శృంగ ములయందును, వనములయందును, నదులయందును, తీర్థములయం దును, సరస్సులయందును, నూతులయందును, స్నానములు చేసి శ్రీనివాసుని పూజించి అమృతకల్పములగు ఫలములను, నివేదించిరి. కాని యచ్చట గోపురమునుగాని, విమానమునుగాని, దేవునిగాని వారు చూడరైరి.

## 13. పుత్రార్థియగు దశరథుడు వేంకటాద్రికి వచ్చుట

ఈ సమయమున ధర్మాత్ముడగు దశరథమహారాజయోధ్యయం దుండి భూమిని పాలించుచుండెను. చిరకాలమైనను నతనికి పుత్రముఖ దర్శనభాగ్యము కలుగలేదు. అతను తనకు వంశకరుడగు పుత్రుడు లేకపోవుటచే మిక్కిలి విచారించి ఆతని గురువగు వసిష్ఠమహామునిని చేరి యిట్లుపలికెను ; " నీవంటి మహానుభావుడు పురోహితుడుగా గల వంశమున పుట్టియు నాకు నేదోయొక పురాకృత పాపమువలన పుత్ర సంతానము కలుగలేదు. అందుకు ప్రతిక్రియ విధించి నాకు పుత్రుడు పుట్టునట్లనుగ్రహింపుము ". అదివిని వసిష్ఠుడు క్షణమాత్రము ధ్యానించి యిట్లుపలికెను. ఓ రాజేంద్రా ! పుణ్యాత్ముడగు నీకు పాపమెట్లు కలు గును. అయినను నీకు పుత్రప్రాప్తికలుగుటకు ప్రతిబంధకమగు నేదో పాపమున్నట్లు నాకు తోచుచున్నది. ఆ పాపము శాంతించుటకును, పుత్రులు కలుగుటకున్ను నీవు శ్రియఃపతియగు శ్రీ వేంకటాధీశుని సేవిం పుము." శ్రియఃపతియగు శ్రీ వేంకటేశు డిప్పుడెచ్చట నున్నవాడు ?

అతని దర్శనము నాకెట్లు కలుగునని దశరథు డడుగగా వసిష్ఠమహాముని యిట్లు పలికెను. "ఓ రాజా ! భాగీరథికి దక్షిణమున నిన్నూరుయోజనముల దూరమున సువర్ణముఖీనది కుత్తరమున నొక క్రోశదూరమున శ్రీ వేంకటాద్రి కలదు. ఈ పర్వతము ప్రాకృతము కాదు, దివ్యమైనది. ఇది యనేక పుణ్యతీర్థములచేతను పుష్కరిణులచేతను శోభించుచున్నది. నారాయణునకు నితర వైకుణ్ఠపురవాసులకును నీ పర్వతము చాల ప్రియమైనది. ఆ పర్వతము మీద శ్రీదేవితో గూడ శ్రీనివాసుడు నిత్యము విహరించుచున్నాడు. హరిదర్శనముకొరకనేక మును లచ్చట యజ్ఞములాచరించుచున్నారు. దేవతలు, యోగులు సంతత మచ్చట తప మాచరించుచున్నారు. స్వయంభువగు బ్రహ్మ కూడ నా పర్వతముమీద లోకానుగ్రహముకొరకు తపస్సు చేయుచున్నాడు. అతనికి విష్ణుమూర్తి దర్శనమీయగలడు. దర్శనము వల్లనే యతడందరియభీష్టములను నెరవేర్చును. నీ యభీష్టముకూడ నచ్చట నెరవేర గలదు". వసిష్ఠుని వాక్యములను విని దశరథుడు మిక్కిలి యానందించి వసిష్ఠునితోగూడ వేంకటాద్రికి పయనమై వెళ్లెను. అచ్చట పుణ్యతీర్థములయందు స్నానముచేసి సబాహ్యాభ్యన్తర శుద్ధుడై క్షాలితాఘుడై సుతప్రాప్తిని నిరీక్షించుచు కొంత కాల ముండెను.

(వరాహపు. 44-వ అధ్యా.)

## 14. దశరథుడు స్వామిపుష్కరిణీ తీరమున తపము చేయుచున్న మునులను జూచుట

ఒకనాడు దశరథుడు వసిష్ఠునితోగూడ వేంకటాద్రియందు సంచరించుచు స్వామిపుష్కరిణీతీరమునకు వచ్చెను. అనేక పద్మములతోను, జలచరములతోను శోభించుచున్న యాపుష్కరిణిని జూచి మిక్కిలి

యానందించెను. ఆ పుష్కరిణీతీరమున తపస్సుచేయుచున్న యనేక మునీశ్వరులను చూచెను. కొందఱు వీరాసన—పద్మాసన—భద్రాసన—సిద్ధాసన—స్వస్తికాసనముల గూర్చుండి తపస్సు చేయుచుండిరి. మరి కొందరు పర్ణాశనులుగాను, వాయుభక్షకులుగాను నుండిరి. కుంభక—రేచక—పూరకములను కొంద రాచరించుచుండిరి. కొందరు హోమములను చేయుచుండిరి. మరికొందరు విష్ణువునర్చించుచుండిరి. కొందరు శ్రీనివాసుని నర్చించుచుండిరి. కొందరు తారకబ్రహ్మాది మంత్రములను జపించుచుండిరి. ఇట్టి మునీశ్వరుల మధ్యను చతుర్ముఖుడగు బ్రహ్మ శ్రీనివాసుని మనసున ధ్యానించుచు వ్యాఘ్రచర్మమున నాసీనుడై యుండెను. వారినందరిని జూచి యాశ్చర్యచకితమానసుడై దశరథుడు వారందరికి నమస్కరించి నిలిచి యుండెను.

(వరాహపు. 45-వ అధ్యా.)

## 15. శ్రీ భగవంతు డావిర్భవించుట

అప్పుడు వసిష్ఠుడు దశరథమహారాజుతో నిట్లుపలికెను "ఓ రాజా! చూడుము. ఇచ్చట బ్రహ్మ మునులతోగూడ తీవ్రమగు తపము నాచరించుచున్నాడు. అందుచే నిశ్చయముగా శ్రీ మహావిష్ణువు శీఘ్రముగా నిచ్చట యావిర్భవించగలడు. నీవు కూడ నీ పుష్కరిణిలో స్నానముచేసి శుచివై జపము చేయుచుండుము." అప్పుడు దశరథ మహారాజు "స్వామీ! అట్లే చేసెదను. నాకొకమంత్రము నుపదేశింపుము" అని ప్రార్థించెను. అతనికోరికపైని వసిష్ఠుడు దశరథునకు వేంకటేశాష్టాక్షరి నుపదేశించెను. ఆ మంత్రమును స్వీకరించి దశరథుడు పుష్కరిణిలో స్నానముచేసి యొక శుచియైన స్థలమున నాసీనుడై మంత్రమును జపించుచుండెను.

కొంత సేపటికచ్చట నొక గొప్పశబ్దము వినబడెను. ఇది యేమని యందరు నాశ్చర్యముతో చూచుచుండగా నచ్చట కోటిసూర్యచంద్రులేకీభవించి యుదయించిన నెంతకాంతి యుండునో యంత కాంతి కనబడెను. ఆ తేజస్సును చూడలేక యందరును కండ్లను మూసికొనిరి. ఆ తేజస్సుచే జగత్తంతయును ప్రజ్వలించుచున్నట్లుండెను. ఆ తేజస్సు మధ్యను అనేక గోపురములతోను ఆవరణములతోను గూడినట్టియు, బంగారు వాకిళ్లు కలిగినట్టియు, నీలములతోను మరకతములతోను చేయబడిన గుమ్మములు కలిగినట్టియు, బంగారు కలశములతో కూడిన గోపురములు కలిగినట్టియు, వితానములతోను ముక్తాదామములతోను, పుష్పమాలలతోను శోభించుచున్నట్టియు, క్రీడామండపాస్థానమండపములతో కూడినట్టియు, సహస్ర స్తంభమండపముతో కూడినట్టియు, రథాశ్వ గజాదివాహన యుక్తమైనట్టియు, భేరీమృదంగపటహమురజ ఢక్కాదివాద్యముల నాదముతో నిండిన దిక్కులుకలిగినట్టియు, రూప యౌవనసంపన్న దివ్యస్త్రీలాస్య యుక్తమైనట్టియు, శ్రవణానంద జనకమైనట్టియు హృదయాహ్లాద కారకమైనట్టియు, నయనానందజనకమైనట్టియు, సర్వమంగళశోభిత మైనట్టియు, నత్యద్భుతమైన దివ్య విమానము చూడబడెను. బ్రహ్మాదిదేవతలును, సనకాదిమునులును, అగస్త్యాదిఋషులును నా యద్భుతమగు విమానమును చూచి సంపూర్ణాహ్లాదయుక్తమానసులై యితికర్తవ్యతామూఢులై విస్మయోత్ఫుల్లలోచనులై చూచుచుండిరి. పశుపక్ష్యాదులుకూడ నాదివ్య విమానమును చూచి యాశ్చర్యచకితములై యొక్కపదమునైనను కదలలేక నిలిచి యుండినవి. ఆ విమానము చూచి చతుర్ముఖుడు పరమానందభరితుడై మునులతో నిట్లనియె.

ఇదం తు దివ్యం పరమాద్భుతం శుభం
విమానమింద్రాదినిషేవ్యమాణమ్ ।

విధాతి విష్ణోరిస మన్దిరం పరం
పశ్యామ సర్వే వయమద్భుతం గృహమ్ ॥

పిదప నా విమానమును ప్రవేశించెను. అతనివెంట దేవతలును తపోధనులు గూడ విమానములోనికి పోయిరి.

వరాహపు. 46-అధ్యా.

16. బ్రహ్మాదులు విమానమును ప్రవేశించి శ్రీనివాసుని దర్శించుట.

చణ్డప్రచణ్డాది ద్వారపాలకులకు ప్రణమిల్లి బ్రహ్మాది దేవతలును, మునులును, దశరథుడును, సప్తద్వారములనుదాటి శ్రియఃపతియగు దేవదేవుని దర్శించి యతిసంహృష్టమానసులైరి. సిద్ధచారణసేవితమగు నా బహువిస్తీర్ణ విమానమునందు గొప్పపుష్పవృష్టియు దేవదుందుభినిస్వనమును కలిగెను. ఇదివిని లోకపాలులును, పశువులును, గ్రహములును, రుద్రులును, నాగయక్షాది గణములును నచ్యుతుని దర్శించుట కచ్చటకు వచ్చిరి. వచ్చి దేవదేవునకు దక్షిణభాగమున పద్మాసనమున కూర్చొని బంగారుచాయ కలిగినట్టియు, పంకజోదర లావణ్యము కలిగినట్టియు, శరత్పూర్ణచంద్రనిభానన యగునట్టియు, భృఙ్గపఙ్క్తిసమాకారదివ్యాలకశోభితయగునట్టియు, ప్రఫుల్లపంకజస్మేరముఖమన్దస్మితోజ్జ్వలయైనట్టియు తరుణారుణసంకాశకుసుంభవసనోజ్జ్వల యైనట్టియు, కిరీటహారమకుటకేయూరాఙ్గదశోభితయైనట్టియు, వామహస్తమున నీలాంబుజము కలిగినట్టియు, లంబమాన దక్షిణహస్తము కలిగినట్టియు, మాటిమాటికి శ్రీవత్సలాంఛనుని చూచుచున్నట్టియు, పద్మావతీదేవిచే నాశ్రయింపబడినట్టియు, వామభాగమున తులసీశ్యామలాంగయైనట్టియు, సర్వాభరణభూషితయైనట్టియు, ఫుల్లపంకజవక్త్రయైనట్టియు, మదమత్తచకోరాక్షియైనట్టియు, ద్విజరాజజ్వలజ్జ్యోత్స్నామన్దహాస మనోహరయైనట్టియు,

దక్షిణహస్తమున నీలసరోరుహము గలిగినట్టియు, పద్మాసనమున కూర్చున్నట్టియు, మాటిమాటికి లోకేశుని చూచుచున్నట్టి భూదేవిచే నాశ్రయింప బడినట్టియు, నానారత్నసమాకీర్ణజ్వలన్మకుట శోభితుడై నట్టియు, మన్దస్మితమనోహరవదనపంకజుడైనట్టియు, దయారస పరిపూర్ణలోచనుడైనట్టియు, కర్ణద్వయలసద్హేమమకరాభరణోజ్జ్వలుడై నట్టియు, కణ్ఠలంబితసద్హేమగ్రైవేయకవిభూషితుడైనట్టియు, తప్తకార్తస్వరోద్భూత బ్రహ్మసూత్రవిరాజితుడైనట్టియు, కేయూరాఙ్గదవిభూషితుడై నట్టియు, జ్వాలాయుతసహస్రార సుదర్శనధరమును, శరచ్చన్ద్రప్రతీకాశ పాఞ్చజన్యధరమును, నమ్రాశ్రితవరదానోద్యద్దయాదక్షమును, కటి తట విన్యస్తమును నగు వృత్తాయతచతుర్భుజములు కల్గినట్టియు, కటిసూత్ర వ్యతిస్యూతకింకిణీకవిరాజితమగు కటీతటమున సుసంబద్ధచురికాయుధ భూషితుడై నట్టియు, పీతాంబరధరుడైనట్టియు, గుల్ఫదేశలసద్బద్ధకింకిణీ కటకాలంకృతుడైనట్టియు, హంసశింజితమంజీరనూపురాఢ్య పదాంబుజు డైనట్టియు, సహస్రపత్రపీఠస్థుడైనట్టియు, సర్వాభరణ భూషితుడై నట్టియు, యిరువదియైదువత్సరముల వయస్సుగల క్రీడమానరాజ కుమారునివలె నున్నట్టియు, మూర్తీభవించిన దయాక్షమౌదార్యరూప సంపదలవలె నున్నట్టియు, అవ్యయుడైనట్టియు, అనాద్యన్తుడైనట్టియు, పురుషోత్తముడైన నారాయణుని దర్శించిరి. నయనానన్దజనకుడగు నతనిని జూచి యందరినేత్రములును హర్షావేశముచే వికాసమును పొంది నవి. చూచి బ్రహ్మాదిదేవతలును అగస్త్యాదిఋషులును సనకాది యోగులును దశరథుడును భగవంతుని పలువిధముల స్తోత్రము చేసిరి,

వరాహపు, 47. 48-వ అధ్యా.

## 17. బ్రహ్మాదులు విష్ణుమూర్తికి రావణోపద్రవమును నివేదించుట

వారి స్తోత్రములను విని సంతసించి యాగమనకార్యమేమియని శ్రీనివాసుడు చతుర్ముఖుని నడిగెను. పితామహుండిట్లుపలికెను "స్వామీ! విశ్రవసు పుత్రుడగు రావణుడు పూర్వము ఘోరమైన తపస్సుచేసి మనుష్యేతరులగు దేవదానవ రాక్షసాదులచే నవధ్యత్వమును వరముగా బడసెను. బలదర్పముచే నతడు లోకమును విశేషముగ పీడించుచున్నాడు. మరియు శ్రీశైలసకాశమున గొందరు దైత్యులు బలదర్ప యుతులై మునులను బాధించుచున్నారు. వారినుండి రక్షణకొరకు నిన్ను శరణుపొందుచున్నాము. వైకుంఠమునందును, క్షీరసాగరమునందును నిన్నుగానక నిటకు వచ్చినారము. నీవిట్లు చైత్రరథముకంటె నందమైనదని యీ గిరియందు విహరించుచున్నచో మాగతి యేమి? మమ్ము రక్షింపుము". అదివిని భగవంతు డిట్లుపలికెను "ఓ కమలాసనుడా! భయపడకుము. నేను రక్షించెదను, కొద్దిరోజులలో క్రూరుడైనట్టియు, లోకకంటకుడైనట్టియు, రావణుని బంధుపరివారసమేతముగా వధించెదను." ఇట్లు చెప్పి యగస్త్యునివంక తిరిగి "ఓ మహాముని! నీవు వచ్చిన కార్యమేమి" యని యడిగెను. అగస్త్యు డిట్లు పలికెను. "ఓ దేవా! నీ పుణ్యదర్శనమే నాకు వాంఛితము. అదియే నా ముఖ్యోద్దేశ్యము. మరియు శ్రీశైలపర్వతసమీపమున కొంద రసురులు పుట్టి వరప్రాప్తిచేత నుద్ధతులై ప్రాణులను హింసించుచున్నారు. నీ సాన్నిధ్యమున నిట్లు పీడ జరుగుట న్యాయముకాదు. ఈ దేశము నీది. నీ ప్రజలిట్లు దస్యులచే పీడింపబడుచుండగా నీవుపేక్షించుట న్యాయముకాదు. నీ కటాక్షము వలన వారు నిరుపద్రవులు కావలయును." అనిన భగవంతుడు "భయపడకుము. దుష్టులనందరను వధించి నాదేశమున నివసించువారి

కారోగ్యము, సంపద, సంతతి, శతాయువు ప్రసాదించెదను " అని వరమిచ్చెను. పిదప శ్రీనివాసుడు సనకాదులనుచూచి మీరు వచ్చినకార్య మేమని యడిగెను. వారిట్లు పలికిరి. స్వామీ ! మాకేమికావలయును ? నీ విచ్చట నదృశ్యుడవుగా నుండి యేమి ప్రయోజనము ? అందరకును ప్రత్యక్షగోచరుడవుగా నిచ్చట నుండవలయునని మా ప్రార్థన. అట్లే యుందునని వారికి వరమిచ్చి, దేవేంద్రుని నీకేమికార్యమని యడిగెను. దేవేంద్రు డిట్లు ప్రార్థించెను. " గోవిందా ! రావణునిచే పీడించబడి యొక్కచోట నుండలేక తిరుగుచున్నాము. అతనిని దయచేసి సంహరింపుము." అది విని శ్రీనివాసుడు "భయపడకుము. కొద్దికాలములో వానిని వధించెదను.''అని వరమిచ్చి మందస్మితవదనుడై శంకరునిచూచి నీవేమికార్యముపై నిచ్చటి కేతెంచితివని యడిగెను. " వేంకటేశ్వరా ! నీవెచ్చటనుందువో, నేనుగూడ నచ్చట నుండవలయును''అని శంకరుడు కోరగా వేంకటేశ్వరుడు, '' కల్పాంతము వరకు నిచ్చట వేంకటాద్రి యందు వసించెదను. నీవు కూడ నాగ్నేయదిశన నీ కొండసమీపమున నుండుము. '' అని యాజ్ఞాపించి కోసలాధీశ్వరుడగు దశరథుని జూచి నీ కేమి కావలయునని యడిగెను. దశరథుడిట్లు ప్రార్థించెను. స్వామీ ! నీ దయవలన నేను చిరకాలము రాజ్యసుఖము ననుభవించితిని. దాన ధర్మములను చేసి పుణ్యమును సంపాదించితిని. పుత్రజన్మసంభవసుఖ మును మాత్ర మనుభవించలేదు. అపుత్రునకు పుణ్యలోకప్రాప్తి లేదని చెప్పుదురు. వంశకరుడగు పుత్రుని నాకు ప్రసాదింపుము. '' అని ప్రార్థించెను. వేంకటేశ్వరు డిట్లనియెను. " ఓ రాజా ! నీవు పూర్వజన్మ మున గొప్ప పాపము చేసియుంటివి. అందుచే పుత్రప్రాప్తి కలుగలేదు. నే నేమిచేయగలను. అది విని దశరథుడు '' ఓ స్వామీ ! ఇదియేమి ? యాశ్చర్యముగా నున్నదే. నీ దర్శనమైన తరువాత నా కింకను సంచిత పాపముండునా ?

"క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే ।

అని కదా శ్రుతి చెప్పుచున్నది. సూర్యుడుదయించగా చీకటియుండునా ?" అని భక్తితో పలికెను. వాని భక్తికి మెచ్చి శ్రీనివాసు డిట్లనెను. "ఓ రాజోత్తమా ! నీ భక్తికి నేను సంతసించితిని. నీకు శూరులు, బలవంతులు, పరాక్రమవంతులు నగు నలుగురు కుమారులు కలుగుదురు. నీ వయోధ్యకుపోయి యజ్ఞము నాచరింపుము.'' అదివిని దశరథు డపరిమితానందభరితుడై శ్రీనివాసునికి ప్రదక్షిణనమస్కారము లాచరించి యతని యాజ్ఞతీసికొని బంధుమిత్రసహితముగా నయోధ్యకు మరలెను.

వరాహపు. 49-వ అధ్యా.

## 18. భగవంతుడు చతుర్ముఖుని ప్రార్థనను నెరవేర్చి వేంకటాద్రి యందు సర్వజనులకు ప్రత్యక్షముగానుండుట కంగీకరించుట

ఇట్లందరును మరలగా నచ్చటనే నిలిచియున్న కమలాసనుని జూచి శ్రీనివాసుడిట్లనియె. "ఓ చతుర్ముఖుడా ! నీవెందులకిచ్చటనే నిలిచి యున్నావు. కాలాతీతమగుచున్నదే. నీయభీష్టమేమో చెప్పుము. తప్పక నెరవేర్చెదను" అనిన విని చతురాననుడిట్లు ప్రార్థించెను. "ఓవేంకటేశా ! నా కోరిక నెరవేర్చునెడ చెప్పెదను వినుము. నీవిట్లంతర్హితుడవై యీ వేంకటాద్రియందుండుట నాకు నచ్చుటలేదు. ఈ కలియుగమున ప్రజ లందరును మావలె తపస్సుచేసి నీ దర్శనమును బడయజాలరు. ఈ కలి యుగమున జనులు వారి ధర్మములను నెరుగరు. ప్రాయశః అందరును దుర్బలులు, రోగులు, కామమోహితులు, పశుప్రాయులు, పాపాత్ములు. వారిని నీవుపేక్షించినచో వా రందరును నరకమునకు పోవలయును. ఈ నరకములు వారికి జాలవు. క్రొత్తవి యపరిమితముగా సృజింపవలసి యుండును. కాబట్టి వారిని దయామయుడవగు నీవే యనుగ్రహింప వలయును. వారికి దర్శనమిచ్చి, దర్శనము వల్లనే వారి పాపములను

పోగొట్టి వారిని యనుగ్రహించుట కందరికిని ప్రత్యక్షమగు నీరూపమున నీ విచ్చట సదా యుండవలయును. ఇదియే నా కోరిక. " అనిన విని వేంకటేశ్వరుడు చతుర్ముఖుని భూతదయకు మెచ్చి యిట్లనియె. " ఓ పద్మాసనా ! నీ సర్వజీవ దయాపత్వమునకు నేను సంతసించితిని. నీవు కోరినప్రకార మిచ్చట నిక్లే యందరకును దర్శనము నిచ్చుచు నాకల్ప ముండెదను. అందరి కోరికలను నెరవేర్చుచు శ్రీ భూదేవులతో గూడ నిచ్చట నుందును. ఇచ్చట చేయు వారి తపస్సులను, యజ్ఞములను, యోగములను సులభముగా ఫలించును. లోకములోని తీర్థములన్నిటికి స్వామియగుటచే నీ పుష్కరిణికి స్వామిపుష్కరిణి యనునది యన్వర్థ నామ మగుచున్నది. భూమియందు గల గంగాది పుణ్యతీర్థములన్నియు నిందుండియే యుత్పన్నములైనవి. ఇందు స్నానముచేసిన వారిపాపము లన్నియు నశించును. ఇందు స్నానము చేసిన వారి కోరిక లన్నియు నెరవేరును. నాయందు భక్తితో నెవరెవరు వచ్చి యీ పుష్కరిణిలో స్నానము చేసి నా దర్శనము చేయుదురో వారి కోరిక లన్నిటిని నేను తీర్చెదను. అందుచే ప్రజలందరు నిర్భయముగా నుందురుగాక " అనిన సంతసించి చతుర్ముఖుడు మరల నిట్లనియె. " స్వామీ ! నాయందు దయయుంచి నీ విచ్చట నుండి జనుల నుద్ధరించుట కంగీకరించితివి. కృతార్థుడనైతిని. కాని యీప్రాంతమున దుష్టరాక్షసులు ప్రజలను పీడించు చున్నారు. వారిని పరిమార్చి ప్రజలను రక్షింపుము " అని ప్రార్థించెను. అప్పుడు వేంకటాచలాధీశుడు తనచేతనున్న సుదర్శనమును సపరివార ముగా బంపి వారి నందరిని నిశ్శేషము చేయించెను.

## 19. భగవంతుడు బ్రహ్మోత్సవమున కంగీకరించుట

ఇంకను బ్రహ్మదేవుడు తనలోకమున కేగక యచ్చటనే నిలచి యుండుట చూచి వేంకటేశ్వరు డేమి కావలయునని తిరిగియు నడుగ.

పంకజాసను డిట్లనియె. "స్వామీ! నాకింకొక్క కోర్కెగలదు. దానిని గూడ తమరు నెరవేర్చవలెను. ధ్వజారోహణ పూర్వకముగా తమ కిచ్చట యుత్సవమును చేయదలంచియున్నాను. దాని కంగీకరించవలయు నని వేడుచున్నాను." అట్లే కానిమ్మని భగవంతు డంగీకరించగా చతుర్ముఖు డుత్సవప్రయత్న మారంభించెను.

విఖనసాది మునులను రప్పించి విరించి కన్యామాసమందు ధ్వజా రోహణ పూర్వకముగా నుత్సవమును చేయుటకు నిశ్చయించి యన్ని దిక్కులనుండియు సురులను, జనులను నాహ్వానించెను. "యోగులకు గూడ నదృశ్యుడగు శ్రీనివాసుడు, సర్వజీవులయందును దయచే నంద రకును ప్రత్యక్షమై బ్రహ్మోత్సవమున కంగీకరించెను. ఉత్సవమున శ్రీనివాసుని దర్శనము పుణ్యప్రదము" అనుచు నన్ని దేశములనుండియు జనులు వచ్చి గోవిందనామస్మరణము చేయుచు వేంకటాద్రి నెక్కిరి. మార్గమధ్యమం దుత్సవమునకు పోవు వారికి జనులు పానీయశాలలను, అన్న గృహములను నేర్పాటు చేసిరి. వాహనములను, ఛత్రములను, పాదుకలను వస్త్రములను వారికి సమర్పించి జనులు పుణ్యమును సంపాదించుకొనిరి.

చతుర్ముఖుడు ఉత్సవమునకు వచ్చు జనుల సౌకర్యము కొరకు విశ్వకర్మను పిలిపించి విడిదియిండ్లను, అన్నశాలలను, పానశాలలను విశేషముగా కట్టించెను. వేంకటాద్రిచుట్టును మంచి వీథులతో గూడిన నగరములను కట్టించెను. వేంకటేశ్వరస్వామి వారి విమానముచుట్టును వీథులను తీర్పించి, గంధర్వనగరతుల్యమగు నగరమును వేంకటాద్రి యందు నిర్మించెను. బ్రహ్మోత్సవము జరుగుచుండగా గంధర్వులు, కిన్నరులు, అప్సరసలు వచ్చి పట్టణమంతను గీత నృత్య వాద్యములతో నింపివైచిరి.

వరాహపురాణము 50-వ అధ్యాయము.

## 20. శ్రీ వేంకటేశ్వర మహోత్సవ వైభవము

వేంకటేశుని దివ్యోత్సవ దినములలో బ్రహ్మ ఘృతసూపగుడము లతో కూడిన ముద్గాన్నము, మాషాన్నము, తిలాన్నము, కృసరాన్నము, మరీచ్యన్నము, గోధుమాన్నము, శాల్యన్నము, గుడాన్నము, పాయసాన్నము మొదలగు నన్నములను, వివిధములైన వ్యంజనములను, బహువిధములైన ఫలములను స్వామికి నివేదనము చేయించెను. ఉచ్చైశ్రవస్సుమీదను, ఐరావతముమీదను, అనంతునిమీదను, గరుడునిమీదను, వేంకటేశుని నధిష్ఠింపజేసి సమస్తవాద్యఘోషములతోను, ఛత్ర చామరములతోను వీథులయందు వేంచేయింపజేసి యుత్సవార్థము వచ్చిన దేవ మనుష్యులకు దర్శన మగునట్లు చేసెను. నిత్యము గాయకులచేతను, వేదపాఠకులచేతను, దేవతలచేతను పూజింపజేసెను. యాగశాలయందు మునులు హోమములుచేసిరి. పూర్ణకుంభములు స్థాపింపబడినవి. వైఖానసులు విధియుక్తముగా దిగ్బలుల నిచ్చిరి. ఉత్సవదినములు చాల పుణ్యప్రదము లైనవని, పాపనాశకము లనియు వచ్చిన వా రందఱును దానముల జేసిరి. అచ్చటనే వసింపవలయునని యనేకజనులు వాసముల నేర్పరచుకొనిరి. ఈ యుత్సవదినములలో నొక దినమున శ్రీనివాసుడు శ్రీ భూదేవులతో గూడ నానారత్న విరాజితమును, ఉచ్ఛ్రితధ్వజశోభితమును, సిద్ధగంధర్వ సేవితమును నగు రథము నధిష్ఠించి, బ్రహ్మాది దేవబృందములచే సేవ్యమానుడై మహావీథుల విజయము చేసి తిరిగి యాస్థానమండపము నలంకరించెను.

## 21. శ్రీ వేంకటేశ్వర మహోత్సవ సేవాఫలము

అప్పుడు శ్రీనివాసుడు చతుర్ముఖుని బిలిచి యిట్లు పలికెను. "సరస్వతీవల్లభా ! నీభక్తికిని, నీయుత్సవమునకు చాలా సంతసించితిని. ఈప్రకారముగా దేవతలుగాని, యోగులుగాని, మునులుగాని, మనుజులు

గాని ప్రతి వర్షమును కన్యామాసమున నుత్సవమును చేసిరేని, వారు భూలోకమున సర్వకామముల ననుభవించి బ్రహ్మలోకమును పొందుదురు. ఈ యుత్సవము నుద్దేశించి సేవకొఱ కెవరైనను శేషగిరి చేరుట కడుగు లిడినచో వారికొక్కొక్కయడుగునకు వైకుంఠప్రాప్తిఫలము కాగలదు. ఈ యుత్సవకాలమున పానీయశాలలను నిర్మించిన వారి విషయమున నాహృదయము శీతలమగును. ఈయుత్సవకాలమున నన్నదానముచేసిన వారికి సప్తపురుషాంతరముల వరకును నన్నసమృద్ధిని కలిగించెదను; సర్వమోక్షముల నిచ్చెదను. శాస్త్రోదితములైన దానముల నెవరుచేసెదరో వారి కైహికసుఖముల నిచ్చి చివరను వైకుంఠము నిచ్చెదను. ఈ గిరి చుట్టును పట్టణములను కట్టిన వారు మోక్షమును పొందుదురు. ఇచ్చట భూదానముగాని, గృహదానముగాని చేసినవారు నా సదనమును పొందుదురు. ఇచ్చట నివసించు జనులకు విద్యాదానము చేయు వారి కీర్తి మూడులోకములును వ్యాపించును."

వరాహపు. 51-వ అధ్యా.

## 22. వేంకటాద్రియందు పుష్పోద్యానములను నిర్మించి పుష్పార్చన చేసినవారికి కలుగు ఫలము

ఇంకను వేంకటేశ్వరు డిట్లుపలికెను. "ఓ విబుధులారా! వినుడు. వేంకటాద్రియందు బృందావనములను, ఉద్యానవనములను, పుష్పోద్యానములను పెంచి యా పుష్పములచేతను, దళములచేతను నన్నర్చించు వారనేకసంవత్సరము లైహికాముష్మికసుఖముల ననుభవించి మోక్షమును పొందుదురు. వారి వంశ మభివృద్ధి పొందుచుండును. ప్రతి దినము సవ్యంజన నైవేద్యమును నా కెవరు కల్పించెదరో వారు సమస్త పుణ్యలోకములను పొందుదురు. వారికి సమస్తసంపదలును కలుగును. వజ్రమాణిక్యాది మణులతో కూడిన స్వర్ణభూషణములను నా కర్పించువారు

విద్యావంతులును, చిరాయుష్మంతులును, పుత్రవంతులును, ఐశ్వర్యవంతులును, నగుదురు. నిత్యమును యెవరైతే పుష్పములను, తులసీదళములను నా యర్చనకు సమర్పింతురో వారి గృహములలో లక్ష్మితో గూడ నే నెల్లప్పుడు నుండెదను. నన్ను చేరి యెవరెవరు ఏమేమి కోరికలను కోరెదరో వారి కా దయాకోరికలను తీర్చెదను " ఇది నా ప్రతిజ్ఞ. నియతముగా నిచ్చట నుండువారు గాని, యాదృచ్ఛికముగా నిచ్చటికి వచ్చినవారుగాని యెవరైనను నీ వేంకటాద్రినెక్కి స్వామిపుష్కరిణిలో స్నానము చేసి నన్ను నమస్కరించెదరో వారి సర్వ కామములను తీర్చెదను. ఇట్లానతిచ్చి వేంకటాద్రీశుడు శ్రీభూసమేతుడై నిజవిమానములోనికి వేంచేసెను. బ్రహ్మాదిదేవతలు, మునులు, ఋషులును సంతసించి జయజయధ్వానములను చేసిరి. చతుర్ముఖుడు వేంకటేశుని దివ్యోత్సవమును ఋషులతోగూడ యథాశాస్త్రముగా పూర్తిజేసెను.

## 23. మహోత్సవావభృథస్నానము

శ్రవణనక్షత్రమందు పద్మాసనుడు పవిత్రమైనట్టియు, పాపనాశకమైనట్టియు స్వామిపుష్కరిణియందు వేంకటేశున కవబృథము జరిపెను. దేవతలు, యోగులు, మునులు, రాజులు మొదలగు జనులందరును పుష్కరిణియందు స్నానముచేసిరి.

స్నానానంతరము సనకసయోగి యిట్లు పలికెను. " ఓ జనులారా! వినుడు. సమస్తతీర్థభూతుడైన చక్రి యొక్క యవభృథమున నెవరు స్నానము చేయుదురో, వారి యనంతపూర్వజన్మములలో చేయబడిన పాపము తత్క్షణమే నశించును." విష్ణు మహేశ్వరు లీ వాక్యముల నంగీకరించిరి. దేవతలందరును స్వామిపుష్కరిణీ మాహాత్మ్యమును ప్రశంసించి వేంకటేశుని పుష్పములతో నర్చించి సాష్టాంగప్రణామముల నాచరించిరి.

బ్రహ్మచే నిర్వర్తింపబడిన యీ యుత్సవమునకు వేంకటేశ్వరుడు సంతసించి యిట్లు వచించెను. "కమలాసనా! నేను చాలా సంతసించితిని. నీకేమికావలయునో కోరుము" అన బ్రహ్మ యిట్లు పలికెను. "స్వామీ! నాకు నీ దయకు మించి యేమియు నక్కరలేదు. ఇదియే నా కోరిక. ఇట్లే నీ విచ్చటనుండి జనుల ననుగ్రహించి వరముల నిచ్చుచుండుము". అనిన విష్ణుమూర్తి "తథాఽస్తు." యనియెను. ఇట్లు వరమిచ్చి బ్రహ్మేంద్రాదిదేవతలు, యోగులు, మునులు, రాజులు మొదలగువారలను యథాస్థానములకు పంపెను.

వరాహ పు. 52-వ అధ్యా.

## 24. ఫల్గుణీతీర్థమాహాత్మ్యము

సనకాదియోగులు పాపనాశనతీర్థముననుండు వనమున స్థానము నేర్పరచుకొనిరి. సప్తఋషులు దాని కీశాన్యమున ఫల్గునీతీర్థతీరమున నాశ్రమము నేర్పరచుకొని వసించుచుండిరి. అరుంధతీతపస్సునకు సంతసించి కమలాలయ ఫాల్గునమాసపూర్ణిమయందు నాతీర్థ తీరమున ప్రత్యక్షమయ్యెను; అరుంధతీదేవికి వరముల నొసగెను. ఆమె కోరగా నా తీర్థమునకు ఫల్గునీతీర్థమని నామమును గూడ నిచ్చెను. ఫల్గునీ నక్షత్రయుక్తమగు ఫాల్గుణపౌర్ణమి నా దెవ రీ తీర్థమున స్నానము చేయుదురో వారియింట లక్ష్మి నివసించియుండి సర్వకామములను నెరవేర్చుచుండును. దేవతలు కొందరు సమావేశులై విచారించి యచ్చట వేంకటేశుడుండుటచే వానిని సేవించుచు వీరు కూడ నచ్చటనే నివసించుటకు నిశ్చయించుకొని యుండిపోయిరి.

## 25. జాబాలితీర్థమాహాత్మ్యము

సరస్సునకు పశ్చిమోత్తరభాగమున జాబాలి తన యాశ్రమమున నివాస మేర్పరచుకొనెను. అగస్త్యు డుద్యానము నొకదానిని నిర్మించి,

వేంకటేశుని వివిధపుష్పములతో నర్చించుచు చిరకాలము శిష్యులతో గూడ వేంకటాద్రియందుండెను. కృత - త్రేతా - ద్వాపరయుగములలో కల్పింపబడిన వివిధోత్సవములచే పూజింపబడినవాడై సంతుష్టమానసుడై యాచకులకు కోరినవరముల నిచ్చుచు వేంకటేశుడు శ్రీభూదేవులతో గూడ నిచ్చట విజయంచేసియున్నాడు.

వరాహపు. 53-వ అధ్యా.

## 26. కలియుగమున వేంకటేశుని లీలలు

ఇదివరలో కృత - త్రేతా - ద్వాపరయుగములోని వేంకటేశుని లీలలు వర్ణింపబడినవి. ఇప్పుడు కలియుగమున నతని లీలలు వర్ణింపబడును.

వేంకటేశ్వరుడు కలియుగమున మౌనమును వహించియుండును. మనుష్యుల కర్చావతారము వలె కనబడుచుండును. వైకుంఠమునుండి వచ్చిన దివ్యవిమానము తిరోహితమైయుండును. మానవులు కలియుగమున నతనికి వేరు విమానమును కట్టించెదరు. మనుష్యు లందరును వేంకటేశుని నర్చావతారమనియే తలంచుచుందురు. వేంకటేశుడంతటిని చూచుచు చూడనివానివలె గనబడుచుండును. భాషణముతప్ప మిగిలిన నిగ్రహానుగ్రహాది శక్తులు వేంకటేశునికి పూర్వము వలెనే యుండును. అందును కలియుగమున వరదాన మత్యధికము. విమానము కృతకమను ప్రతీతిమాత్రమే కాని దర్శనమాత్రమున పాపకోటిహరముగా నుండును. వేంకటేశు డప్పుడప్పుడు మాత్రము ప్రత్యక్షమగుచుండును. ఇట్లు వేంకటేశుడు రమతోగూడి కలియుగమున క్రీడించుచుండును.

భక్తియుక్తమైన యల్పదానముచేతను, స్వల్పపూజచేతను ప్రసన్నుడగుచుండును. వేంకటాద్రికి యాత్ర పోవుటమాత్రము చేతనే ప్రసన్నుడై యభీష్టములను చేకూర్చుచుండును. తా నప్రాకృతుడై నప్పటికిని

ప్రాకృతుని వలె సంచరించుచుండును. మానుషభోగములను ప్రీతితో ననుభవించుచుండును. మానవులతని కనేకవిధములైన యుత్సవములను చేయుచుందురు.

కలియుగమున దేవతలుగూడ స్వామిసేవకు వచ్చుచుందురు. స్వామిపుష్కరిణియందు స్నానము చేసి స్వామికి నివేదనలు చేయుచుందురు. మనుష్యులకగోచరముగానుండి నివేదితాన్నములను భుజించుచుందురు. ఆదరముతో పూజలు సలుపుచుందురు. నరజన్మము నెత్తియుండినచో బాగుండునని తలంచుచుందురు. వేంకటేశుడు నరులకు కోరికలను శీఘ్రముగా నెరవేర్చుచున్నాడని యసూయ కలుగుచుండును.

కలియుగమున భూమియందు వేంకటేశుని ఖ్యాతి విశేషముగా విస్తరించును. అన్నిజాతులవారికిని వేంకటేశునియందు భక్తి యధికమగును. వారి యభీష్టములను వేంకటేశుడు శీఘ్రముగా నెరవేర్చుచుండును. వేంకటేశుని యుత్సవములకు భారతవర్షీయులేకాక ద్వీపాంతరీయులుకూడ కోట్లకొలది వచ్చుచుందురు. అందరును ఇష్టఫలములను పొంది సంతసించి పోవుచుందురు.

అప్రాకృతస్వర్ణశైల మైనప్పటికి వేంకటాద్రి ప్రాకృతాచలము వలె కన్పట్టుచుండును.

మతాంతర ప్రవిష్టులకు కూడ స్వామియందు భక్తి కలుగును. భక్తిమంతులను చూచి యితరులు కూడ భక్తికలవా రగుదురు. దృష్టఫలార్థము వేంకటేశుని భజించువారికి దృష్టఫలముల నిచ్చును. ఇట్లు కలియుగమున వేంకటేశుడు చిత్రముగా విహరించుచుండును. అందుచే వేంకటేశుని సేవ భూషణము వంటిది. కాబట్టి కలిదోషయుక్తులగు పాపకర్ములకు వేంకటేశునికంటె శరణాంతరములేదు.

వేంకటేశసమో దేవో నాస్తి నాస్తి మహీతలే।
స్వామిపుష్కరిణీతీర్థసమం నాస్తి న చాస్తి వై ॥

కలియుగమున వేంకటేశుడు ద్రవ్యార్జనపరుడగును. పరిపూర్ణ కాముడైనను వేంకటేశుడు లోకానుగ్రహముకొరకట్లు ప్రవర్తించుచున్నాడు. నాకు నీవింత సొమ్మునిచ్చినచో నీ యభీష్టమును సిద్ధింపజేయుదు ననుచు నిట్లందరిజనులతో వేంకటేశుడు క్రీడించుచుండును.

వరాహ పు. 58-వ అధ్యా.

## 27. సనకసనందన తీర్థమాహాత్మ్యము

పాపనాశనమున కుత్తరమున నర్ధక్రోశదూరమున పరమ పావనమగు సనకసనందనతీర్థము కలదు. మార్గశీర్ష శుక్లపక్షద్వాదశినాఁ డరుణోదయమున, స్వామిపుష్కరిణీ తీర్థమున స్నానము చేసి త్రయోదశినుండి సనకసనందన తీర్థమున స్నానము చేసి వేంకటేశాష్టాక్షర మంత్రమును జపించి యోగము నభ్యసించినచో సద్యస్సిద్ధి కలుగును.

## 28. కాయరసాయన తీర్థమాహాత్మ్యము

సనకసనందన తీర్థ సమీపమున కాయరసాయన తీర్థము కలదు. దాని నీటిని పానముచేసినచో దేహము శుద్ధమగును. ఈ తీర్థము శిలచే పిహితమైయున్నది. మహాత్ములగు యోగులకు కనబడుచుండును.

వరాహపు. 60-వ అధ్యా.

పుణ్యం పవిత్రమాయుష్యం మాహాత్మ్యమిదముత్తమమ్।
యః పఠేత్ప్రియతో భక్త్యా శృణుయాద్వా లిఖేదపి।
సర్వాన్కామానవాప్నోతి సంప్రాప్నోతి చ మఙ్గళమ్॥

వరాహపు. 61-వ అధ్యా.

ప్రథమాశ్వాసము సంపూర్ణము.

---

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము



### 1. వేంకటాద్రిమాహాత్మ్యము

దేవతలు, ఋషులు, యోగులు దీనిని పరమాత్మాలయ మని చెప్పుదురు. దీనిని కృతయుగమున నంజనాద్రి యనియు, త్రేతాయుగమున నారాయణాద్రి యనియు, ద్వాపరయుగమున సింహాద్రి యనియు, కలియుగమున వేంకటాద్రియనియు వ్యవహరించెదరు. యోజనసహస్రదూరమున నున్నవాడైనను, ద్వీపాంతరగతుడైనను నాదిక్కునకు తిరిగి వేంకటాద్రిని భక్తితో నమస్కరించినచో సర్వపాపవిముక్తుడై విష్ణులోకమును పొందును.

### 2. కుమారధారా తీర్థమాహాత్మ్యము

మఘానక్షత్రయుక్త మాఘపౌర్ణమి నాడు కుమారధారా తీర్థము లోకపావనముగా నుండును. ఆ నాడు మధ్యాహ్నము దీనియందు స్నానము చేసినచో గంగానద్యాది సర్వతీర్థములయందు స్నానముచేసిన ఫలము లభించును. ఆ తీర్థమందు దక్షిణతో గూడ నన్నదానము చేసిన వారికిగూడ నా ఫలము లభించును.

### 3. తుంబురుతీర్థమాహాత్మ్యము

ఉత్తరఫల్గునీయుక్త ఫాల్గునపౌర్ణమి నాడు తుంబురు తీర్థమందు స్నానముచేసినచో పునర్జన్మముండదు.

## 4. ఆకాశగంగామాహాత్మ్యము

చిత్తానక్షత్రయుక్త చైత్రపౌర్ణమినాడు ప్రాతఃకాలమున నాకాశ గంగలో స్నానముచేసినచో మోక్షము కలుగును.

## 5. పాండవతీర్థమాహాత్మ్యము

వైశాఖమాసమున ద్వాదశి ఆదివారము నాడు పాండవతీర్థమున స్నానముచేసినచో ఇహపరములందు సుఖము కలుగును.

## 6. పాపనాశనతీర్థమాహాత్మ్యము

పుష్యనక్షత్రముతోగాని హస్తానక్షత్రముతోగాని కూడిన సప్తమి ఆదివారము నాడు పాపనాశన తీర్థమున స్నానము చేసినచో కోటి జన్మ సంచితపాపము నశించును.

## 7. దేవతీర్థమాహాత్మ్యము

శ్రీనివాసుని విమానమునకు వాయవ్యభాగమున గిరిగుహయందు దేవతీర్థము కలదు. పుష్యానక్షత్రయుక్త గురువారమున గాని, శ్రవణ నక్షత్రయుక్త సోమవారమునగాని, వ్యతీపాత పుణ్యకాలమున గాని, దీని యందు స్నానము చేసిన వారికి జ్ఞానాజ్ఞానకృత పాపములు నశించును. పుణ్యము వృద్ధియగును. దీర్ఘాయువు లభించును. పుత్రపౌత్రాభివృద్ధి యగును. మరణానంతరము స్వర్గము లభించును. ఆ దినమున నన్నదానము చేసిన వారు యావజ్జీవమును నన్నదానము చేసినఫలమును పొందుదురు.

వరాహపు. 1-వ అధ్యాయము.

## * 8. ఆకాశరాజు జన్మవృత్తాంతము

విక్రమార్కరాజు స్వర్గస్థుడైన పిదప చాలా కాలమునకు చంద్ర వంశోద్భవుడగు మిత్రవర్మ యను చక్రవర్తి తుండీరమండలములోని నారాయణపురము నేలుచుండెను. అతను రాజ్యముచేయుచుండగా పృథివి సమస్తసస్యములతో నిండియుండెను. జనులందరును ధర్మనిరతులై, నిరీతికులుగా నుండిరి. అతనికి పాండ్యవంశజ యగు మనోరమ యను భార్యయుండెను. వారిద్దరికిని ఆకాశుడను సుతుడు జన్మించెను. అతనికి శకవంశసముత్పన్న యగు ధరణి యను భార్య లభించెను. ఆకాశుని యందు రాజ్యభారమును నిలిపి, మిత్రవర్మ వార్ధక్యమున తపస్సునకు వేంకటాద్రి సమీప వనమునకు పోయెను.

## 9. పద్మావత్యుత్పత్తి వృత్తాంతము

ఆకాశరాజు యజ్ఞార్థమారణీతీరమున భూమినిశోధించి బంగారు నాగలితో దున్ని బీజములు చల్లుచుండగా సర్వలక్షణసంపన్నయగు నొక కన్యక భూమినుండి యుద్భవించి పద్మశయ్యమీద కనబడెను. ఆశ్చర్య చకితమానసుడై యాకాశరాజా పిల్లను తీసికొని సంతసించి, మంత్రుల కీ వృత్తాంతము నెరింగించి, ఇది నా తనయయని వారితో ననెను. అప్పు డశరీరవాక్కు, "ఓ రాజా! ఇది నిజముగా నీకు కుమార్తెయే. దీనిని నీవు పెంచుము" అనెను. ఆకాశరాజు స్వపురమున కేగి ధరణీదేవిని పిలచి యిట్లనియె. "దైవముచే నీయబడి భూమినుండి యుద్భవించిన యీపిల్లను చూడుము. అపుత్రుల మగు మన కీమె పుత్రిక కాగలదు". అని చెప్పి యా శిశువును ప్రీతితో ధరణీహస్తమున నుంచెను. పద్మమం దుద్భవించుటచే నామెకు పద్మిని యని నామకరణము చేసెను.

* ఇచ్చట నుండి యీ పురాణమున సంక్షేపముగా నున్న విషయము భవిష్యోత్తర పురాణమున విపులముగా చెప్పబడినది.

## 10. వసుదానుని జన్మవృత్తాంతము

ఆకాశరాజు భార్యయగు ధరణీదేవి పద్మావతిని తీసికొని యంతః పురము ప్రవేశించిన వెనుక యంతర్వత్ని యయ్యెను. కాలక్రమమున పదియవమాసమున సుప్రశస్తముహూర్తమున రవి మేషమందుండగా యొక పుత్రుని గనెను. అప్పుడు వాయువు మెల్లగా వీచెను. పండ్రెండవ దినమున జాతకర్మాది క్రియలను నడిపించి, పిల్లవానికి వసుదానుడని పేరు పెట్టెను. ఆ పిల్లవాడు శుక్లపక్షచంద్రునివలె దినదినము నభివృద్ధి బొందెను. ఉపనయనమైన పిదప వసుదానుడు తండ్రిగారివద్ద నస్త్ర విద్యను నేర్చుకొనెను. బలవంతుడైన కుమారునిచే నా రాజు శత్రువుల కజేయుడయ్యెను.

వరాహపు. ౩-వ అధ్యాయము.

## 11. నారదఋషి పద్మావతికి సాముద్రికము చెప్పుట

రూపయౌవనసంపన్నయగు పద్మావతి యొకదినమున సఖులతో గూడ నుద్యానవనమున విహరించుచుండగా యదృచ్ఛగా వచ్చిన నారద ఋషి యామెను చూచెను. నారదు డామె సౌందర్యమునుచూచి యాశ్చర్యము నొంది "నీవెవ్వరికుమార్తెవు ? నీ హస్తమును చూపుము" అని యడిగెను. అప్పుడు పద్మావతి "నేనాకాశరాజు కుమార్తెను. నా హస్తమును జూచి నా లక్షణములను చెప్పు" మని తన చేతిని చూపించెను. నారదు డామె కరమును చూచి "నీవు సాక్షాల్లక్ష్మివలె నున్నావు. విష్ణువునకు భార్య యగుటకు తగినట్లు కనబడుచున్నావు. లోకత్రయేశ్వరుడగు రమాపతి నీకు భర్తకాగలడు" అని చెప్పి యామెచే నర్ఘ్యపాద్యాదులతో పూజింపబడి యంతర్ధానమును బొందెను.

## 12. పద్మావతి సఖులతో గూడ నుద్యానవనమున కేగుట

పద్మావతిసఖులు "ఉద్యానవనము పుష్పభరితమై మనోహరముగా నున్నది. వనమున కేగుదము రమ్ము" అని యామెను కోరిరి. వారందరును నుద్యానవనమున కరిగి పుష్పములు కోయుచుండగా, శుభ్రదంతద్వయము కలిగినట్టియు, మదధార లొలుకుచున్నట్టియు, కరిణీ యూథముతో కూడినట్టియు నొక గజేంద్రము తొండమునుండి నీటిని పూత్కరించుచు గనబడెను. దానిని చూచి వారు భయచకితమానసులై యొక వనస్పతి చాటున నిలచియుండిరి.

## 13. శ్రీనివాసుడు మృగయార్థ ముద్యానవనమునకేగుట

ఇంతలో పుండరీకదళాయతలోచనుండును, సూక్ష్మ క్షౌమ వస్త్ర ధరుండును, పద్మరాగమణియుక్త కుండల మండితుండును, రత్నకంకణ కేయూర కటిసూత్ర విరాజితుడును, స్ఫురత్ స్వర్ణ యజ్ఞోపవీతుండును, కృష్ణవర్ణుండును, మన్మథాకార సుందరుండు నగు పురుషుడొకడు, ఇందుధవళాశ్వారూఢుడై మృగము నొకదానిని నన్వేషించుచు నతి వేగముగా వచ్చుచుండుట గనిరి. హయారూఢుడగు నా పురుషుని చూచి యా గజము తల వంచి మ్రొక్కి తొండమునెత్తి గర్జించి, వెనుకకు మరలి వనములోనికి బోయెను.

తదుపరి నాయాశ్వికుడు పుష్పముల నేరుచున్న కన్యలను సమీపించి "ఓ కన్నియలారా, ఏదైన నొక మృగమీవంక వచ్చినదా ? మీరు చూచి నట్లైన చెప్పుడు" అని యడిగెను. అప్పుడా కన్యలిట్లు బదులు పలికిరి. "మే మేమృగమును చూడమైతిమి. ధనుర్ధరుడవై మా వనమునకెందులకు వచ్చితివి ? ఇచ్చటి మృగములన్నియు నవధ్యములు. ఆకాశరాజాధీన మగు నీ యుద్యానవనమునుండి శీఘ్రముగా వెడలిపొమ్ము". అ మాటల విని యతడు హయమునుండిదిగి వారిని ట్లడిగెను. "మీరెవరు ! సర్వాంగ

సుందరియగు నీ కన్యక యెవరు ? మీ రీ విషయము నెరింగించిన వెంటనే నేను నా స్థానమగు గిరి కరిగెదను." అది విని పద్మావతి ప్రేరేపించగా యామెసఖి యిట్లు పలికెను. "వసుధోద్భవయు, నాకాశరాజు తనయయు నగు నీ పద్మావతి మా నాయిక. నీ వెవ్వడవో, నీ నివాసమేదో, నీ జాతి యేదియో, నీవిచ్చటి కెందులకు వచ్చితివో దయచేసి మాకెరింగింపుము." అతను మందస్మితవదనుడై యిట్లు పలికెను. "మా కులము దివాకర కులమని చెప్పుదురు. మనుష్యపావనములగు నా నామము లనేకములు కలవు. వర్ణమునకును, నామమునకును, నన్ను కృష్ణుడందురు. నా చక్రము బ్రహ్మద్వేషులకును, సురాసురులకును భయావహము. నా శంఖధ్వనిని విని శత్రువులు మోహమును పొందుదురు. నా ధనుస్సునకు తుల్యమైన ధనుస్సు దేవతలవద్దకూడ లేదు. వేంకటాద్రినివాసి యగు నన్ను వీరపతి యని పిలిచెదరు. ఈ కొండనుండి వేటకొరకు నా యను చరులతో గూడ నీ యుద్యానవనమునకు వచ్చితిని. నేను వెంట వచ్చు చున్నను వాయుగతియగు నా మృగ మదృశ్యమయ్యెను. దానిని వెదకుచు నిచ్చటికి వచ్చి యీమెను చూచితిని. ఈమెయందు నా కనురాగ ముద్భ వించినది. నా కీమె లభ్యమగునా ?" అనిన విని కోపగించి యాకన్నియ లిట్లు పలికిరి. "ఆకాశరాజు నిన్ను చూచి బంధించులోపల నీవు నీ స్థాన మున కేగుము." ఇట్లు భయపెట్టబడినవాడై యతడు గుఱ్ఱము నెక్కి తన యనుచరులతో గూడ పర్వతమువైపునకు శీఘ్రముగా పోయెను.

వరాహపు. 4-వ అధ్యాయము.

## 14. శ్రీనివాసుడు పద్మావతిని పరిణయమాడుటకు కారణములు

ఆలయమునకు వచ్చి, తన యనుచరులను విశ్రమింపుడని యాజ్ఞా పించి, ముక్తాగృహమును ప్రవేశించి నవరత్నమయమగు మంచముమీద పండుకొని పద్మావతిని స్మరించుచు శ్రీనివాసుడు మోహమును జెందెను.

4

ఇంతలో శ్రీనివాసుని సఖియగు వకుళమాలిక యనేకవిధములగు నన్నములను, నుపదంశములను, అపూపములను చేసికొని చెలికత్తెలతోగూడ శ్రీనివాసుని యొద్ద కేగెను. ఆయనకు మ్రొక్కి చూడగా శ్రీనివాసుడు నిమీలితలోచనుడై యుండెను. "దేవదేవా! పురుషోత్తమా! లెమ్ము. పరమాన్నాదులను గొనితెచ్చి యున్నదానను. లేచి భుజియించి ప్రసాదింపుము" అని ప్రార్థించి, "ఏమి! యార్తునివలె శయనించి యున్నవాడవు. అందరకును నార్తి తీర్చవలసినవాడవే! వేటకు పోయి యేమి చూచివచ్చితివి. నీ యవస్థ కాముకునియవస్థవలె నున్నది. దేవకన్యకాని నాగకన్యకాని, మానుషకన్యకాని చూడబడినదా? నీ సఖియనగు నాతో చెప్పగూడదా?" యని యడిగెను. అప్పుడు శ్రీనివాసుడు నిట్టూర్పు విడచి యూరకొనగా, వకుళమాలిక తిరిగి యిట్లనియె. "నీ మనస్సును గూడ యాకర్షింపగలయట్టి యా కన్యక యెవ్వరు?" అని ప్రశ్నించెను. అప్పుడు శ్రీనివాసుడు "చెలీ! చెప్పెదను వినుము" అని యిట్లు పలికెను.

"పూర్వము త్రేతాయుగమున నేను రావణుని సంహరించుసందర్భమున వేదవతియను కన్య సిరికి సహాయము చేసెను. సీతారూపమున లక్ష్మి జనకమహారాజుభూమినుండి యుద్భవించెను. నేను మారీచుని చంపుటకు పంచవటీపరిసరారణ్యమునకు పోగా, నా తమ్ముడగు లక్ష్మణుడు సీతచే ప్రేరేపింపబడినవాడై నా వెంట వచ్చెను. మాయిరువుర యసన్నిధానమున సీత నపహరించుటకు, మాయాభిక్షు రూపముతో రావణుడు వచ్చెను. అగ్నిహోత్రుడు రావణుని యభిప్రాయమును తెలిసికొని, సీతను పాతాళమునకు తీసికొనిపోయి స్వాహావద్దనుంచి, యారాక్షసునిచే స్పృశించబడి, యతనిని సంహరించుట కగ్నియందు దేహమును వదలిన వేదవతిని సీతారూపమున పర్ణశాలనుంచెను. ఆమె రావణునిచే హరించబడి, లంకయందుంచబడి, రావణ సంహారానంతరము తిరిగి యగ్నిప్రవేశముచేసెను. అప్పుడగ్ని స్వాహావద్ద నుంచబడిన జానకిని నా కప్పగించి

నాతో నిట్లనెను. ఈ వేదవతి సీతకు ప్రియమొనర్చునది యై, ఆమెకు బదులుగా రావణపురమున బందీకృత యైనది. కాబట్టి యీమెనుగూడ 'శ్రీ'తో సమానముగా వరించి సంతోషపెట్టుము." అగ్నిదేవుని మాటలను విని సీత యిట్లు పలికెను. "ఈ వేదవతి నాకు ప్రియమైనది. పరమ భాగవతురాలగు నీమెను నీవు వరించి రక్షింపుము." అప్పుడు నేనిట్లు పలికితిని. దేవీ! యట్లే చేసెదను. కాని యది యిరువదియెనిమిదవ కలియుగమున జరుగగలదు. అంతవరకు నీమె దేవతలచే బూజింపబడుచు బ్రహ్మలోకమున నుండుగాక! అప్పుడీమె భూమియందుద్భవించి యాకాశరాజునకు తనయ యగును." ఇట్లు పూర్వము నాచేతను, లక్ష్మి చేతను వరముల బడసిన వేదవతి యిప్పుడు నారాయణపురమున భూమి నుండి యుద్భవించినది. అనురూపులగు సఖులతో పుష్పముల నేరు చుండగా నామె వేటకుబోయిన నాచే చూడబడినది. ఆమెరూపసౌందర్యములను వర్ణించుటకు నాకు శక్యముగాదు. ఆమెను పొందినగాని నా ప్రాణములు నాకు దక్కవు. నీ వచ్చటికి పోయి యామెరూప లావణ్యములచే నాకు తగినదో కాదో చూచిరమ్ము".

అని శ్రీనివాసుడు పలుకగా వకుళమాలిక "అట్లే చూచివచ్చెదను. ఇదే పోవుచున్నాను" అని నారాయణపురమున కేగుచు మార్గమధ్యమున నగస్త్యాశ్రమమున పద్మావతీసఖులను చూచెను.

వరాహపు. ౯-వ అధ్యాయము.

## 15. పద్మావతీ సఖులు వకుళమాలికకు పద్మావతీ వృత్తాంతమును జెప్పుట

అంత వకుళమాలిక వారిని "మీ రెవ్వతెలు, యెచ్చటి నుండి వచ్చియున్నారు. ఏకార్యమున నిచ్చటి కరుదెంచితిరి" అని యడిగెను. వారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి.

"మే మాకాశరాజు యొక్క శుద్ధాంతమందు నియుక్తులము. ఆయన కుమార్తెయగు పద్మావతికి సఖులము. మా రాజపుత్రితో నుద్యానవనమున కరిగి, యచ్చట పుష్పముల నేరుచుండగా, నింద్రనీల శ్యామతనుండును, నీషత్స్మితవదనుండును, పీనదీర్ఘభుజద్వయుండును, పీతాంబరధరుండును, సువర్ణమకుటుండును, హారకేయూరాది విభూషితుండును నగు నొక దివ్యపురుషుడు కానవచ్చెను. పద్మావతి యతనిని చూచి యచ్చెరువంది తనసఖులను "చూడు చూడు" మని హెచ్చరించెను. మేమందరము నాశ్చర్యముతో చూచుచుండగా నాపురుషుడంతర్ధానమును పొందెను. అత్తరి మా సఖి మూర్ఛిల్లెను. మే మామెను ప్రాసాదమునకు దెచ్చి యాశ్వసింపజేసితిమి.

"ఆమె స్వస్థయైనపిదప నాకాశరాజు దైవజ్ఞుని బిలువనంపి తన పుత్రికయొక్క గ్రహచారఫలమును జెప్పుమని కోరెను." దైవజ్ఞుడిట్లు పలికెను. "ఓరాజా! నీ పుత్రికకు గ్రహములన్నియు నిప్పు డనుకూలముగా నున్నవి. దినగ్రహఫలము మాత్రము కొంచెము ప్రతికూలముగా నున్నది. కాని శీఘ్రముగానే స్వాస్థ్యమేర్పడును. ఉత్తమపురుష డొకడు నీ పుత్రికను దర్శించియున్నాడు. అతనిని చూచి యీామె మూర్ఛిల్లినది. కాని చివరకతనినే చేరగలదు. అతనిచే ప్రేషితయగు కన్యక రాగలదు. ఆమె నీకు హితమును పల్కును. ఆమెచెప్పినట్లు చేయుము. నీ పుత్రికకు సుఖప్రదమగు నొక విషయమును చెప్పెదను. దాని నాచరింపుము. అగస్త్యలింగమునకు బ్రాహ్మణులచే నభిషేకము చేయింపుము." అని చెప్పి యా విప్రుడు గృహమున కేగెను. ఆకాశరాజు బ్రాహ్మణులను రప్పించి యట్లు లింగాభిషేకము చేయుమని పనిచెను. అభిషేక సంభారములను గొనిపొమ్మని మమ్మాజ్ఞాపించెను. అక్కారణమున మేమిచ్చటకు వచ్చియున్నారము" అని వారి యుదంతము నంతయు జెప్పి పద్మావతీ సఖులు, "నీ వెవ్వతెవు? నీ వెచ్చటినుండి వచ్చితివి? ఎందులకు

వచ్చితివి ? " అని వకుళమాలిక నడిగిరి. వకుళమాలిక సంతసించి, ఇట్లు పలికెను. " నేను వేంకటాద్రినుండి వచ్చితిని. నా పేరు వకుళ మాలిక యందురు. ధరణీదేవిని చూచుటకు వచ్చియున్నాను. ఆమె దర్శనము నాకు కాగలదా ? " అది విని, వారందరును మాతో వచ్చినచో ధరణీదేవిదర్శన మగునని చెప్పి, వకుళమాలికను రాజభవనమునకు తోడ్కొని పోయిరి.

## 18. పులిందస్త్రీ ధరణీదేవి ప్రశ్నకు సమాధానము చెప్పుట

ఆ సమయమున ధరణీదేవి భూత భవిష్య ద్వర్తమానములను జెప్పగలిగిన యొక పులిందస్త్రీతో సంభాషించుచుండెను. ధరణీదేవి తన కుమార్తె యగు పద్మావతియొక్క ఫలమును చెప్పుమని కోరెను. పులిందస్త్రీ యిట్లు పలికెను. " అమ్మా ! నిజము చెప్పుదును వినుము. ఒక పురుషుని గని నీ పుత్రిక యీతీరున కృశించినది. అనంగశరపీడచే యంగతాపమును పొందుచున్నది. ఆ పురుషుడు దేవాధిదేవుడు. వైకుంఠమునుండి విజయము చేసెను. వేంకటాద్రిశిఖరమున స్వామిపుష్కరిణీ తీరమున, రమాపతి కామరూపుడై, శ్రీతో గూడ వనముల దిరుగుచు విహరించుచున్నాడు. అతడశ్వారూఢుడై వనముల దిరుగుచు నీ యుప వనమునకు వచ్చి నీ కన్యను చూచెను. అందమున లక్ష్మీతుల్యయగు నీమెను చూచి కామవశుడయ్యెను. తన సఖిని నీయొద్దకు పంపగలడు. ఈమె లక్ష్మివలె నతనిని పొంది చిరకాలము సుఖించగలదు." ఆపులింద స్త్రీని బహూకరించి పంపి, ధరణీదేవి యంతఃపురము లోనికి చని, యచ్చట స్వసఖులతో నున్న కామాతుర యగు తన పుత్రికను చూచి, " అమ్మా ! నీకేమి కావలయును ? నీకు ప్రియమైన వస్తువేది ? " అని ప్రీతితో నడిగెను.

## 17. పద్మావతి తన కోరికను తల్లి కెరింగించుట

పద్మావతి యిట్లు పలికెను. లోకములకెల్లను నేత్రానందకరుడును, సత్పురుషులకు మనఃప్రియుడును, ఎవరిని బ్రహ్మాదులుకూడ చూడగోరు చుందురో, ఎవడు సర్వగతుడో, ఎవడు దేవతలకుకూడ దైవతమో, ఎవడు భక్తులకు ప్రాప్యుడో, అట్టి విష్ణుమూర్తిని ప్రేమించుచున్నాను. అతనియందు నా మనస్సు లగ్నమైయున్నది. తదితరులను నేను కాంక్షింపను. శ్యామలదేహుడగు నా విష్ణువునే స్మరించుచున్నాను. ఆ హరినామములనే యుచ్చరించుచున్నాను. అతనివల్లనే నేను జీవించు చున్నాను. అతనితో యోగమును కలిగింపుము '' అని పలికినంతనే " విష్ణువీమెయందు ప్రీతికలవా డెట్లగు '' నని ధరణీదేవి యాలోచింప దొడంగెను. ఇంతలో నగస్త్యలింగమున కభిషేకముచేయుటకు పోయిన విప్రులును, పద్మావతిసఖులును, వకుళమాలికను వెంటబెట్టుకొని వచ్చిరి. విప్రులకు దక్షిణముల నిచ్చి పూజించి, వారి వాంఛితార్థసిద్ధికై వారిచే పద్మావతికి నాశీస్సులను జేయించి సాగనంపెను.

వరాహపు. 6-వ అధ్యాయము.

## 18. వకుళమాలిక ధరణీదేవికి శ్రీనివాసునివృత్తాంతమును చెప్పుట

విప్రులు వెడలినపైని ధరణీదేవి వకుళమాలికను చూచి " ఈమె యెవ్వరు ? మీతో నెచ్చట కలసినది ? ఇచ్చట కెందులకు వచ్చినది'' అని పద్మావతిసఖుల నడిగెను. అప్పుడు వారిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి. ''ఈమె నీవద్దకు కార్యార్థము వచ్చినది. దేవాలయమున శివసన్నిధిని మాతో కలిసినది. మేమడుగగా మిమ్ముచూచుటకు వచ్చితినని చెప్పినది. మీరు నాకు రాజగృహమున రాణీదర్శనము చేయించగలరా ? యని యడిగినది. మేము ధరణీదేవి దాసికలము. మాతో వచ్చితివేని మేము మీకు ధరణీదేవిదర్శనము చేయించెదమని చెప్పితిమి. మాతో వచ్చినది.

కార్యమేదో నీవే యడిగి కనుగొనుము." అది విని ధరణీదేవి వకుళ మాలిక నిట్లడిగెను. "అమ్మా! నీవెచ్చటినుండి వచ్చితివి? నావల్ల నీకేమి కావలయునో చెప్పుము. తప్పక నీ కోరికను నెరవేర్చెదను." ధరణీదేవికి వకుళమాలిక యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "నేను వేంకటాద్రి నుండి వచ్చితిని. నా పేరు వకుళమాలిక యందురు. మా స్వామి నారాయణుడు వేంకటాద్రియందున్నాడు. ఒకానొకప్పుడు మా స్వామి హయారూఢుడై మృగయార్థము వేంకటాద్రిసమీపమున పోవుచుండగా నొక యుద్యానవనమున పుష్పముల నేరుచున్న కన్నియలను చూచెను. వారి నడుమ నతి మనోహరురాలును, హేమవర్ణురాలును, లక్ష్మీసమాన సౌందర్యవతియు నగు నొక తన్విని చూచి యీమె యెవరని వారినడుగగా వారు. "ఈమె యాకాశరాజుకుమార్తె" యని చెప్పిరి. అది విని మా స్వామి దిగ్గున హయమునెక్కి వేగముగా నింటికి వచ్చెను. వచ్చి నన్ను పిలిచి యిట్లాజ్ఞాపించెను. "ఓ వకుళమాలికా! ఆకాశరాజుపురమునకేగి యతనిరాణి యగు ధరణీదేవిని దర్శించి, కుశలప్రశ్న యైన తరువాత యామెకన్నియను నాకొరకు వరింపుము." ఇట్లు మా స్వామి నన్నాజ్ఞాపించగా నేను నీవద్ద కరుదెంచితిని. నీవు మహారాజుతోను, కుమార్తె తోను సమాలోచించి సమాధానము చెప్పుము."

## 19. శ్రీనివాసునకును పద్మావతికిని వివాహము నిశ్చయింపబడుట

వెంటనే ధరణీదేవి యాకాశరాజును, పద్మావతిని బిలిపించి, వకుళావళిమాటలను చెప్పెను. ఆకాశరాజు చాల సంతోషించి యిట్లనియె. "కన్య యయోనిజ దివ్యయును, వరించువాడు వేంకటాద్రినివాసి యగు దేవదేవుడు. ఇన్నిదినములకు నా మనోరథము పూర్ణమైనది" అని పలికి యాకాశరాజు బృహస్పతిని బిలువనంపి, యాయన వచ్చినవెంటనే "పద్మావతిని శ్రీనివాసునకిచ్చి వివాహముచేయ నిశ్చయించితిని. తాము

ముహూర్తమును నిర్ణయింపవలెను. కన్య జన్మనక్షత్రము మృగశీర్ష; శ్రీనివాసుని జన్మనక్షత్రము శ్రవణము" అని నుడివెను. అది విని బృహస్పతి, "ఉత్తరఫల్గునీ నక్షత్ర మిద్దరకును శుభముగా నున్నది. వైశాఖమాసమున ఉత్తరఫల్గునీనక్షత్రమున వివాహము చేయబడుగాక" అని పలికెను. అప్పు డాకాశరాజు, వకుళావళితో నిట్లు పలికెను. "అమ్మా! నీవు దేవాలయమునకు మరలుము. వైశాఖమాసమున, ఉత్తరఫల్గునీనక్షత్రదినమున వివాహము జరుగగలదు. వివాహప్రయత్నముల నన్నిటిని చేసికొని మీరు రావచ్చు"నని పలికి, పద్మావతీదేవి ప్రియకరుడగు శుకుని దూతగా వకుళావళితో పంపెను. ఇంద్రాదిదేవతల నాహ్వానించుటకు వాయువును, పురాలంకారము నిర్వర్తించుటకు విశ్వకర్మను నియోగించెను.

వకుళావళి శుకునితో గూడ శ్రీనివాసుని యాలయమున కేగి, శ్రీతో గూడ రత్నపీఠమందు వేంచేసియున్న శ్రీనివాసుని సమీపించి, "నేనువెళ్ళినకార్యము సఫలమైనది. మంగళవార్తను శుకుడు విన్నవించగలడు" అని పలికెను. అప్పుడు శుకుడు నమస్కరించి యిట్లుపలికెను. "భూమిసుతయగు పద్మావతి యిట్లు మనవిచేయుచున్నది. నేనెప్పుడును నీ నామములనే చెప్పుచుండుదానను. నీ రూపమునే స్మరించుదానను. నీ చిహ్నములనే ధరించెదను. నీ భక్తుల నర్చించుదానను. ఇది యంతయు నాతండ్రిగారి యనుమతిని నేను చేయుచుందును. నాయందు దయయుంచి పరిగ్రహించి నన్నంగీకరింపుము." ప్రియకరమగు శుకునిమాటలను విని శ్రీహరి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "నిన్ను పరిణయమాడుటకు చాల సంతోషము. దేవతలతో గూడ నేను వచ్చెదను. నీవు పోయి పద్మావతి కీ వృత్తాంతమును తెలుపుము" అని పలికి, తన వనమాలికను పద్మావతికొరకు శుకునిచేతికిచ్చి పంపెను. శుకు డా మాలికను పద్మావతి కిచ్చి శ్రీనివాసుని వర్తమానమును చెప్పెను. పద్మావతి యా మాలికను

గ్రహించి, శిరసాగ్రహించి యలంకరించుకొని, దేవాగమనమును నిరీక్షించుచుండెను. ఆకాశరాజు చంద్రుని బిలిపించి వివాహార్థము విష్ణు నైవేద్యయోగ్యమైన పరమాన్నాదులను సిద్ధముచేయుమని కోరెను. ఇట్లు వివాహమున కన్ని సన్నాహములనుజేసి యలంకృతయగు కన్యతోగూడ ధరణీసహితుడై, యాకాశరాజు దేవాగమనమును నిరీక్షించుచుండెను.

వరాహ పు. 7-వ అధ్యా.

## 20. శ్రీనివాసుడలంకృతుడై వివాహనిమిత్తము దేవతలతోగూడ వియద్రాజపురమున కరుగుట

దేవాధిదేవుడైన శ్రీనివాసుడు లక్ష్మిని పిలిచి వివాహనేపథ్యార్థము నీ సఖుల నాజ్ఞాపింపుమని కోరెను. లక్ష్మీదేవిచే నాజ్ఞాపింపబడిన యామె సఖులు శ్రీనివాసుని నలంకరించుటకు మొదలిడిరి. సువర్ణఘటములతో దిగ్గజములమీద తేబడిన వియద్గంగాతీర్థముతో లక్ష్మి యతనికి యభ్యంగ స్నాన మాచరించెను. కేశములను సుగంధ ధూపముచే నారబెట్టెను. శరీరమును సుగంధముతో లేపనము చేసెను. పీతాంబరము కట్టించెను. ముకుటాది సమస్తాభరణములతో నలంకరించెను. ఇదాత్రిణీఛత్రమును ధరించెను. సరస్వతీ గౌరులు చామరములను వేసిరి. జయ విజయులు వ్యజనముల ధరించిరి. లక్ష్మీసమేతుడై గరుడుని నధిష్ఠించి, బ్రహ్మేశ వజ్రి, వరుణ, యమ, యక్షేశులచే సేవింపబడుచున్నవాడై, సనకాది యోగులచేతను, వసిష్ఠాది మునులచేతను ననుసరింపబడినవాడై, స్వామి యాకాశరాజు పురమగు నారాయణపురమునకు వెడలెను. గంధర్వులు పాడ నారంభించిరి. అప్సరస లాడ నారంభించిరి. దేవదుందుభులు మ్రోగినవి. ఇట్లు దేవదేవుడు దేవగణములతోను, విష్వక్సేనాది పార్షదులతోను, వకుళాదేవ్యాది సఖులతోను గూడినవాడై, యలంకృతమగు యాకాశరాజునగరమును బ్రవేశించెను.

## 21. పద్మావతీ పరిణయము

శ్రీనివాసుడు విజయము చేయుచున్నాడని విని యాకాశరాజు, పద్మావతిని నైరావతముపై నెక్కించి, పురప్రదక్షిణముచేయించి, గోపుర ద్వారమున నిలిపి బంధుమిత్రులతోగూడి నిరీక్షించుచుండెను. శ్రీనివాసుడు వేంచేయగా నాకాశరాజు, వధూవరులను దగ్గర చేర్చెను. అప్పుడు శ్రీనివాసుడు తన కంఠమందుండిన వనమాలను తీసి పద్మావతికంఠమున నుంచెను. పద్మావతిగూడ తన కంఠమందుండిన మల్లికామాలను శ్రీనివాసుని కంఠమందు సమర్పించెను. ఇట్లు మూడు పర్యాయములు మాలా వినిమయము జరిగిన పిదప వారు వాహనములను దిగి, యొక్క క్షణ మక్కడ పీఠము నలంకరించి, తదుపరి వివాహవేదికవద్ద కేగిరి. అచ్చట బ్రహ్మదేవుడు వారిరువురకును సంకురార్పణాదిగా మాంగల్యసూత్రబంధ యుక్త లాజహోమాంతము గల వైవాహికక్రియలను యథోక్తముగా జరిపించెను. చతుర్థదివసమున వివాహకర్మనంతను సమాప్తిగావించి, వియద్రాజును అనుమతింపజేసి, చతుర్ముఖుడు హరిని గరుడుని మీద నధిష్ఠింపజేసి దివ్యదుందుభి ఘోషములతో గూడ వృషభాద్రికి బనిచి, తాను దేవతలతో గూడ పయనమయ్యెను. వియద్రాజు పద్మావతీదేవికి ననేకసువర్ణపాత్రములను, పయోఘటసహస్రములను, దివ్యఫలములను, శర్కరాపూరితఘటములను, సువర్ణమణియుక్తాంబరములను, దాస దాసీ సహస్రములను, గోశతములను, అనేకవర్ణ హయసహస్రములను, గజ శతములను, నృత్తగీతవిచక్షణాంతఃపుర చరసహస్రములను, ప్రాభృత ముగా నిచ్చెను.

దీనినంతను జూచి శ్రీనివాసుడు సంతసించి శ్వశురుడగు నాకాశ రాజునుజూచి, "నీకు వరమిచ్చెదను. ఏమికావలయునో కోరుకొనుము" అని యానతిచ్చెను. అప్పు డాకాశరాజిట్లు పలికెను. "ఈ ప్రకారముగా నెడతెగని నీ సేవ నాకు ప్రాప్తించుగాక. నా మనస్సు నీ పాదకమల

ములయం దుండుగాక. నీయందు నా కెల్లప్పుడు భక్తి యుండుగాక." అట్లే యగుగాక యని వరమిచ్చి, యాకాశరాజును, బ్రహ్మాది దేవతలను తమ తమ స్థానములకు పోవుట కనుజ్ఞ నిచ్చెను. పిదప తాను లక్ష్మీ పద్మావతులతో గూడి పూర్వము వలె విహరించు స్వామిపుష్కరిణీతీర మందున్న దివ్యాలయమున నర్చింపబడుచు నుండెను.

వరాహపు. 8-వ అధ్యాయము.

## 22. కలియుగమున శ్రీనివాసుని దర్శించినవారి వృత్తాంతము

శ్యామాకవనపాలకుడగు వసువను నిషాదు డొకడు వేంకటాద్రి యందు నివసించుచుండెను. అతను పురుషోత్తమునియందు విశేషభక్తి కలవాడై యుండెను. అతను ప్రతి దినమును శ్యామాకతండులములను పచనముచేసి తేనెతోగలిపి దేవదేవునికి భక్తితో నివేదన చేయుచుండెను. అతనికి చిత్రవతి యను భార్యయందు వీరుడను నామముకలవా డుత్తమ సుతుడొకడు జన్మించెను. ఒకనాడు తన పుత్రుని శ్యామాకధాన్యమును జూచుచుండుమని చెప్పి భార్యాసమేతుడై, వసువు తేనెను గొనితెచ్చుట కడవికి పోయెను. అతను తిరిగి వచ్చులోపల వీరుడు, శ్యామాకము నగ్నియందు పక్వము చేసి వృక్షమూలమందుంచి శ్రియఃపతికి నివేదించి యారగించెను. వసువు మధువునుదెచ్చి చూడగా శ్యామాకము వీరునిచే భక్షింపబడినట్లు తెలియవచ్చెను. వసువు తన కుమారుడు చేసిన యప చారమునకు కోపమును పట్టలేక ఖడ్గమును దీసి, తన కుమారుని నరక బోయెను. ఆ వృక్షమూలమున శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై యాఖడ్గమును పట్టుకొనెను. వసువు తిరిగిచూడగా వృక్షముచాటున శంఖచక్రగదాపాణి యగు విష్ణువు కనబడెను. వసువు వెంటనే ఖడ్గమునువదలి నమస్కరించి, "స్వామీ! ఏమి యిది" అని యడిగెను. అప్పుడు శ్రీనివాసు డిట్లాన తిచ్చెను. "వినుము. నీపుత్రుడు నాయందు విశేషభక్తికలవాడు. నీకంటె

నతఁడు నాకు ప్రియతముడు. అందుచే ప్రత్యక్షమైతిని. అతనివిషయమై నే నెల్లవేళల నుందును. నీవిషయమున నేను నా పుష్కరిణీతీరముననే యుందును" అని పలికి యంతర్హితుడయ్యెను.

బాల్యమునుండియు విష్ణుభక్తిసమన్వితుడగు రంగదాసుడను నతడు పాండ్యదేశమునుండి నారాయణపురికి వచ్చెను. అచ్చట వేంకటాద్రి యందు స్వయంభువగు శ్రీనివాసుడు కలడని విని యతనిని సేవించుటకు పయనమయ్యెను. సువర్ణముఖిని దాటి, పద్మసరస్సును బొంది, యా పుణ్యసరస్సునందు స్నానము చేసి, తత్తీరవాసులగు రామకృష్ణులను సేవించి, క్రమముగా శేషాద్రిని సమీపించెను. అచ్చట పాపనాశకమగు చక్రతీర్థము నందు స్నానము చేసి వేంకటాద్రి నెక్కెను. కొండపైని భక్తితో స్వామిపుష్కరిణిలో స్నానము చేసి, దానితీరమున తరుమూలమున పూజింపబడుచున్న దేవదేవునికి నమస్కరించెను. అంత శ్రీనివాసుడు శ్రీభూదేవులతో గూడినవాడై, శంఖచక్రగదాశార్ఙ్గములచే సేవింపబడుచు గరుడుని ఛాయను ప్రత్యక్షమయ్యెను. రంగదాసు డాశ్చర్యచకితమానసుడై, విష్ణువునకు సాష్టాంగ దండప్రణామము లాచరించెను. శ్రీనివాసునికి నారామమును నిర్మించి, పుష్పసమర్పణ కైంకర్యమును జేయ నుద్దేశించి, పరిసర వనభాగమును ఛేదించి, శిలాప్రాకారమును నిర్మించి పుష్పారామము నేర్పాటుచేసెను. అందొక కూపమును నిర్మించి, యా జలముచే చెట్లను తడుపుచు వృక్షములను పెంచెను. పుష్పముల నేరి స్వయముగా విచిత్రములగు దామములను గ్రుచ్చి, దేవదేవునకు సమర్పించుచుండెను. ఒక దినమున గంధర్వరాజు గంధర్వకన్యకలతో వచ్చి యా పుష్పవనములోని సరస్సులో జలక్రీడ నాడుచుండెను. పుష్పమాలలను దెచ్చుచున్న రంగదాసుడు, జలక్రీడ లాడుచున్న గంధర్వుని జూచి మోహించి, పుష్పకైంకర్యమును మరచి, యచ్చటనే యుండిపోయెను. జలక్రీడానంతరము గంధర్వుడు స్త్రీలతోగూడ విమానమ్ముమీద

నాకాశమార్గమున పోగా రంగదాసుడు తెలివి తెచ్చుకొని యా సరస్సున స్నానము చేసి పుష్పములను స్వామికి సమర్పించుటకు విమానమున కరుదెంచెను. పూజాసమయ మతిక్రమించుటచే పూజారి, యెందులకాల స్యముగా దెచ్చితివని ప్రశ్నించెను. రంగదాసుడు ప్రత్యుత్తర మీయలేక లజ్జావనతశిరస్కుడై నిలచియుండెను. అప్పుడు భగవంతుడు ప్రత్యక్షమై యిట్లు పలికెను. " ఓ దాసా ! ఎందులకు లజ్జపడుచున్నావు. నేనే నిన్ను పరీక్షింపనెంచి మోహింపజేసితిని. నీవింకను కామమును జయించినవా డవు కాలేదు. నీవుకూడ గంధర్వరాజు వలె నీభూమియందు రాజగుదువు. అప్పుడు సమస్తభోగముల ననుభవించి నాయందు భక్తికలవాడవై నాకు విమానమును, ప్రాకారమును కట్టించగలవు. అప్పుడు నీకు ముక్తిని ప్రసాదించెదను. నీ శరీరపాతము వరకును నిచ్చటనే నా సేవ చేయు చుండుము. సకాములగు నా భక్తులకిట్లే ముక్తి లభించగలదు " అని పలికి యంతర్ధానమును బొందెను. రంగదాసు డారామమును బెంచి, యొక్క శతాబ్దము దేవదేవుని సేవ జేసి స్వర్గస్థుడయ్యెను.

చంద్రవంశమున సువీరుడను రాజునకు నందినీదేవియందు తొండమానుడను పుత్రుడు జన్మించెను. అతనికి నైదవయేటనే విష్ణు భక్తి యుదయించెను. శౌర్యవీర్య సౌశీల్యాదిగుణసంపన్నుడై యుండెను. పాండ్యరాజు తనయ యగు పద్మావతీదేవిని పరిణయమాడెను. అతను కన్యాశతముతో నారాయణపురమున స్వర్గమున, దేవేంద్రుని వలె సుఖముల ననుభవించుచుండెను. ఒకానొకదినమున తొండమానరాజు తండ్రిగారి యనుజ్ఞను పొంది మృగయార్థము, వేంకటాద్రి సమీపమున నున్న యరణ్యమునకు జనెను. అచ్చట పరివారముతోగూడ పాదచారిగ బోవుచుండగా నొక మదపుటేనుగు కానంబడెను. అతడు పట్టుకొను నుద్దేశముతో దానిని వెంబడించెను. అట్లతను సువర్ణముఖిని దాటి శుక మహర్షిని గని నమస్కరించి, వనమునుండి వనాంతరమునకు బోవు

చుండెను. వారిలో వల్మీకాకారముగా నున్న రేణుకాదేవిని గనెను. ఆమె త్రిదశులచేగూడ బూజింపబడుచుండెను. ఆమెకు నమస్కరించి తొండమానుడు పశ్చిమాభిముఖముగా వెళ్ళుచుండెను. ఇంతలో నొక పంచవర్ణ శుక మతని కంటబడెను. దానిని పట్టుకొనవలెనను నుద్దేశముతో దానిని వెంబడించ నారంభించెను. అది 'శ్రీనివాసా' యని యరచుచు వేంకటాద్రిపైకి బోయెను. ఆ రాజుకూడ దానిననుసరించి వేంకటాద్రిపై కెక్కెను గాని చిలుకను గనలేదు. గిరిపైని శ్యామాకవనపాలుని గని, "ఒక పంచవర్ణ శుక మీవైపునకు వచ్చినది. నీవు చూచితివా" అని యడిగెను. వనచరుడిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "ఆ పంచవర్ణ శుకము శ్రీనివాసునికి చాల ప్రియమైనది. ఎల్లప్పుడతని పార్శ్వమున నుండును. శ్రీభూదేవులు దానిని పెంచుచున్నారు. దానినిపట్టుట కెవరికిని సాధ్యము కాదు. పగలంతయు నీ వనమున స్వేచ్ఛగా తిరిగి, రాత్రులయందు శ్రీనివాసుని సన్నిధియందుండును. నేను శ్రీనివాసుని నారాధించుటకు బోవుచున్నాను. నేను తిరిగివచ్చు వరకు నా పుత్రునితో నిచ్చట విశ్రమింపుము." అప్పుడు తొండమానుడు, "దేవదేవుని దర్శించుటకు నేనుగూడ నీతో వచ్చెదను. నాకు శ్రీనివాసుని దర్శింపజేయుము" అని ప్రార్థించెను. వనచరుడట్లే కానిమ్మని మధుమిశ్రితమగు శ్యామాకాన్నమును గైకొని, రాజుతోగూడ స్వామిపుష్కరిణికరిగి, యందు స్నానమాచరించి, తత్సమీపముననున్న శ్రీవృక్షమూలమున దేవేశుని రాజునకు దర్శింపజేసెను. రాజు స్వామిని దర్శించి, విస్మయోత్ఫుల్లలోచనుడై, యానందపరవశుడయ్యెను. నిషాదుడు మధుమిశ్రిత శ్యామాకాన్నమును స్వామికి నివేదించి, సగము రాజున కిచ్చి, మిగిలిన దానిని తాను భుజించెను. తరువాత రాజు నిషాదునితోగూడ శ్యామాకవనమునకువచ్చి యతనియింట యొకరాత్రి యుండి, మరునాడుదయమున తనసైన్యముతో గూడ స్వపురమున కేగెను. తిరిగి దేవీవనమునకేగి, చైత్రశుద్ధ నవమి

నాడు రేణుకాదేవిని పూజించెను. హవిస్సును, పరమాన్నమును నివేదన చేసి, పశూపహారముతో గూడ సురాఘటశతమును సమర్పించెను. దేవి ప్రీతిని జెందినదై, యావేశరూపమున బ్రత్యక్షమై, రాజునకు వరము నొసంగెను. "ఓ రాజా! వినుము. నీ రాజ్యము నిహతకంటకముగా నుండును, నీపేరుతో నిచ్చట నీ రాజధాని విలసిల్లగలదు. నా సమీపమున నీవు చిరకాలము రాజ్యమును పాలించుచుండువు. దేవదేవుని ప్రసాదము కూడ నీకు లభించును" అని వరముల నిచ్చి యంతర్హితయయ్యెను.

## 23. పద్మసరోవరమాహాత్మ్యము

పైరీతిని వరమును బొందిన రాజు, శుకమునికి నమస్కరించి పద్మసరోవర మాహాత్మ్యమును వర్ణింపుమని ప్రార్థించెను. శుకముని యిట్లు వర్ణించెను. పూర్వము దూర్వాసమహాముని శాపముచే విష్ణుమూర్తితో గూడ స్వర్గమును వీడి, యీ పద్మ సరోవరమునకు వచ్చి, యయుతదివ్యవత్సరములు తపస్సు నాచరించెను. అప్పు డింద్రాదులగు దేవతలు అదృశ్యుడైన విష్ణువును, శ్రీని వెదక నారంభించిరి. వెదకి వెదకి చివరకు పద్మసరోవరమున నొక సువర్ణకమలమున పుండరీకాక్షునితో గూడ నున్న శ్రీని గనిరి. చూచి ప్రణామములాచరించి లోకమాతను స్తోత్రము చేసిరి. వారిస్తుతికి సంతసించినదై రమ యిట్లు పలికెను. "మీ శత్రువులను సంహరించి మీరు మీ స్థానముల కేగుదురుగాక! ఇదే ప్రకారముగా స్వస్థానమునుండి చ్యుతులైన మనుజులు నన్ను స్తుతించినచో వారుగూడ స్వస్థానములను దిరిగి బొందెదరు. ఈ స్తోత్రముతో నెవరు నన్ను బిల్వపత్రములతో బూజించెదరో వారు ధర్మార్థకామమోక్షములను బొందుదురు. నన్ను స్తుతించుచు నీపద్మసరస్సునందు స్నానము చేయు దేవతలు కాని, నరులు కాని, యైశ్వర్యమును, దీర్ఘాయువును, విద్యను, సత్పుత్రులను బొంది, సమస్తభోగముల ననుభవించి తుదకు

మోక్షమును పొందుదురు." ఇట్లు వరములనిచ్చి శ్రీదేవి విష్ణువుతోగూడ వైకుంఠమున కేగెను.

వరాహపు. 9-వ అధ్యా.

అంత శ్రీ శుకముని తొండమానునితో నిట్లనియెను. "ఈ పద్మ సరస్సు సర్వ పాపప్రణాశనము. కీర్తనము చేతను, స్మరణముచేతను, స్నానము చేతను నది భువియందు లక్ష్మీప్రద మగుచున్నది. అందు స్నానము చేసి నీ జనకుని యొద్ద కేగుము." తొండమాను డట్లే చేసి స్వపురమున కేగెను. వెంటనే తండ్రి యతనిని యౌవరాజ్యాభిషిక్తునిజేసి యతని వీర్య శౌర్య సామర్థ్య సౌశీల్యరంజకత్వములను గని సంతసించి, స్వపదమున స్థాపించి యభిషిక్తునిజేసి పత్నితోగూడ వనమున కేగెను.

తొండమానుడిట్లు రాజ్యమును పొంది దాని నేలుచుండగా నిషాదుడగు వసువుని వనమున దేవదేవుడు వరాహరూపమునెత్తి ప్రతిదినమును పక్వశ్యామాకములను భక్షించి పోవుచుండెను. ప్రతి దినమును వరాహపదము లతనికి గనబడుచుండెను. కాని వరాహము కనబడకుండెను. వరాహమును గనిపెట్టు నుద్దేశ్యముతో నతడొక దినమున ధనుర్ధరుడై, మేలుకొని యుండెను. శ్యామాకవనమధ్యను దిరుగుచున్న చంద్రకోటి సమప్రభమగు శ్వేతవరాహ మతనికి కనబడెను. అంత వసువు సింహనాదముచేసెను. ఆనాదమునువిని వరాహము వనమునుండి నిర్గమించెను. నిషాదుడు దానిని వెంబడించి వెళ్ళెను. రాత్రియంతయును పరుగిడి, తెల్లవారుఝామున నా వరాహమొక వల్మీకమున బ్రవేశించెను. ఆ నిషాదుడు కోపముతో నా వల్మీకమును త్రవ్వనారంభించెను. ధరావరాహము ప్రత్యక్షమయ్యెను కావి, నిషాదుడు మూర్ఛిల్లి ధరను పడెను. అతని పుత్రుడు వరాహమూర్తిని స్తోత్రము చేసెను. శ్రీహరి ప్రీతుడై తండ్రి నావేశించి యిట్లు పలికెను. "నేను వరాహరూపమున నిచ్చట నిత్యమును వసించుచున్నాను. నీవు రాజుతో జెప్పి నన్నిచ్చట ప్రతిష్ఠ చేయించి

పూజింపుము. వల్మీకమును కృష్ణగోక్షీరముచే కడిగినచో శిలారూపమున నే నుద్భవించెదను. ప్రతిష్ఠచేయించి, తొండమానుడు నన్ను వివిధభోగ ములతో పూజించు గాక " అని పలికి, దేవదేవుడు నిషాదుని వదలెను. అతను స్వస్థుడయ్యెను. స్వస్థుడైన తండ్రికి, నిషాదుడు సమస్తవృత్తాం తమును నెరింగించెను. నిషాదుడు ఆశ్చర్యచకితమానసుడై ఈ వృత్తాం తమును తొండమానునకు నెరింగించుట కేగెను.

తొండమానుడు వసువును చూడగానే యతనిని సత్కరించి, వచ్చిన కార్యమేమని యడిగెను. నిషాదుడు, తాను శ్యామాకవనమున చూచిన వరాహవృత్తాంతము నంతను వర్ణించి, దేవదేవుని యాజ్ఞను దెలియజేసెను. అది విని తొండమాను డాశ్చర్యముతోను, ప్రీతితోను కూడుకొనినవాడై వేంకటాద్రికివెళ్ళ నిశ్చయించి, మంత్రులకు యాత్ర నాజ్ఞాపించి, గోపకులను, కపిలగోవుల నన్నిటిని వేంకటాద్రికి గొనిపోవ నాజ్ఞాపించెను. మరుదినము ప్రయాణమును నిశ్చయించి, యంతఃపుర మున కేగెను. ఈ వృత్తాంతము నంతను దేవులకు చెప్పి నిద్రించెను. స్వప్నమున శ్రీనివాసుడు ప్రత్యక్షమై, యొక బిలమార్గమును చూపించెను. పురమునుండి బిలమార్గము వరకును పల్లవులను సృజించియుంచెను. తెల్లవార లేచి రాజు తన స్వప్నవృత్తాంతమును మంత్రులకును, ప్రజల కును నెరింగించెను. తన ద్వారమున నొక పల్లవునిగూడ గనెను. శుభ ముహూర్తమున తొండమానుడు హయారూఢుడై బయలువెడలెను. పల్లవులను చూచి, వారి వెంబడి బిలమార్గమునకు వచ్చెను. బిలమును చూచి యచ్చెరువంది, యచ్చట నా బిలము తన యంతఃపురమున నుండు నట్లొక పట్టణమును సప్రాకారముగా నిర్మించెను. అచ్చట వసించుచు, పృథివినంతను జయించి, యేలుచుండెను. దేవదేవుని యాజ్ఞానుసార ముగా నాయనను క్షీరముతో స్నానముచేయించి ప్రాకారనిర్మాణమునకు పూనుకొనెను. అప్పుడు శ్రీనివాసు డతని నిట్లాజ్ఞాపించెను. "ఈతింత్రిణీ

వృక్షము, ఈ చంపకవృక్షము తప్ప, మిగిలిన వృక్షములను ఛేదింపుము. వీనిని రక్షింపుము. ఈ తింత్రిణీవృక్షము నా స్థానము. ఆ చంపకవృక్షము లక్ష్మీస్థానము. ఆ రెండు నంవరిచేతను నమస్కార్యములు. నాకు ద్వార గోపురములతో గూడిన ప్రాకారము మాత్రము నీవు నిర్మింపుము. విమానమును నీ వంశ్యుడగు నారాయణుడు నిర్మింపగలడు. అతనుగూడ నాభక్తుడగును. అతను విమానమును నిర్మించి, దానిని స్వర్ణముతో నలంకరించును." ఆ యాజ్ఞను శిరసా వహించి, తొండమానుడు ప్రాకారముమాత్రము నిర్మించి, దేవదేవుని ప్రతిష్ఠచేయించి, నిత్యమును బిలమార్గమున పోయి యర్చించుచు, ధర్మయుక్తముగా రాజ్యమును పాలించుచుండెను.

ఆ కాలమున వీరశర్మయను దాక్షిణాత్య ద్విజోత్తముడు తన భార్యయగు లక్ష్మితోగూడ గంగాస్నానమునకు బయలువెడలెను. మార్గ మధ్యమున బ్రాహ్మణి గర్భవతి యై ప్రయాణము చేయజాలకపోయెను. అప్పుడు వీరశర్మ, తొండమానురాజును జూడగోరి, రాజద్వారమునకు వచ్చెను. ద్వారపాలకునిచే విజ్ఞాపింపబడిన, రాజు విప్రుని రప్పించి పూజించి, యాగమనకార్యము నడిగెను. ఆ విప్రుడిట్లు పలికెను. "నేను వీరశర్మ యను సామవేద బ్రాహ్మణుడను. భార్యాసమేతముగా గంగా స్నానము చేయునిమిత్త మాదరముతో బయలుదేరితిని. మార్గమునందు నా భార్యయగు నీ లక్ష్మి గర్భవతియయ్యెను. ప్రయాణము చేయజాలని యీమెను నీ భవనమున వీడి, వ్రతమును నిర్వర్తించుతలంపుతో నీకడ కేతెంచితిని. ఈమెకు భోజనాదికములను కల్పించి, నేను వచ్చువరకు నీమెను పోషింపగోరెదను." రాజట్లే కానిమ్మని యామెకు షణ్మాస పర్యంతము సరిపడు తండులాదుల నియ్య నాజ్ఞాపించి, యామెను తన యంతఃపురమున నుండ నియమించెను. ఆమెను విడచి, బ్రాహ్మణుడు గంగాస్నానమునకుపోయెను. కాశీప్రయాగాది పుణ్యక్షేత్రములలో గంగా

స్నానము నాచరించి, గయకుబోయి పితృశ్రాద్ధమును జేసి, అయోధ్యా బదరికాశ్రమాది పుణ్య క్షేత్రములను దర్శించి, రెండు సంవత్సరములు గతించిన పిదప స్వదేశమునకు మరలెను. చైత్రశుద్ధైకాదశినాడు రాజును గని, రాజుకు గంగాజలమును సమర్పించి బ్రాహ్మణి, కుశలమడిగెను. రాజు మరచిన బ్రాహ్మణివిషయమును జ్ఞప్తికితెచ్చుకొని యతని నుండుమని చెప్పి, బ్రాహ్మణి విషయమును దెలిసికొనుట కంతఃపురమున కేగెను. అచ్చట కృశించి శుష్కించిన యామెమృతశరీరమును గనెను. బ్రాహ్మణునితో నీ విషయమును జెప్పక, రాజు బిలమార్గమున వరాహమూర్తిని నమస్కరించి శ్రీనివాసుని దర్శించుట కేగెను. అకాలమున వచ్చిన రాజును జూచి శ్రీనివాసుం, డెందులకు వచ్చితివని యడిగెను. రాజు భయముతో బ్రాహ్మణీవృత్తాంతము నెరిగించెను. అప్పుడు శ్రీనివాసుడిట్లు పలికెను. " రాజా ! భయపడకుము. ఆమెను పల్లకినధిష్ఠింపజేసి నీ యంతఃపురజనులతో గూడ తీనుకొనిపోయి నా యాలయమునకు బూర్వదిగ్భాగమున నున్న అస్థిసరోవరమున ద్వాదశినాడు స్నానము చేయింపుము. ఆమె సజీవురాలై, బ్రాహ్మణునితో గలిసికొనగలదు. నీవు శీఘ్రముగా పోయి యట్లాచరింపుము." రాజట్లుచేయగా బ్రాహ్మణి ప్రాప్తజీవయై భర్తను తిరిగి కలిసికొనెను. రాజు హరిని పూజించి, బ్రాహ్మణునికి ధనమునిచ్చి సంతోషపెట్టెను. బ్రాహ్మణుడు శ్రీనివాసుని ప్రభావమున కాశ్చర్యపడి, రాజునాశీర్వదించి స్వపురమున కేగెను. విప్రనిష్క్రమణానంతరము శ్రీనివాసుడు తిరిగి రాజుతో నిట్లు పలికెను. "ప్రతిదినమును నైవేద్యానంతరము మధ్యాహ్నము వచ్చి, స్వర్ణపంకజములతో నర్చించిపోవుచుండుము. ధర్మముతో రాజ్యపాలనము చేయుచుండుము. నీవు కోరిన దంతయును నీకు సిద్ధించును. అకాలమున నెన్నడును నావద్దకు రాకుము." రాజట్లే చేసెదనని చెప్పి, నిత్య మట్లు చేయుచుండెను.

ఒకదినమున రాజు, శ్రీనివాసు నర్చించిన తులసీ పుష్పములు మృణ్మయముగానుండుట గని యాశ్చర్యమును పొంది, "మృణ్మయము లైన తలసీపుష్పములతో నెవరర్చించిరి" యని శ్రీనివాసుని నడిగెను. శ్రీనివాసుడిట్లు పలికెను. "కుర్వగ్రామమున నాభక్తుడగు కులాలుడొకడు కలడు. అతడు తన గృహమున నన్నర్చించుచున్నాడు. దానిని నేను స్వీకరించుచున్నాను." శ్రీనివాసుని వాక్కును విని, రాజా కులాలుని జూడ నెంచి, వాని గ్రామమునకు పోయెను. రాజును చూచి భీముడను నా కులాలుడు నమస్కరించి యెదుట నిలచెను. అప్పుడు రాజు భీము నిట్లడిగెను. "ఓ భీముడా ! నీవు శ్రీనివాసునెట్లు పూజించుచున్నావు." అది విని కులాలుడు, "నాకు శ్రీనివాసుని నర్చించుట తెలియదు. కులాలు డర్చించుచున్నాడని మీతో నెవరనిరి" అని యడిగెను. శ్రీనివాసుడే నాతో చెప్పెనని రాజు ప్రత్యుత్తర మిచ్చెను. రాజు పలుకులను విని, శ్రీనివాసుని వరమును జ్ఞప్తికి తెచ్చుకొని యిట్లు పలికెను. ఎప్పుడు నీ పూజ ప్రకాశమును పొందునో, ఎప్పుడు తొండమానురాజు వచ్చి నీతో సంభాషించునో, యప్పుడు నీకు మోక్షము కల్గునని శ్రీనివాసుడు నాకు నాకు వరమిచ్చెను." ఇట్లు పలుకగా విమానమొకటి ప్రత్యక్షమయ్యెను. కులాలు డప్పుడు ప్రత్యక్షమైన శ్రీనివాసునికి నమస్కరించుచు, పత్నితో గూడ దేహమును విడచి రాజు చూచుచుండగా విమానమున నధిష్ఠించి, దివ్యరూపధరుడై వైకుంఠమున కేగెను.

ఈయద్భుతమునుజూచి రాజు స్వపురమునకుబోయి శ్రీనివాసుడను తన పుత్రుని రాజ్యము నందభిషిక్తునిజేసి రాజ్యమును ధర్మయుక్తముగా పరిపాలించుమని యాజ్ఞాపించి తపమున కేగెను. అతని తపస్సునకు సంతసించి శ్రీనివాసుడు శ్రీభూ దేవులతో గూడ గరుడాధిష్ఠితుడై ప్రత్యక్ష మయ్యెను. "నీ తపస్సునకు సంతసించితిని. నీకేమి కావలయు" నని రాజునడిగెను. తొండమానుడు సాంజలియై, గద్గదస్వరముతో నిట్లు

ప్రార్థించెను. "జరామరణవర్జిత మగు తమ లోకమున నివాసమును గోరుచున్నాను. ఇదియే నా కోరిక. నా కీ వరము నిమ్ము ప్రభూ" అని ప్రార్థించి, సాష్టాంగముగా శ్రీనివాసునికి నమస్కరించెను. అప్పుడు తొండమానుడు తనశరీరమును త్యజించి విమానమునెక్కి, గంధర్వులచే స్తుతింపబడుచున్నవాడై విష్ణుసారూప్యమును బొంది, శోకమోహరహిత మైనట్టియు, జరామరణవర్జితమైనట్టియు, పునరావృత్తిరహితమైనట్టియు, వైకుంఠమున కరిగెను.

శ్రుణుయాద్యః పఠేద్భక్త్యా కథాం పుణ్యాం పురాతనీమ్ ।
స తు భుక్త్వాఽఖిలాన్కామాన న్తే విష్ణుపదం వ్రజేత్ ॥

వరాహపురాణోక్త శ్రీ వేంకటాచలమాహాత్మ్యము
ద్వితీయాశ్వాసము సంపూర్ణము.



శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము

## తృతీయాశ్వాసము

## 1. మునులు సూతుని వేంకటాచలమాహాత్మ్యమును జెప్పుమని కోరుట

"ఓ సూతుడా! ఇదివరలో నీవు కరిగిరి మాహాత్మ్యమును, జగన్నాథమాహాత్మ్యమును జెప్పియుంటివి. ఇప్పుడు వేంకటేశ్వర మాహాత్మ్యమును విన గుతూహలముతోనున్నారము. మాకెరింగింపుము" అని మునులు సూతుని బ్రార్థింపగా సూతుడిట్లనియె. "మీరు వేంకటేశ మాహాత్మ్యమును జెప్పుమని కోరుట నాకు చాల సంతోషముగా నున్నది. పూర్వము వ్యాసుని వలన వినినదానిని నేనిప్పుడు చెప్పెదను వినుడు." అని యిట్లు వేంకటాద్రిమాహాత్మ్యమును జెప్పదొడంగెను.

కలియుగమున వైకుంఠగిరిమాహాత్మ్యకీర్తనశ్రవణములు సర్వ దుఃఖహరములు. ధనకామునకు ధనమును, పుత్రకామునకు పుత్రుని, రోగార్తునికి రోగ నివారణమును, జిజ్ఞాసువునకు జ్ఞానమును నిచ్చుచున్నవి. పూర్వము దీనిని విని బ్రహ్మ, బ్రహ్మపదమును బొందెను. నీలకంఠుడు నిర్విషుడై, సుఖమును బొందెను. ఇంద్రుడు స్వర్గమును బొందెను. లోకపాలురు దీని శ్రవణముచేతనే స్వస్థానములను బొందిరి. ఇంత యేల వేంకటేశమాహాత్మ్యశ్రవణ మనంతఫలదము.

కృతే వృషాద్రిం వక్ష్యంతి త్రేతాయామంజనాచలమ్।
ద్వాపరే శేషశైలం తు కలౌ శ్రీవేఙ్కటాచలమ్।
నామాని యుగభేదేన శైలస్యాస్య భవంతి హి॥

## 2. కృతయుగమున వృషాచలమను పేరు కలిగిన విధము

కృతయుగమున వృషాసురుడను రాక్షసుడు, శేషశైలము నాక్రమించి మునులను బాధించుచుండెను. ఆ మునులు, భక్తుల కభయ ప్రదుడగు శ్రీనివాసుని శరణుపొంది స్తోత్రములు చేసిరి. శ్రీనివాసుడు వారికి ప్రత్యక్షమై వారిబాధను నివారించెదనని చెప్పి యంతర్ధానమయ్యెను. ఈ వృషభాసురుడు తుంబురుతీర్థమున ప్రతినిత్యము స్నానము చేయుచు, శ్రీనృసింహసాలగ్రామము నర్చించుచు, పూజానంతరము ఖడ్గముతో తన శిరమును ఛేదించినదాని నొక పుష్పముతో దేవునకు సమర్పించుచుండెను. ఛేదించిన వెంటనే, తన శిరం బతనికి యథాప్రకారంబు వచ్చుచుండెను. ఇట్లయిదువేల సంవత్సరంబు లారాధనము చేసెను. అప్పుడు శ్రీమన్నా రాయణుడు ప్రత్యక్షముకాగా, నా యసురుడు దండప్రణామంబులు గావించి స్తుతించి, తనకు మోక్షముకాని, స్వర్గముకాని, పరమపదముకాని, యవసరము లేదనియు, శ్రీవారితో యుద్ధము చేయ నిచ్ఛయే కలదని విన్నవించెను. శ్రీమన్నారాయణుడు సరేయని యంగీకరించెను. వారిద్దరి కిని యుద్ధము ప్రారంభమయ్యెను. యుద్ధములో నీ రాక్షసుడు శ్రీమన్నా రాయణుడేరూపము దాల్చిన తానారూపమును ధరించుచుండెను. విశ్వరూప మును ధరించిన విశ్వరూపమును, గరుడవాహనారూఢుడుగ నుండిననట్టి రూపమును ధరించగా, శ్రీమన్నారాయణుడు సుదర్శనప్రయోగము చేసెను. అంత నారాక్షసుడు చక్రపాణికి నమస్కరించి, "సుదర్శనమహిమ వింటిని. చక్ర మమోఘము. కాని చక్రహతులకు పరమపదము నిశ్చయ మని యెరుంగుదును. చక్రానలదగ్ధుడనై నేనెచ్చటికి బోయెదను" అని చెప్పి, శ్రీహరికి సాష్టాంగప్రణామము లాచరించి, యీ శైలము నా నామముతో ప్రసిద్ధమగుగాక యని వరమును యాచించెను. శ్రీమన్నారాయణు డతని నాలింగనము చేసికొని యట్లేకానిమ్మని వరమునిచ్చి, పరమపదమునకు బంపెను. అందుచే నిది వృషభాచలమను పేరును పొందెను.

## 3. త్రేతాయుగమున నంజనాచలమను నామమును బొందినవిధము

కేసరిభార్యయగు నంజనాదేవి త్రేతాయుగమున, పుత్రులులేరను శోకముచే కన్నీళ్లు వదలుచు, మతంగమహర్షి వద్దకేగి నమస్కరించి, తన దుఃఖకారణమును జెప్పుకొనెను. ఆ మునిపుంగవుడది విని యిట్లనియె. "పంపా సరస్సునకు బూర్వభాగమున నేబది యోజనముల దూరమున, నృసింహక్షేత్రము కలదు. దానికి దక్షిణమున నున్న, నారాయణగిరికి నుత్తరముగ నున్న, శ్రీస్వామిపుష్కరిణికి క్రోశ దూరమున నున్న యాకాశగంగకు బోయి, తత్సమీపమున పండ్రెండు సంవత్సరములు తపమాచరించిన, యా పుణ్యఫలమువలన సుపుత్రుని బడయగలవు" అని యామె నోదార్చి పంపెను. మునివాక్యానుసారముగ నామె పోయి, శ్రీస్వామిపుష్కరిణిలో స్నానమాచరించి, యశ్వత్థప్రదక్షిణము గావించి, శ్రీవరాహస్వామివారి దర్శనముచేసి యాకాశగంగకేగి, యచ్చటనుండు మునుల యొక్కయు, భర్తయొక్కయు నానతి తీసికొని, నిరాహారనియమముతో తప మాచరింప నారంభించెను. వ్రతము పూర్తియగుసరికి మహాబలుడైన వాయుదేవుడు. వీర్యప్రపూరితమగు ఫలము నొక దానిని నామెకిచ్చెను. ఆమె దానిని భక్షించి గర్భవతి యయ్యెను. పది మాసములు పూర్తి కాగా, వాయుసమాన బలుడగు హనుమంతుడను పుత్రుడామెకు కలిగెను. అంజనాదేవి తపము చేసిన పర్వతమగుటచే దీనికి అంజనాద్రి యను ప్రసిద్ధికలిగినది.

## 4. ద్వాపరయుగమున శేషశైల మను నామము కలిగిన విధము

వైకుంఠమున శ్రీమన్నారాయణుడు లక్ష్మీసమేతుడై యుండ, శేషుండు స్వర్ణవేత్రహస్తుండై ద్వారమును పాలించుచుండ, మహాబలుడగు వాయువు, భగవంతుని జూడ వేగముగా వేంచెను. అప్పుడు సర్పరాట్టు తన బెత్తముతో లోనికి బోవలదని వాయుదేవుని నిషేధించెను.

కార్యార్థము శ్రీవైకుంఠాధిపుని జూడవచ్చుచుండ నభ్యంతరపరచినందుకు గోపావిష్టుడై, యెందులకు పోగూడదని వాయువడుగగా "లక్ష్మీవల్లభుం డంతఃపురమున నున్నవాడు. ఆతనియాజ్ఞానుసారము నేనిచటనున్నాను" అని శేషుడు ప్రత్యుత్తర మీయగా, నా మాటలు నాలకించి, "పూర్వము జయ విజయు లిట్లహంకారపూరితులై, సనకాది మునులను నిరోధించి నందులకా మునుల శాపంబుచే రావణకుంభకర్ణులైరి – అను విషయము నీకు తెలియదా?" యని వాయుదేవు డనెను. ఇట్లు వారిరువురకు వాగ్వాదము ప్రబలెను. అంత లక్ష్మీదేవిచే ప్రబోధము కావించబడిన శ్రియఃపతి, "ఆ గర్వితో నీకు గలహమేమి?" యని వాయువుతో నన, నత డూరకుండి స్వామికి సాష్టాంగనమస్కార మాచరించెను. శేషు డూరకుండక, తాను బహుపరాక్రమశాలి యనియు, తనతోసమాను లెవరును లేరనియు ప్రగల్భములు పలుక, విష్ణుమూర్తి యిట్లానతిచ్చెను. "మాటలతో ప్రయోజనము లేదు. క్రియలో పరాక్రమము చూపించవలయును. మేరుపుత్రుడైన యానందుడను పర్వత ముత్తరభాగమున గలదు. దానిని చుట్టుకొని గట్టిగా నీ బలముతో బట్టుకొనుము. ఈ వాయుదేవుడు దానిని కదల్పగలిగినచో నీకంటే బలవంతుడు; లేనిచో నీ వతనికంటె బలవంతుడవు" అనిన, శేషుండు పోయి, యానందాద్రిని చుట్టుకొని, శిరంబుల గట్టిగ నొక్కి పట్టుకొనెను. వాయుదేవుడు దానిని కదల్పుటకు తన యావద్బలముతో వీచ నారంభించెను. లోకము లన్నియు వల్లకల్లోలములు కా నారంభించెను. కాని పర్వతరాజంబు చలించదాయె. వాయుదేవుడు బహుకోపావిష్టుడై, యింకను తన బలంబును జూప నారంభింప, నింద్రాదిదేవతలు వలదని వేడిరి గాని యతడు విరమించలేదు. అప్పుడు వారు, శేషుని వదలుమని వేడ నారంభించిరి. వారి కోరిక ననుసరించియు, భగవంతుని యిచ్ఛ నూహించియు శేషుడు పట్టు నొక తలతో వీడ, నా భూధరం బెగుర నారంభించెను. వాయు

బలముచే నా నగము దక్షిణముగా యోజనశతంబు లతివేగముగా పో నారంభించగా, మేరుపర్వతము తనపుత్రునకు సంప్రాప్తించిన విపత్తునకు భయపడి, తన కుమారుని రక్షించుమని వాయుదేవుని ప్రార్థించెను. వాయువు శేషయుక్తమగు నా నగమును సువర్ణముఖీనది కుత్తరతీరమున నుంచెను. అప్పుడు దేవతలందరు వాయువుతో నిట్లనిరి. "ఈయానందాచలము శేషాంశసంభూతము. తన వాసముకొరకు హరిచోదనముచేతనే జన్మించినది. ఈ వివాదవ్యాజమున నీచే స్వర్ణముఖీ తీరమునకు చేర్చబడినది. మాయావి యగు భగవంతుడు నిన్నిట్లు మోహింపజేసెను. శ్రియఃపతికి నంతరంగుడగు ఫణిరాజునకు, నీవి ట్లపరాధము చేసినవాడవగుచున్నావు. అతనిని వేడుకొని ప్రసాదింపజేయుము." వారిపలుకులు విని వాయుదేవుడు శేషుని స్తుతించి, తన దౌరాత్మ్యమును క్షమింపుమని వేడెను. శేషపరివృతమై, శేషాంశమైన యీ పర్వతరాజమున కప్పుడు శేషాచల మని పేరు కలిగెను.

## 5. కలియుగమున వేంకటాచలమను నామము కలిగిన విధము

పూర్వము కాళహస్తిగ్రామమున పురందరుడను శుద్ధ శ్రోత్రియ సోమయాజి నివసించుచుండెను. అతడు చిరకాల మపుత్రుడుగా నుండి, వార్ధక్యమున పూర్వ పుణ్యముచే పుత్రప్రాప్తిని బడసెను. అతనికి మాధవుడని పేరు పెట్టెను. అతను వేద వేదాంగములయందు, సర్వ విద్యలయందును గ్రమముగా విశారదుడయ్యెను. అతనికి పాండ్యదేశజ యగు చంద్రలేఖయను కన్యను పరిణయము చేయబడెను. ఆమె పరమ పతివ్రతయై భర్తకు సకలశుశ్రూషలచేయుచు భర్తయనుమతిని మెలంగుచుండెను. ఒకానొక దినమున పగటిపూట కామాతురుడై యా విప్రుడు, భార్యను సంగమార్థ మాహ్వానించెను. దివసక్రీడయం దిచ్ఛ కలిగిన భర్తతో చంద్రలేఖ యిట్లనియె. "నాథా! అసలు సంగమమే సాధు

సమ్మతము కాదు. అందును దివాసంగమము నిషిద్ధము. మన యింటి యందు తల్లిదండ్రులు, అగ్నిహోత్రమును గలవు. సర్వసాక్షి యగు సూర్యుడు ప్రకాశించుచున్నాడు. ధర్మపరుడ వై, దివాసంగమేచ్ఛను వదలుము." ఆమెమాటల నాదరింపక మాధవుడు, ప్రేయసీ ! నాకు సంగమాభిలాష మిక్కుటముగా నున్నది. నే విడువజాలను. నా మనోరథమును నీవు పూరింపక తప్పదు. నీకు మంచి పుత్రుడు కలుగును. పరమున నీకు పతిలోకము ప్రాప్తించును " అని యామెను నిర్బంధ పెట్టెను. అప్పుడు చంద్రలేఖ పతివాక్యమున కెదురు చెప్పలేక, యీ యుపాయమును జెప్పెను. "నేను జలార్థము కడవనెత్తుకొని చెరువునకు బోయెదను. నీవు కుశార్థము నా వెంటరమ్ము, వనమున నీ యభీష్టమును నెరవేర్చుకొనవచ్చును.'' వారిద్దరు భార్యాభర్తలునుగ్లే గృహమునుండి వెడలి, తటాకమవతల నున్న వటవనమున కేగిరి. అచ్చట మాధవుడు, మరి యొక సుందరమైన స్త్రీని గనెను. ఆమెసర్వాంగ సౌష్ఠవమును జూచి యా విప్రుడు మోహించి, భార్యతో నిట్లనియె. "ప్రియురాలా ! నీ పతిభక్తికి మెచ్చితిని. నే నధర్మము నాచరించువాడనుకాను, నీ వింటి కేగుము." చంద్రలేఖ సంతసించి, భర్తయాజ్ఞను శిరసావహించి యింటికి మరలిపోయెను. తనభార్య యింటికేగుట గని, మాధవుడు మన్మథపీడితుడై, యా స్త్రీని సమీపించెను. కాని యామె, " ఓ మునీశ్వరుడా ! నే నంత్యజను. నా దగ్గరకు రాకుము" అని యతనిని బ్రార్థించెను. అది విని, యత డామెనిట్లు ప్రశ్నించెను. " ఓ సుందరీ ! నీ వెవ్వతెవు ? నీ తల్లిదండ్రులెవ్వరు ? నీ నివాసమెచ్చట ?'' అన నామె యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. " పాపిష్ఠినగు నన్నెందుల కడిగెదవు. నా పేరు కుంతల యందురు. నే నంత్యజులకు పుట్టిన యంత్యజాతి స్త్రీని. మా వృత్తి వ్యభిచారము. మేము సురామాంసభక్షకులము. మా నివాసము మధ్య దేశము. నీవు వేద వేదాంగ నిష్ఠుడవు. నన్ను చూచుట కూడ నీకు

తగదు. నన్ను ముట్టుటకును, నాతో క్రీడించుటకును, నీ వెందులకు కోరెదవు." అది విని మాధవుడు తిరిగి యిట్లు పలికెను. "నీవంటి సర్వాంగసుందరిని, యంత్యజాతిని సృజించిన పద్మయోని, యంధుడై యుండవలయును. నీ యంద మడవిని కాచిన వెన్నెల యైనది. అయి నప్పటికిని నా మనస్సు నీనుండి మరలకున్నది. ఆ బ్రహ్మదేవుడే నా మనస్సును నీయందు లగ్నము చేసెను. కాబట్టి నా కోరికను నెరవేర్చి, నన్ను రక్షింపుము" అనిన, కుంతల తిరిగి యిట్లనియెను. "కులటతో రమించిన వారి పితరులు నూరు పురుషాంతరముల వరకును దగ్ధులగుదు రని మన ధర్మశాస్త్రములు బోధించుచున్నవి. కాబట్టి యిట్టి పాపకార్య మునుండి మరలుము." అది విని మాధవుడు శాస్త్రమును ద్రోసిపుచ్చి, విధిప్రేరితుడై యిట్లు పలికెను. "లవణోదధియందు జన్మించినవైనను రత్నములు నిజకాంతి వలన నంగీకరింపబడుటలేదా? కాబట్టి సౌందర్య ముచే, నీవు యంత్యజవైనను గ్రాహ్యవగుచున్నావు. మరణించి నా పిత రులతో నరకమునకు బోయినను, నేను నీ రతి ననుభవించక తప్పదు" అని యా కుంతల యెంత విరోధించినను వినక, యా విప్రుడు దానిని స్పృశింపబోవ, నామె పలాయిత కాగా, విప్రు డామెను వెంట తరిమి పట్టుకొని బలాత్కారముగా నామెతో భోగించెను. భోగానంతరము కుంతల వానితో నిట్లనియె. "ఓ విప్రుడా! యిప్పటి నుండియు నీవు నాకు భర్తవైతివి. చండాలత్వమును బొందితివి. నీవు యజ్ఞోపవీతమును త్యజించి, నాతో మధుమాంసములను భుజించుచు, మాయింట నివసింపుము" అనిన మాధవు డట్లే యని చండాలత్వమును స్వీకరించి, దాని యింట నివసించుచుండెను. ఇట్లు ద్వాదశాబ్దములు గడవగా నా యంత్యజ కాలధర్మమును బొందెను. ఆమెవియోగము వలన మాధవుడు దుఃఖా తురుడై యున్మాదివలె భూపర్యటన మాచరించుచుండెను. ఆ సమయ మున నుత్తరదేశస్థులగు రాజులు కొందరు వేంకటాద్రికి యాత్రపోవుచు

నకస్మాత్తుగా వాని కంట బడిరి. వారి యుచ్ఛిష్టములను భుజించుచు, మాధవుడు వారివెంట బయలుదేరి వేంకటాద్రినిచేరెను. అచ్చట నారాజులు వపనము నాచరించి, సుదర్శనతీర్థమున స్నానములను జేసిరి. వారితో గూడ మాధవుడును శిరస్సును వపనము చేసికొని తీర్థమున స్నానము చేసెను. దీనితో మాధవుడు గతకల్మషుడాయెను. ఆ రాజులు పితరులకు పిండదానములు చేయగా, మాధవుడు గూడ తన పితరులకు మృత్పిండ ముల నిడెను. దానితో వాని పితరులు ముక్తులైరి.

'కిం వర్ణయామః పురుషోత్తమస్య
క్షేత్రస్య తీర్థస్య చ పుణ్యశక్తిమ్ ।
మృత్పిండదానాత్పితరశ్చ తస్య
ముక్తింప్రసన్నా మురవైరిశాసనాత్ ॥ '

మరునాడుదయమున రాజు లందరును వేంకటాద్రినెక్కిరి. వారి వెంట మాధవుడు కూడ శేషగిరి నెక్కెను. ఆ రాజులతో గూడ నచ్చ టచ్చట విశ్రమించుచు గిరినెక్కెను. వేంకటాద్రిస్పర్శమాత్రమున నతని పాపములు కంపింప నారంభించినవి. ఆ యద్రిమాహాత్మ్యమున నతని యంగమున నగ్ని జన్మించి, పాపములను దహించుచు ప్రజ్వరిల్లెను. దానిని జూడ దేవత లందరును విమానముల మీద వచ్చి, వేంకటాద్రి మాహాత్మ్యమును ప్రశంసించి పుష్పవృష్టి కురిపించిరి. బ్రహ్మదేవుడు విమానమునుండి దిగి బ్రాహ్మణుని సమీపించి, వాని యుత్తమాంగమును స్పృశించుచు నిట్లు పలికెను. "ఓ మాధవుడా ! పాపరహితుడవైతివి. స్వామిపుష్కరిణికేగి యందు స్నానము చేసి వరాహస్వామిని దర్శించి, దేహమును త్యజించెదవు. పాండవుల దౌహిత్రకులమున బుట్టి, రాజై, కీర్తివంతుడవై రాజ్యము నేలుము. సుధర్ముని సుతుడవై బుట్టి, యాకాశ రాజను నామముతో దక్షిణమున తొండమండలమును, నారాయణపురము నుండి పాలించుము. జగన్మాత నీకు బుత్రియగును. జగత్పతి నీ జామాత

యగును. తరువాత నీవు వైకుంఠమున కేగెదవు" అని వరము నిచ్చి, యా పర్వతమునకు వేంకటాద్రియని నామమునుగూడ నిడెను. "వేం" అనగా సర్వ పాపము లనియు, "కట" అనగా దాహమనియు నర్థము. సర్వపాపములను దహించునది వేంకటాద్రి యని యర్థము.

'సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే ।
తస్మాద్వేఙ్కటశైలోఽయం లోకే విఖ్యాతకీర్తిమాన్ ॥'

ప్రభాతకాలమున నెవరు వేంకటాద్రిని స్మరించెదరో వారు వేయి గంగా సేతుయాత్రలు చేసిన ఫలమును బడసెదరు.

భవిష్యోత్తరపురాణము 1-వ అధ్యాయము.

## 6. భగవంతుడు వైకుంఠమును విడిచి వేంకటాద్రి కేగిన విధము.

పూర్వము కశ్యపాది మునులు, జాహ్నవీతీరమున యజ్ఞమును జేయుచుండిరి. అచ్చటికి బ్రహ్మర్షి యగు నారదుండు వేంచేసి, యా ఋషుల నిట్లు ప్రశ్నించెను. "ఓ మునీశ్వరులారా ! మీ రీ క్రతువు నెందుల కాచరించుచున్నారు. ఈ యజ్ఞఫలము నెవరు భుజింతురు ? దేవతలలో ధ్యేయుడైన వా డెవ్వడు ? మీ యజ్ఞఫలము నెవరి కర్పించు చున్నారు." నారదుని వాక్యముల విని, మునులు సంశయాత్మలై విచారించి, తమ సంశయమును దీర్పవలయునని భృగుమహామునిని ప్రార్థించిరి. ప్రత్యక్షముగా జూచి నిర్ణయించుటకు భృగుముని, ప్రథమమున బ్రహ్మలోకమున కేగెను. అచ్చట సరస్వతిచేత సేవింపబడుచున్నట్టియు, వేదఘోషవిరాజితములగు నాలుగు ముఖములు కలిగినట్టియు, దిక్పాలకులతోకూడి నారాయణుని స్తుతించుచున్నట్టి చతురాననుని జూచి సాష్టాంగప్రణామము లాచరించి నిలిచెను. భృగువును జూచి, యజు

డేమియు పలుక కూరకుండెను. అందుచే బ్రహ్మ అజ్ఞానముచే నష్టాజ్యు డని యెంచి, భృగువు బ్రహ్మలోకమును విడచి, కైలాసమున కేగెను. అచ్చట నాసమయమున త్రిలోచనుడు కాముకుడై పార్వతితో గ్రీడించుచు వచ్చిన భృగువు నెరుంగడాయె. పార్వతీదేవి యాతనినిజూచి లజ్జితయై మునిపుంగవుని రాక నెరింగించి, తన్ను వదలమని పతిని గోరెను. దేవి మాటలు విని త్రిలోచనుడు పార్వతిని వదలి క్రోధావిష్టుడై, మునిని జంప బ్రయత్నించెను. కాని భృ గు మ హా ము ని యాయనను నిరాకరించి శపించి, యచటినుండి వెడలిపోయెను. తదుపరి విష్ణువును జూడ గోరి వైకుంఠమున కేగెను. అచ్చట లక్ష్మితో గూడ విష్ణుమూర్తి శేషునిపై శయనించి యుండెను. భృగువునకు గోపమువచ్చి విష్ణుమూర్తిని వక్షః స్థలముపై పాదముతోదన్నెను. విష్ణుమూర్తి దిగ్గునలేచి, సవినయముగా ఋషిపాదములపై బడెను. తరువాత నతనిని ఆలింగనము చేసికొని యిట్లనియె. "ఓ ఋషిశ్రేష్ఠుడా ! అతి కఠోరమైనట్టియు, దేవమానుషుల కభేద్యమైనట్టియు, వజ్రము కంటె నష్టగుణములు కఠిన మైనట్టియు నా శరీరము నెందులకు మీకోమల పాదతలముతో స్పృశించితిరి. మీ మృదు పాదములకు చాల బాధ కలిగియుండవలెను" అని పలికి యుదకముతో ఋ షి పా ద ము ల గడిగి, శుభమైన యా యుదకమును తన శిరముపై జల్లుకొనెను. అది చూచి భృగుమహాముని, విష్ణువే సర్వోత్తముడైన దైవతమని నిశ్చయించుకొని ఋషులకడకేగి, సభయందా విషయమును జాటించెను.

హరిస్సర్వోత్తమః సాక్షాద్రమాదేవీ తదంతరా ।
తదధో విధివాణ్యౌ చ తదధః శర్వపూర్వకాః ॥

అని తరతమభావములను మునులకు బోధించెను. అప్పుడు ఋషులందరు సంతసించి, హరియే స ర్వే శు డ ని నిశ్చయించుకొని, యతనికే తమ యజ్ఞము సమర్పణ చేసిరి.

తదనంతరము యేకాంతమున లక్ష్మి, వల్లభునితో నిట్లనియె. "జగన్నాయుడవగు నీయురమున మునిచే తాడితుడవైతివి. నేను నివసించు స్థలము పాదముచే స్పృశింపబడుటచే, "ఓనాథా! నీ యురమును విడిచి నేను పోవుచున్నాను. నేను పోయి కరవీరపురమున (కొల్హాపురమున) నుండెదను" అని భర్తతో గలహించి, కరవీరక్షేత్రమునకు లక్ష్మి వెడలి పోయెను. కలియుగారంభమున విష్ణుమూర్తి, లక్ష్మినెచ్చట నేవిధంబుగా సాంత్వనముజేయగలనని యాలోచించుచు, వైకుంఠమును వదలి గంగా నదికి దక్షిణమున మూడువందల యోజనముల దూరమున, సువర్ణముఖి కుత్తరమున క్రోశదూరమున నున్నట్టియు, మూడు యోజనములు వెడల్పును, ముప్పదియోజనముల పొడవును కలిగినట్టియు, శిరస్సునందు వేంకటగిరిని, మధ్యను నృసింహాద్రిని, శ్రీశైలమును కలిగినట్టియు వేంకటాద్రిని జేరి, దానియందలి స్వామిపుష్కరిణి, దక్షిణమున నొక తింత్రిణీ వృక్షమూలమున నొక వల్మీకమును గని, నదియే యుచితమైన స్థలమని తలంచి యా వల్మీకమున లీనుడై యుండెను.

భవిష్యోత్తరపురాణము 2-వ అధ్యాయము.

## 7. వల్మీకమున లీనుడైయున్న శ్రీనివాసునికి గోవు క్షీరసేచనము చేయుట

అట్లు వల్మీకమున శ్రీనివాసుడు వత్సరసహస్రము లుండెను. ద్వాపరాంతమున నొక నృపోత్తముడు, చోళరాజ్యము నేలుచుండెను. ధర్మాత్ముడగు నతడు రాజ్యము నేలుచుండగా, పశువులు బహుక్షీరలుగా నుండెను. సకాలమున వర్షములు పడుచుండెను. సస్యములు సమృద్ధిగా బండుచుండెను. జనులందరు నానందతత్పరులై యుండిరి. ఆ కాలమున బ్రహ్మ యొక ధేనురూపమును, రుద్రుడు వత్సరూపమును పొందిరి. లక్ష్మీదేవి గోపాలికరూపమును గ్రహించి, యా గోవత్సలను చోళరాజు



తిరుచానూరు

శ్రీ పద్మావతి అమ్మవారు

నకు విక్రయించి స్వస్థానమునకేగెను. బహుక్షీరప్రదయగు నాగోవును తన పుత్రుని పోషణకొరకు చోళరాజు కొనెను. ఆ రాజు యొక్క గోవులతోజేరి యీ గోవుకూడ గడ్డి మేయుటకు వేంకటాద్రికి దోలబడు చుండెను. కాని యీ గోవు గడ్డి మేయుచు, శ్రీనివాసుని వెదకుచు బోవుచుండెను. కాలక్రమమున స్వామిపుష్కరిణీతీరమున వల్మీకమున, శ్రీనివాసుని గనిపెట్టెను. మిక్కిలి సంతుష్టమానసయై యా వల్మీకము నంతను తన క్షీరధారలచే నింపెను. అప్పటినుండియు ప్రతిదినమును నితర గోవులతోవచ్చి యతిభక్తితో నా వల్మీకమున క్షీరసేచనము చేయు చుండెను. శ్రీనివాసుడు దానిచే ప్రీతుడగుచుండెను. తన కుమారునికి గోవుపొదుగున పాలు లేకపోవుట జూచి, చోళరాజుభార్య పాలెందులకు లేవని గోపాలకుని నడిగెను. "ఓరీ, గోపాలా! పిల్లవానికి పాలు లేకున్నవే, ఎందుచేత? నీవు త్రాగివేయుచున్నావా లేక దూడ త్రాగి వైచుచున్నాదా". తా నెరుగనని వాడు చెప్పగా, రాణి యతనిని శిక్షించెను.

## 8. గోపాలుడు కుఠారముతో శ్రీనివాసుని గొట్టుట

గోపాలుడు మరునాడు క్షీర మేమగుచున్నదో కనిపెట్టుటకు గోవును మేతకు విడిచి, దాని వెంటనే పోయెను. గోవు తా నెప్పటి యట్లు వల్మీకమువద్దకు బోయి తన క్షీరమునంతను దానిలో విడిచెను. గోపాలునకు గోపము వచ్చి తనను దండింపజేసిన గోవును శిక్షించుటకు గుఠారమునెత్తి గోవుశిరముపై వేయబోయెను. అప్పుడు వల్మీకమున నున్న శ్రీనివాసుడు వాత్సల్యమును జూపుచు తనకు నిత్యము క్షీరము నిచ్చుచున్న గోవును రక్షించుటకై మధ్యనిలచి యా కుఠారప్రహారమును తాను గ్రహించెను. కుఠారముతో కొట్టబడిన శ్రీనివాసుని శిరస్సునుండి సప్తతాలప్రమాణమగు రక్తస్ఫూర్తి యుద్భవించెను. ఆ కోలాహల మును జూచి గోపాలుడు మరణించెను. గోపాలుడు మరణించగా

గోవు కొండదిగి రాజమందిరమును బొంది రాజునెదుట దుఃఖముతో బొర్ల నారంభించెను. గోగణమును వదలి యిట్లీగోవు విహ్వాలయగు టకు గారణము కనిపెట్టి యావులమందలో దానిని జేర్చుటకు చారుని దానివెంట పంపెను. ఆ చారుడు దానివెంట వేంకటాద్రికిబోయి వల్మీకమువద్ద బడియున్న గోపాలుని, వల్మీకమునుండి జాఱుచున్న సప్త తాలప్రమాణమగు ఘోరతరమైన రక్తస్రావమును జూచి రాజువద్ద కేగి గోపాలమరణమును, రక్తప్రవాహమును రాజున కెరింగించెను.

## 9. శ్రీనివాసుడు చోళరాజును శపించుట

అది విని యాశ్చర్యపడి రాజు వెంటనే నరయానము నధిష్ఠించి వేంకటాద్రినెక్కి వల్మీకమువద్ద నిలిచి యిట్లు పలికెను. "ఇది యేమి కష్టము. ఏ పాపునిచే గోపాలుడు చంపబడెను. వల్మీకము రక్తపూరితమైయున్నది. గోవు వచ్చి వృత్తాంతము చెప్పుటిది యేమియాశ్చర్యము". రాజుమాటలను విని వల్మీకమునందున్న శ్రీనివాసుడు వల్మీకమును భేదించుకొని పైకివచ్చి శ్రీస్వామిపుష్కరిణీతీరమున శైలేంద్రతలము నధిష్ఠించి యిట్లు పలికెను. "నీవు పాపిష్ఠుడవు. దురాచారుడవు. రాజ్యగర్వపూరితుడవు. అనాథుడైనట్టియు, భక్తిహీనుడైనట్టియు, దరిద్రుడైనట్టియు, వనచారియైనట్టియు, పితృమాతృభార్యా బంధువిహీనుడైనట్టియు నన్ను వాడియగు గుఠారముతో గుటిలుడవై కొట్టితివి. అది నాకు చాలా దుఃఖమును గలిగించినది. ఆ గోపాలుడు నా శిరమును ఛేదించెను. గృహమున యజమానుడు విచారపరుడు కానియెడల స్త్రీపుత్రాదులచే జేయబడిన కర్మలు తన కనిష్టమును గలుగజేయును." అని చెప్పి నాకు దుఃఖమును గలుగజేయుటచే నీవు పిశాచము కమ్మని శపించెను. వెంటనే రాజు పిశాచత్వమును పొందెను.

భవిష్యోత్తరపు. ౮-వ అధ్యా.

## 10. శ్రీనివాసుడు చోళరాజునకు వరమిచ్చుట

పిశాచరూపమును బొందిన రాజు, ఏమియు నెరుంగని తనకిట్టి కష్టము సంభవించినందునకు విచారించి శ్రీనివాసునితో నిట్లు పలికెను. "దేవా! నిరపరాధినగు నన్నెందుకు శపించితివి. విచారించక నీ విట్లుచేయుట న్యాయమేనా! నే నేమియు నెరుంగనే. నాకెందుకింత కష్టమును గల్పించితివి." అనిన శ్రీనివాసుడిట్లుత్తరమిచ్చెను. "భక్తి వాత్సల్యముచే నే నిట్లు చేసితిని. భక్తులకు బాధగలిగినచో నేను సహింపజాలను. నా శాపము వ్యర్థముకానేరదు. కలియుగాంతము వరకు నీ విట్లుండెదవు. ఆపైని నీ వాకాశనృపుడవుగా జన్మించి, నీ పుత్రియగు పద్మావతిని నాకు కన్యాదానము చేసి, కన్యాదానసమయమున వరదక్షిణగా రత్నఖచితమగు సువర్ణకిరీటమును నాకు నిచ్చెదవు. శుక్రవారము సాయంకాలము నేను కిరీటమును ధరించెదను." అని వరమిచ్చి యతనిని బంపెను.

భవిష్యోత్తరపు. 4-వ అధ్యా.

## 11. శ్రీవరాహస్వామి శ్రీనివాసునకు వేంకటాద్రియందు స్థానము నిచ్చుట

ఒకదినమున శ్రీవరాహస్వామి వృషభాసురుని జంపి తిరిగి వచ్చుచుండగా నరుణోదయసమయమున వేంకటాచలపర్యటన మొనర్చుచున్న శ్రీనివాసుని గనెను. అతనిని జూచి వరాహస్వామి నీ వెవ్వరని గర్జించుచు నతనిపైపున కరిగెను. శ్రీనివాసుడు వెంటనే వల్మీకమున లీనుడయ్యెను. వరాహస్వామి శ్రీనివాసుని వైకుంఠమునుండి విజయం చేసిన శ్రియఃపతిగా నెరింగి పలుకరించెను. వల్మీకమున నున్న శ్రీనివాసుడు గూడ వరాహరూపమున నున్న శ్రీమహావిష్ణువు నెరింగి పైకి వచ్చి యతనితో ముచ్చటలాడెను. భిన్నరూపములనున్న యా యిరువుర సల్లాపమును విని దేవతలందరును సంతసించి పుష్పవృష్టిని కురిపించిరి.

దేవతలు దివమున కేగిన పిదప వరాహస్వామి శ్రీనివాసుని వైకుంఠమును వదలి యచ్చటికి వచ్చుటకు కారణమేమని ప్రశ్నించెను. శ్రీనివాసు డిట్లనియె. "భృగుమునిపాదప్రహారముచే దూషితమగు నా వక్షఃస్థలంబును వదలి రమ కొల్హాపురమున కేగినది. ఆ విచారముచే నేను వైకుంఠమును వదలి యీ గిరిని చేరి నీకు దక్షిణభాగమున నొక వల్మీకమున లీనమైయుంటిని. అట్లున్న నన్ను గోపాలు డొకడు కుఠారముతో శిరమున గొట్టెను. ఆ బాధ నివారకమగు నౌషధాన్వేషణార్థము సంచరించుచు నిన్ను గంటిని. నా కిచ్చటనే కలియుగాంతము వరకు నివసించవలయునని సంకల్పము కలిగినది. కాన నాకు స్థలమునీయుము" అది విని వరాహస్వామి మూల్యమిచ్చి స్థలమును గొనుమని చెప్పెను. అప్పుడు శ్రీనివాసుడు తిరిగియు నిట్లు పలికెను. "నావద్ద ధనము లేదు. కాని నాకు స్థలమిచ్చినచో ధనమునకు బదులుగా నీకు ప్రథమ దర్శనమును, ప్రథమ నైవేద్యమును నీకు జరుగునట్లు చేయుదును. దీనిని క్రమముగా నంగీకరించి నాకు స్థలము నీయుము". దీని కంగీకరించి వరాహస్వామి శ్రీనివాసునకు పాదశత పరిమితమగు స్థలము నిచ్చెను. ఈవిధముగా నేకరూపులగు వారిద్దరును భక్తుల భక్తిసిద్ధికొరకు నభక్తుల మోహము కొరకును బరస్పరము వినోదమును సల్పిరి. అప్పటినుండి వరాహస్వామి తన పాచకియగు వకుళమాలికను శ్రీనివాసునికి సేవ చేయుట కర్పించెను. ఆమెచే ప్రతి దినమును శ్రీనివాసునికి భోజనము కొరకు శ్యామాకాన్నమును, మధువును పంపుచుండెను. ఆమె ప్రతి దినమును శ్రీనివాసునికి అన్నపానౌషధముల సమర్పించుచు పాదసంవాహనాదులతో సేవించుచుండెను.

పూర్వము యశోదాదేవి కృష్ణరూపముననున్న వాసుదేవుని పెంచి యతని దర్శనమున తనివి తీరక యతని యనంతకల్యాణగుణయుక్తమగు రూపము నింక గొంతకాలము చూడ గోరెను. నీ మనోరథమును

జన్మాంతరమున నెరవేర్చెదనని వరమిచ్చెను. ఆ వరము ననుసరించి వాసుదేవుడు శ్రీనివాసరూపమున నుదయించి క్రీడించుచున్నాడు. యశోద వకుళాదేవిగా నుద్భవించి యతనిని సేవించుచు తద్దర్శనానందము ననుభవించుచున్నది.

కలౌ కలుషచిత్తానాం పాపాచారరతాత్మనామ్ ।
రక్షణార్థం రమాకాన్తో రమతే ప్రాకృతో యథా ॥
బహుజన్మార్జితైః పుణ్యైర్లభ్యతే క్షేత్రదర్శనమ్ ।
తత్రాపి వేఙ్కటగిరేర్దర్శనం ముక్తిదం పరమ్ ॥

భవిష్యోత్తరపు. 5-వ అధ్యా.

## 12. ఆకాశరాజునకు సంతానప్రాప్తి కలిగిన విధము

ద్వాపరాంతమున భారతయుద్ధము జరిగిన పిదప విక్రమార్కాది నృపపుంగవులు స్వర్గస్థులైనపిదప కలియుగమున సువీరుడను చంద్ర వంశపురాజు జన్మించెను. అతని పుత్రుడగు సుధర్మునకు ఆకాశుడు, తొండమానుడు అను నిద్దరు సుతులు జన్మించిరి. వారిద్దరును ధర్మిష్ఠులును, దృఢభక్తులును, నారాయణపరాయణులునై యుండిరి. జ్యేష్ఠుడగు నాకాశరాజు పాలించుచుండగా తొండదేశము స్వర్గతుల్యముగానుండెను. కాని యతనికి చాలకాలము వరకు సంతానము కలుగలేదు. అందుల కతను విచారించుచు తన గురువును పుత్రప్రాప్తికలుగుట కుపాయమును చెప్పుమని వేడెను. అతను యజ్ఞము చేసినచో తప్పక పుత్రుడు కలుగు నని చెప్పెను. గురువాక్యానుసారముగ యజ్ఞార్థము భూమిని శుభ్రము చేసి కర్షణము చేయుచుండగా సహస్రపత్రకమల మొకటి కనబడెను. ఇది యేమని యాశ్చర్యముతో జూచుచుండగా, నందు సర్వాంగసుందరి యగు స్త్రీశిశువు కనబడెను. దైవము తన కీ కుమార్తెనిచ్చెనని యా రాజు సంతసించుచు శిశువు నెత్తికొనగా నాకాశవాణి యిట్లు పలికెను.

“ ఓరాజా ! యీమె నీకు పుత్రికయగుచున్నది. ఈమెను సంరక్షింపుము. ఈమె నీకు విశేషమైన కీర్తిని జేకూర్చగలదు.” అది విని రాజు మిక్కిలి సంతసించి యాకన్యను తన భార్యకొసంగి దైవదత్తయగు నామెను గర్భజాతయగు పుత్రికవలె బెంచమని యాజ్ఞాపించెను. పద్మమునందు జన్మించినదగుటచే నామెకు పద్మావతియని నామకరణము చేసెను.

కన్య గృహమునకు వచ్చిన ముహూర్తమున రాజుభార్య గర్భవతి యయ్యెను. రాజు పుంసవనసీమంతాదిక్రియల యథావిధిగా జరిగించెను. నవమాసములు నిండిన పదియవమాసమున రాణి యుత్తమపుత్రుని గనెను. పుత్రజన్మసంతోషమున రాజు తన ఛత్రచామరములు తప్ప తక్కిన ధనమునంతయును దానముచేసెను. పండ్రెండవదినమున నతనికి వసుదాత యని నామకరణముచేసెను. దినదినప్రవర్ధమానులగు పుత్రికా పుత్రులను జూచి రాజు సంపూర్ణానందమును బొందుచుండెను. ఇట్లు కొంతకాలము గతించగా, పద్మావతి బాల్యమును వదలి యౌవనవతి యయ్యెను. ఆమెకు తగిన వరుని సంపాదించ వలయునను చింతలో రాజు మునిగిపోయెను.

## 13. నారదముని పద్మావతికి భావిశుభమును జెప్పుట

ఇట్లుండగా వసంతకాలమున నొక దినమున పద్మావతి పుష్పములను గోయుటకు సఖులతోగూడ నుద్యానవనమున కేగెను. పుష్పములను గోసి పద్మావతి యొక తరుమూలమున నాసీనురాలయ్యెను. వృద్ధతాపసవేషమును ధరించి నారదముని యచ్చటికేగెను. పద్మావతి యతనిని జూచి కాతరరక్తకాగా నారదు డామె నిట్లోదార్చెను. “ నేను మీకు కులగురువును. నన్ను పితృతుల్యునిగా దలంచుము. నీ హస్తమును జూపుము. నీకు భావిసుఖమును జెప్పెదను.” అది విని పద్మావతి

ధైర్యమవలంబించి యతనికి హస్తమును జూపెను. నారదుడు హస్తమును పరిశీలించి నీకు లోకేశ్వరుడగు రమాపతి భర్తకాగలడని చెప్పి యంతర్ధానమును పొందెను.

భవిష్యోత్తరపురాణము 6-వ అధ్యాయము.

## 14. పద్మావతికి శ్రీనివాసుడు దర్శనమిచ్చి యామెతో సంభాషించుట

ఆ దినమున శ్రీనివాసుడు మృగయావినోదార్థము హయమునెక్కి వేంకటాద్రిని దిగి పరిసరారణ్యమున ననేక వ్యాఘ్రాది ఘాతుకమృగములను వేటాడెను. తరువాత నొక మదపుటేనుగును గని దానిని వేటాడుటకు వెంబడించెను. అది యతనిని సార్ధయోజనదూరము తీసికొనిపోయి పద్మావత్యుపవనమున వెనుకకు తిరిగి తొండమునెత్తి గర్జించి హరికి దండవత్ప్రణామము సలిపి వనములోనికి పోయెను. గజము నిష్క్రమించగా పద్మావతి శ్రీనివాసుని కంటబడెను. గర్జించుచున్న గజమును జూచి పద్మావతియు నామె సఖులును వెరచి యొక వృక్షము చాటున దాగి చూచుచుండిరి. వారినిజూచి శ్రీనివాసుడు వారి దిక్కునకు బోయెను. శ్రీనివాసుడు వచ్చుటను జూచి పద్మావతి తన సఖుల నతని వృత్తాంతము గనుగొనుడని కోరెను. అతను వారిని సమీపింపగా సఖులిట్లడిగిరి. అయ్యా, నీ వెవ్వడవు ? ఎందు కిచ్చటకు వచ్చుచున్నావు ? ఏమి పనియున్నది ? ఇది పురుషులు రాకూడని ప్రదేశము. నీవు శీఘ్రముగా మరలుము." రాజపుత్రితో నాకు కార్యముకలదని శ్రీనివాసుడు ప్రత్యుత్తరమిచ్చెను. నీకార్యమేదో శీఘ్రముగా జెప్పుమనియు, నీనివాసమెక్కడ యనియు, నీపేరేమనియు, నీ తల్లిదండ్రు లెవరనియు, నీ యన్నతమ్ము లెవ్వరనియు, నీ కులగోత్రములేవనియు పద్మావతిచెలియ లడిగిరి. వారికి శ్రీనివాసు డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "నేను కన్య

నపేక్షించి ముఖ్యముగా వచ్చియున్నాను. అందుచే నామెతో నాకార్యము చెప్పెదను." అని వారికి సమాధానమిచ్చి, పద్మావతితో శ్రీనివాసుడిట్లు పలికెను. "పెద్దలు మాది సింధుపుత్రకులమని చెప్పెదరు. మా తండ్రి వసుదేవుడు. తల్లి దేవకి. బలరాముడు మా యన్న, సుభద్ర మాచెల్లెలు. పార్థుడు మా స్నేహితుడు. పాండవులు మా బంధువులు. నేను కృష్ణ పక్షమున (యష్టమినాడు) జన్మించుటచేతను, కృష్ణవర్ణముగా నుండుట చేతను నన్నందరును కృష్ణుడని పిలిచెదరు. ఇది నా వృత్తాంతము. ఇక నీగోత్రనామ కులాదికముల వినగోరుచున్నాను." పద్మావతి తన వృత్తాంతము నిట్లు వర్ణించెను. "నేనాకాశరాజు తనయను. నా పేరు పద్మావతి యందురు. మాదిచంద్రవంశము. మాది అత్రిగోత్రము. నీవిక శీఘ్రముగా పొమ్ము". అని నిష్ఠురముగా పద్మావతి పలుకగా శ్రీనివాసు డిట్లనియె. ఏమి నిష్ఠురముగా నట్లు పలికెదవు. మెల్లగా వచింపరాదా ? నేను నీయందభిలాష కలవాడనై వచ్చియున్నాను. నేను నీకు పాత్ర భూతుడను. కాబట్టి నిన్ను నా కర్పించి నీవు స్వర్గమును పొందుము. వృథాగా నిష్ఠురము లాడకుము". అది విని పద్మావతి కోపముతో నెఱ్ఱ బడిన నేత్రములు కలదై యిట్లుపలికెను. నీవు పలుకగూడని మాటలు పలుకుచున్నావు. నీకు జీవనేచ్ఛ లేనట్లున్నది. ఆకాశరాజు నిన్ను చూచి నచో సంహరించును. అతని కంటబడక పూర్వ మింటికేగుము." వెండియు శ్రీనివాసు డిట్లు పలికెను. పుట్టినవానికి వాని పూర్వకర్మ ననుసరించి మరణము నిశ్చయము. మరణము నిశ్చయించియే నీతో రమించుటకు గోరుచున్నాను. ఆకాశరాజు ధర్మాత్ముడని వినికి. పాపము నాచరించనపుడు నన్నెట్లు చంపును. నీవు కన్యవు కదా. నిన్ను నేను వరించుచున్నాను. ఇచ్చట నన్యాయమేమున్నది." అని పలుకుచు శ్రీనివాసుడు పద్మావతిని సమీపించబోగా నామె యిట్లు పలికెను. "నీతల్లి దండ్రులను, సోదరులను, బంధువులను వదలి నీ వెందులకు వ్యర్థముగా

మరణించెదవు.'' ఆ మాటలను లక్ష్యము చేయక, ''విధి లిఖించినదాని నతిక్రమించుట కెవరికిని నసాధ్యము. నాకు జయమైననుసరే, అపజయమైనను సరే, నీతో రమింపక తప్పదు'' అని పలుకుచు, పద్మావతిని సమీపింప యత్నింపగా, పద్మావతి తన సఖులతో గూడ నతనిని రాళ్ళు రువ్వి నివర్తింపజేసెను. శ్రీనివాసుడు వల్మీకమున ప్రవేశించి, వ్యాధి పీడితుడై శయ్యనధిష్ఠించెను.

భవిష్యోత్తరపురాణము 7-వ అధ్యాయము.

## 15. శ్రీనివాసుడు వకుళాదేవికి తన యభిలాషను దెలుపుట

వకుళావళి బహుభక్తియుతయై సూపాపూపర ససమన్విత మగు షడ్విధాన్నమును గైకొని శ్రీనివాసుని సేవించుటకు వచ్చెను. దీర్ఘనిశ్వాసమును విడచుచు, కన్నీళ్ళు కార్చుచు, మాటలాడక పండుకొనియున్న శ్రీనివాసుని జూచి వకుళావళి యిట్లు పలికెను. ''ఓ గోవిందుడా! మేలుకొనుము. పగలు నిద్రించు నలవాటు నీకు లేదుగదా, నీవెప్పుడును దుఃఖించుట నేను చూడలేదే. ఇప్పు డేల విచారించుచున్నావు. నీ మనస్సును నా కెరింగింపుము. పరమాన్నాదికము గొనివచ్చియున్నాను. వానిని భుజింపుము.'' శ్రీనివాసు డేమియును పలుకకుండుట జూచి, వకుళాదేవి తిరిగి యిట్లు పలికెను. ''అరణ్యమున నీ వేమైనను చూచి యున్నావా? ఎల్లప్పుడును నిర్విచారుడవగు నీ విప్పుడు విచారించుటకు కారణమేమి? నీ కేమి కావలయునో నాతో జెప్పుము. నిన్ను జూచిన నాకు చాల కష్టముగా నున్నది. అరణ్యమున నీ కెవ్వరైనను కన్యక కంటబడినదా? నిన్ను మోహింపజేసిన యా పుణ్యవతి యెవరు? నాతో జెప్పుము. క్షణమాత్రములో నీ మనోభీష్టము నెరవేర్చెదను.'' ఇట్లు ప్రార్థింపబడిన శ్రీనివాసుడు చివరకు దుఃఖముతో మందమందముగా నిట్లు పలికెను. ''ఈదినమున నే నరణ్యములో పద్మావతియను నుత్కృష్ట కన్యకను జూచితిని. ఆమెను జూచి నా మనస్సు కామపరవశమయ్యెను.

అట్టి కన్యక బహుజన్మార్జితపుణ్యముచేగాని లభింపదు. సర్వాంగసుందరి యైన యా కన్య యాకాశరాజుతనయ. ఆమెతో నాకు సంగము కలుగునట్లు చేయుము. లేనిచో నేను జీవింపజాలను. ఆమెను సమీపింపగా, నన్ను రాళ్లతో నామె తరిమివై చినది. ఆమెను నాకు సంపాదించిపెట్టుము. ఆమెను జూచినచో నీవును నాకోరిక సరియైనదని సంతోషించెదవు."

## 16. పద్మావతియొక్క పూర్వజన్మవృత్తాంతము

శ్రీనివాసుని కోరికను విని, వకుళావళి యిట్లు ప్రశ్నించెను. "నీవు చూచిన కన్యక యెచ్చట నున్నది. ఆమెను జేరుటకు మార్గమును నాకు దెలుపుము. నేను వెంటనే పోయెదను. ఆమె పూర్వ మెవ్వతెగా నుండెను. ఆమె యెందుకీ లోకమున జన్మించినది. ఆమెవృత్తాంతము నంతను నాకు జెప్పుము" అని వకుళాదేవి యడుగగా, శ్రీనివాసుడిట్లు మందముగా బలికెను. "ఆమె పూర్వజన్మ వృత్తాంతమును జెప్పెదను వినుము. పూర్వము త్రేతాయుగమున నేను రామావతారము నెత్తి, పిత్రాజ్ఞానుసారము సీతాలక్ష్మణులతో గూడ దండకారణ్యమునకు బోయి యుంటిని. అప్పుడు రావణుడను రాక్షసుడు వచ్చి నేనును లక్ష్మణుడును దూరమున కేగియుండగా, సీతనుతీసికొని లంకకేగుటకు ప్రయత్నించెను. ఆ సమయమున సీతయొక్క యార్తనాదములను విని, యగ్నిదేవుడు ప్రత్యక్షమై, సీతనురక్షించుటకు రావణునితో నిట్లనియెను. "ఓరావణుడా, మోసపోకుము. ఈమె జనకనందిని కాదు. నీకు వెరచి రామునిచే జనకనందిని నా దగ్గర దాచబడినది. నీవు నాకు ప్రియుడవు కాబట్టి నీకు నేను సహాయము చేసెదను. నేను నీకు నిజమైన సీతనిచ్చెద నుండుము' అని పలికి, సీతను తీసికొనిపోయి స్వాహాదేవి కొప్పగించి, పూర్వము రావణాపచారముచే నతని వధను ప్రతిజ్ఞచేసి, యగ్నిప్రవేశ మాచరించి, సమయమును నిరీక్షించుచున్న వేదవతిని సీతరూపమును ధరింపజేసి;

రావణుని యొద్దకు తీసికొనివచ్చి, "ఈమె నిజమైన సీత. ఈమెను తీసికొని వెళ్ళుము" అని చెప్పి యామెనిచ్చి పంపెను. రావణుడామెను తీసికొని పోయి అశోకవనమున నుంచెను. తరువాత రాముడు లంకకు పోయి రావణాసురుని సంహరించి, సీతను రప్పించి, శోధనకొరకగ్ని ప్రవేశము చేయించెను. అప్పుడగ్ని నిజమైనసీతను తీసికొనిరాగా, సీతాద్వంద్వమచ్చట నావిర్భవించెను. రాముడు సత్యమైనసీతను, రెండవది యెవరని ప్రశ్నించెను. సీత యిట్లనియెను. "ఈమె వేదవతి. నిర్నిమిత్తముగా నా దుఃఖమునంతను భరించినది. ఈమె ననుగ్రహింపుము. వివాహవిధిపూర్వకముగా నీమెనంగీకరింపుము" అనిన, రాముడిట్లనెను. "ఇప్పుడు నే నేకపత్నీవ్రతము బూనియున్నాననుసంగతి నీకు తెలియును. నే నిప్పు డీమె నంగీకరింపజాలను. ద్వాపరయుగమున నీ కోరికప్రకార మీమెను పరిణయమాడెదను. అంతవర కీమె బ్రహ్మలోకమున నుండుగాక." ఆమె పద్మావతిగా బుట్టినది. నా వాక్య మసత్యము కాజాలదు. ఈమెను నేను పరిణయమాడితీరవలెను." ఇట్లు పద్మావతీపూర్వజన్మ వృత్తాంతమును విని వకుళావళి సంతసించి, యాకాశరాజుమందిరమున పద్మావతిని జూచుటకు పోయెదనని చెప్పెను. శ్రీనివాసుడు సంతసించి లేచి, వకుళావళి తెచ్చిన పరమాన్నాదికమును భుజించి యలంకరించుకొని స్తిమితచిత్తుడై యుండెను.

## 17. వకుళావళి పద్మావతీసఖులను కలసికొనుట

వకుళావళి హయము నెక్కి పయనమై, సువర్ణముఖిని దాటి, యగస్త్యాశ్రమమును చేరెను. అచ్చట శివాలయమున పద్మావతీసఖులను గనెను. మీ రెవ్వరని యడుగగా, వారిట్లు ప్రత్యుత్తరము పలికిరి. "మే మాకాశరాజు సన్నిధానమున నుండు కన్యలము" అనిన విని, వకుళావళి పద్మావతీవృత్తాంతము నెరుంగగోరి వారిని, "మీ వృత్తాంతమునంతను

పూర్తిగా వినగోరుచున్నాను చెప్పు" దని యడుగగా, వా రిట్లు చెప్పిరి. "నిన్న పద్మావతితోగూడ మేము పుష్పములగోయుట కుద్యానవనమున కేగితిమి. మేము పువ్వులను గోయుచుండగా నచ్చటికి విచిత్ర తురగాధిరూఢుడగు, మన్మథాకృతియగు పురుషుడొక డేతెంచెను. అతడు కిరాత వేషమును ధరించియుండెను. పద్మావతినిజూచి యత డవాచ్యవచనములను బలుక నారంభించెను. పద్మావతి కుపితయై యతనితో గలహించెను. రాళ్ళతో గొట్టించెను. అతను గుఱ్ఱమును వదలి యుత్తరదిక్కుగా వెడలిపోయెను. పద్మావతి యతను నిర్గమించగా మూర్ఛిల్లెను. ఆమెను రథమెక్కించి మేము రాజపురమునకు తీసికొనిపోతిమి. రాజు విచారించి, యామెవిచారకారణమును దెలిసికొనగోరి, బృహస్పతిని బిలిపించెను. గురు వామె స్థితిని జూచి, యిట్లు పలికెను. "ఓ రాజా! వినుము. పుష్పార్థము వనమున కేగిన యీ కన్య, పురుషుని జూచి భయపడినది. దానికి శాంతిని జెప్పెదను వినుము. అగస్త్యాశ్రమమున శివునకు పదునొకండుగురు బ్రాహ్మణులచే నభిషేకము చేయించుము. ఆమెకు సుఖము కలుగును." ఆ మాటలు విని బ్రాహ్మణులను పిలిపించి యభిషేకము నాజ్ఞాపించెను. వారితోగూడ సంభారములనుగొని మేము వచ్చియున్నాము. ఇది మా వృత్తాంతము. ఇక నీ వృత్తాంతమును జెప్పుము" అని పద్మావతీసఖులు పలుకగా, వకుళావళి యిట్లనియె. "నేను హరి సేవకురాలను. నా పేరు వకుళయందురు. నే నిప్పుడు వేంకటేశుని యానతి నిచ్చటికి వచ్చితిని. ధరణీదేవితో నాకు కార్యము కలదు. నాకు ధరణీదేవి దర్శనము లభించునట్లు మీరు చేయవలెను." "అభిషేకము పూర్తియైన పిదప మేము ధరణీదేవి యొద్ద కేగెదము. నీ వంతవరకు నిచ్చట నిరీక్షించినచో నిన్ను మాతో తీసికొనిపోయి ధరణీదేవిదర్శనము చేయించెదము" అని సఖులు పలుకగా, వకుళావళి యట్లేయని యచ్చట నిరీక్షించుచుండెను.

## 18. శ్రీనివాసుడు ఎరుకలసాని రూపమును ధరించి నారాయణపురమున కేగుట

వకుళావళి వెళ్ళియున్నప్పటికి, నామె కార్యమును సాధించగల్గినో లేదో యని, శ్రీనివాసుడు స్వయముగా వెళ్లనుద్దేశ్యముతో నొక యెరుకలసానివేషమును ధరించెను. ఆమె లంబోదరమును, లంబకర్ణములను ధరించి గుంజామణులచేతను శంఖహారములచేతను నలంకరించుకొనెను, సప్తమాస వయస్కుడైన శిశువును వీపున కట్టుకొని, శిరమున ధాన్య పూరితమగు వెదురుబుట్టను ధరించెను. చేతిలో నొక కఱ్ఱను పట్టుకొని నడచుచు, నారాయణపురమున కేతెంచెను. సోదె చెప్పుదునని కేక వేయుచు వీథులలో దిరుగ నారంభించెను. దాని కేకలను విని, పుర స్త్రీలందరును ధరణీదేవియొద్దకు పోయి యామెవిషయము నెరింగించిరి. ఆమె యనుమతిపై యా యెరుకలసానిని రాజమందిరమునకు రమ్మని పిలిచిరి. తన్ను హాస్యమాడుటకు పిలుచుచున్నారని యామె వచ్చుటకు నిరాకరించగా, ధరణీదేవి స్వయముగా వచ్చి యామెను పిలచెను. ఆ యెరుకలసాని లోనికివచ్చి యిట్లు పలికెను. " దేవీ ! వరనారాయణ స్వామి నా భర్త. ఈ కుమారు డతనికే కలిగినాడు. అతనాజ్ఞాపించగా నీ మందిరమునకు వచ్చితిని. నేను భూతభవిష్యద్వర్తమానముల నెరింగి చెప్పగలను. నా వాక్యము లసత్యములు కానేరవు. అట్లయ్యేనేని నా జిహ్వను కోయించి, నన్ను నగరమునుండి వెడలగొట్టింపుము. " ఆ మాటలువిని ధరణీదేవి, యామెను లోనికి తీసికొనిపోయి యాసనమున గూర్చుండబెట్టెను. అప్పుడు యెరుకలసాని ధరణీదేవిని స్నాన మాచరించి రమ్మని కోరెను. రాణి యట్లుచేసి రాగా, దేవతలకు ప్రీతి గలుగుటకు వాయనము నిమ్మని కోరెను. ఆమెమాటల ప్రకారము ధరణీదేవి, స్వర్ణశూర్పమున వాయనము నిచ్చెను. వాయనము నామెముందరనుంచి ధరణీదేవి, తన దుఃఖ మెప్పు డంతము నొందునో సత్యముగా చెప్పుమని

కోరెను. నేను చెప్పెదను కాని నా కుమారుని కన్నము పెట్టుమని యా యెరుకలసాని కోరెను. ధరణీదేవి పెట్టించిన మృష్టాన్నమును శిశువు తినకపోగా, తల్లియే భుజించి, తాంబూల మిమ్మని యడిగెను. అప్పుడు ధరణీదేవి, యేలా లవంగ కర్పూర పూగఫలములతోగూడిన తాంబూలము నిప్పించెను. దానిని గైకొని, శిశువు నోడిలో నుంచుకొని యెరుకలసాని సోదె చెప్పనారంభించెను.

భవిష్యోత్తరపురాణము 8-వ అధ్యాయము.

## 19. ఎరుకలది పద్మావతీ యస్వాస్థ్యమునకు గారణము నెరింగించుట

నిన్నటిదినము పద్మావతి గుఱ్ఱమునెక్కి వచ్చిన యొక సుందర పురుషుని చూచి మోహవశయై, కామజ్వరముచే పీడింపబడుచున్నది. పద్మావతి శ్రీవేంకటాధీశుడగు శ్రీనివాసుని, పతిగా జేసికొనుటకు గోరుచున్నది. నిన్న కిరాతవేషమును ధరించి తురగాధిరూఢుడై వచ్చినవాడు శ్రీనివాసుడే. అతనికి నీమెనిచ్చి వివాహము చేసినచో నీమెపీడ నివృత్తి యగును. వైకుంఠవాసుడగు హరి శ్రీనివాసరూపముతో వేంకటాద్రిపై నున్నాడు. అతనియశ్వమునే నీ కుమార్తె రాళ్ళతో కొట్టించినది. రాజపుత్రియందుండు గౌరవముచే నతను క్షమించి నివృత్తుడయ్యెను. అతనికి పద్మావతిని యిచ్చి వివాహము చేసినచో నామె సుఖమును బొందును. లేనిచో దుఃఖమును బొందును. అతని కియ్యనిచో మూడు దినములలో నామె మరణింపవచ్చును. కోరకుండ నెట్లిచ్చెదనని సందేహపడకుము. ఇంకొక్క ఘడియ కాలమున పద్మావతిని యాచించుటకు, వృద్ధురాలగు నబల యొకతె రాగలదు. నా మాటలను విశ్వసించి, నీ భర్తను నతని సోదరుడగు తొండమానుని ప్రేరేపించి, పద్మావతిని శ్రీనివాసునకు వివాహముచేయించుము. అట్లైనచో పద్మావతి జీవించగలదు" అని చెప్పి పులిందస్త్రీ స్వగృహమున కేగెను,

## 20. పద్మావతి శ్రీనివాసుని వరించినట్లు ధరణీదేవితో జెప్పుట

పులిందస్త్రీ నిర్గమించగా, ధరణీదేవి లోనికి వెళ్ళి పద్మావతిని సమీపించి, "నీకేమి కావలయును. నీ మనస్సులో నున్న కోరికను నాతో జెప్పుము. నీ కోరికను నేను నెరవేర్చెదను. తల్లి యగు నాతో చెప్పనియెడల నేను విషపానము చేసి ప్రాణములను విడచెదను" అని నిర్బంధించి యడిగెను. పద్మావతి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "నాకు చెప్పుటకు సంకోచముగా నున్నది. అయినను నీవు నిర్బంధించుచున్నావు కనుక చెప్పెదను వినుము. నీ సెలవు గైకొని నిన్న నేను పుష్పములు కోయుటకు సఖులతో గూడ నుద్యానవనమున కేగితిని కదా. అచ్చట పురుషోత్తముని గంటిని. ఆ పుండరీకాక్షునిమీదికి నా మనస్సు పోయినది. అతని సాంగత్యము లభింపనిచో నేను జీవింపజాలను. ఇది నిజమని నమ్ముము. అతను సర్వోత్తముడగు పురుషోత్తముడు. శంఖచక్ర గదా ధరుడు. అతని కంఠమున గౌస్తుభము ప్రకాశించుచున్నది. అతని మూలముననే నాకీబాధ కలుగుచున్నది" అని పలికిన, ధరణీదేవి విని పద్మావతిని నోదార్చి, యాకాశరాజునకు పులిందస్త్రీ తెలిపిన విషయమును పద్మావతివృత్తాంతమును నెరింగించెను.

## 21. పద్మావతిసఖులతోగూడ వకుళావళి ధరణీదేవిచెంతకు వచ్చుట

అగస్త్యాశ్రమమున శంకరునియభిషేకము పూర్తికాగా పద్మావతీ సఖులు సంభారములను శిరస్సులం దుంచుకొని, బ్రాహ్మణులతో గూడ నారాయణపురమునకు తిరిగివచ్చిరి. వారితోగూడ వకుళావళి ధరణీదేవి దర్శనార్థము వచ్చెను. బ్రాహ్మణులను బూజించి, వారి యాశీర్వాదములను పద్మావతికి నిప్పించి, తరువాత తాను భుజించి, పద్మావతీ సఖులను, వారితో వచ్చిన స్త్రీ యెవరని ధరణీదేవి యడిగెను. వా రిట్లు విన్నవించిరి. "ఈమె వాసము వేంకటాచలము. ఈమె శ్రీనివాసుని

సేవకురాలు. ఈమె పేరు వకుళమాలిక. దేవితో నేదో మాటలాడవలసి యున్నదని చెప్పి, మాతో వచ్చినది. ఆమె వచ్చినపని యడిగినచో, నామెయే చెప్పగలదు '' అనిన, ధరణీదేవి యామెను కూర్చుండుమని యాజ్ఞాపించి, "నీవు వచ్చిన కార్యమేమో చెప్పుము. నేను దానిని నెర వేర్చెదను '' అని యడిగెను. నేను ' కన్యక నపేక్షించి వచ్చితి ' నని వకుళావళి చెప్పగా, ధరణీదేవి, "మాకు వరాపేక్ష కలదు, కాబట్టి వరు డెవ్వడో, యతని నివాసమేదియో, గోత్రనామము లెట్టివో, కులమేదో తెలియజెప్పు " మనిన, వకుళావళి యిట్లు పలికెను. అతని తల్లి దేవకి, తండ్రి వసుదేవుడు. కులము చంద్రవంశము. అతని పేరు కృష్ణుడు. గోత్రము వసిష్ఠగోత్రము. నక్షత్రము శ్రవణము. అతని నివాసము వేంకటాద్రి. అతను విద్యావంతుడు, ధనవంతుడు, బలవంతుడు; మంచి యాచారశీలుడు. ఇరువదియైదు సంవత్సరములు వయస్సు కలవాడు " అనిన విని, ధరణీదేవి సంతసించి యిట్లు పలికెను. " నీ మాటల వలన నాకొక్క శంక కలుగుచున్నది. అది యెట్టిదనిన, ఆతను నీ వనినట్లు కులీనుడును, భాగ్యవంతుడును, బుద్ధిమంతుడును, బలవంతుడును, యౌవనవంతుడును నైనచో, నిన్నిదినములవరకు వివాహము కాకుండు టకు కారణమేమి ? " అనిన, వకుళావళి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. " బాల్యమందే యితనికి వివాహము జరిగినది. కాని సంతానము లేక పోవుటచే ద్వితీయము చేసికొనుటకు గోరుచున్నాడు. అంతియె కాని, మరి యితరదోష మేమియును లేదు. " అనిన విని తృప్తిజెంది, ధరణీ దేవి యాకాశరాజునుజేరి యతనితో నిట్లనియె. "కన్యార్థము వేంకటాద్రి నుండి వకుళావళి వచ్చియున్నది. పురోహితులను బిలిపించి, వధూ వరులకు నక్షత్రాద్యానుకూల్యమును విచారించి, ముహూర్తమును నిర్ణ యించుము. పద్మావతిగూడ నతనినే వివాహమాడవలెనని సంకల్పించు కొని యున్నది. '' భార్యమాటలను విని యాకాశరాజిట్లు పలికెను.

"ఓహో! నా పూర్వపుణ్యము వలన నిట్టి మంగళము నాకు సంప్రాప్త మైనది. నా పితరులందరు నేటికి ముక్తులైరి. నా కత్యంతానందముగా నున్నది".

## 22. ఆకాశరాజు బృహస్పతిని శుకమునిని రప్పించి వారితో నాలోచించుట

అని పలికి "పుత్రికను శ్రీనివాసునకిచ్చి వివాహము చేసెదను. విచారింపకు" మని యోదార్చి బృహస్పతిని బిలిచితెచ్చుటకు తన కుమారుని స్వర్గమునకు బంపెను. బృహస్పతి రాగా రాజాతనితో నిట్లు పలికెను. "నీయాజ్ఞయైనచో నాపుత్రికను శ్రీనివాసునకిచ్చి వివాహము చేసెదను. కన్యను వరించుటకు సాధ్వి వచ్చియున్నది. గోత్రనామాదికములు తెలుపబడినవి. అయినప్పటికి మీయాజ్ఞకై నిరీక్షించుచున్నాడను" అని యడుగగా బృహస్పతి యిట్లుపలికెను. "ఓరాజా! నే నప్పుడప్పుడు భూలోకమునకు వచ్చుచుందునే కాని సదా యిచ్చట నుండువాడను కాను. అందుచే నాకు శ్రీనివాసునిచరిత్రము సమగ్రముగా దెలియదు. శుకముని యెల్లప్పుడును భూలోకమున నుండువాడు. అతనికి శ్రీనివాసుని వృత్తాంత మంతయు దెలిసియుండును. అతను చెప్పగలడు. కనుక వెంటనే యతనిని రప్పింపుము" అనిన రాజు వెంటనే శుక యోగీంద్రుని గొనితెచ్చుటకు తనతమ్ముడగు తొండమానునిబంపెను. అతను శీఘ్రముగా పోయి శుకునితో నిట్లుపలికెను. "శుకయోగీంద్రా! మా యన్న నీతో నిట్లు వచింపుమని నన్ను పంపియున్నాడు. పద్మావతి వివాహయోగ్యవయస్కయైనది. రాజామెను శ్రీనివాసునకిచ్చి వివాహము చేయుటకు గోరుచున్నాడు. యుక్తాయుక్తముల నాలోచించుటకు బృహస్పతిని రప్పించెను. అందుకొరకే నిన్నుగూడ తీసికొని రమ్మని నన్ను బంపెను. కాబట్టి నీవవకాశముచేసికొని రావలయునని కోరుచున్నాను."

ఆతఁడిని శుకమునిని యపరిమితానందభరితుఁడై వెంటనే మాధ్యాహ్నిక కృత్యములఁ నెరవేర్చుకొని యతనితో నారాయణపురికేగెను. వచ్చిన వెంటనే యాకాశరాజు శుకమునిని యర్ఘ్యపాద్యములతో సత్కరించి యిట్లుపలికెను. "ఓ మునీంద్రా! పద్మావతిని శ్రీనివాసునకిచ్చి వివాహము చేయ సంకల్పించితిని. తాము నా సంకల్పము నామోదించినచో దానిని నెరవేర్చెదను" అనిన శుకముని రాజుతో నిట్లుపలికెను "ఓ రాజేంద్రా! యీ కన్యాదానవిషయమున నీవు సందేహింప నక్కరలేదు. నీవు ధన్యుఁడవగుదువు. నీ వంశము పావనమగును. నీ పితరులు స్వర్గమున కేగుదురు. పూర్వజన్మమున నీవు గొప్పపుణ్యమును జేసియుండుటచే నీ జన్మమున సాక్షాత్తుగా శ్రీనివాసుఁడు నీకు జామాత యగుచున్నాడు. నీకంటె పుణ్యాత్ముఁడు లేడు. ఈ విషయమున విలంబముచేయకుము. శీఘ్రముగా శుభమును జరిగింపుము. సర్వసంగములను బరిత్యజించి. కందమూలములను భుజించి, తపముచేసికూడ మేము శ్రీనివాసుని బ్రత్యక్షముగ జూడలేకున్నాము. ఇప్పుడు నీ సంగముచే మేము కృతార్థులమై శ్రీనివాసుని బ్రత్యక్షముగా జూడగలుగుచున్నాము. నీ సంగము జన్మజన్మములయందును మాకు కోరదగినదిగానున్నది."

## 23. పద్మావతిని శ్రీనివాసునికి కన్యాదానము చేసెదనని యాకాశరాజు ప్రతిజ్ఞ చేయుట

రాజా మాటలనువిని తనను గృతార్థునిగా దలంచి గోత్రనక్షత్రాది యోగములను గ్రహగతులను విచారింపుమని గురుని గోరెను. తనది యత్రిగోత్రమనియు పద్మావతిది మృగశిరానక్షత్రమనియు విన్నవించెను. వకుళావళి శ్రీనివాసునిది వసిష్ఠగోత్ర మనియు శ్రవణనక్షత్ర మనియు చెప్పెను. వారిమాటలను విని గురుడు యోగమును విమర్శించి హర్షపూరితమనస్కుఁడై యిట్లనియెను. "నాడీకూటము, యోనికూటము,

సూత్రకూటము లన్నియు ననుకూలముగా నున్నవి. గ్రహములన్నియు శుభదాయకములుగా నున్నవి. అందుచే మీ బంధుమిత్రులతో నాలోచించి కన్యాదానము చేయుము.'' అనిన రాజు సంతసించి బంధు మిత్రాదులను రప్పించి వారితో నాలోచించి, పుణ్యాహావాచనము గావించి, వారియెదుట భుజమునెత్తి "పద్మావతిని శ్రీనివాసునకు కన్యాదానము చేసెద" నని ప్రతిజ్ఞచేసెను.

## 24. ఆకాశరాజు శ్రీనివాసునకు శుభలేఖ పంపుట

తదనంతరకరణీయం బేమని యాకాశరాజు బృహస్పతి నడుగగా నతడు శ్రీనివాసునకు శుభపత్రిక వ్రాసి బ్రాహ్మణునిద్వారా పంపుమని చెప్పెను. ఏమి లేఖనీయమో తమరే యానతీయుడని రాజడుగగా బృహస్పతి వ్రాయవలసిన విషయమును ప్రతిపాదించెను. గురూపదిష్ట మార్గమున రాజిట్లు వ్రాసెను, "వేంకటాచలవాసియగు శ్రీనివాసునకు నాకాశరాజు చేయు నాశీర్వాదములు. నీ యాశ్రయమునుగోరుచు నేను వ్రాయు సమాచారము లేమనగా, ఇచ్చట నేనును నా బంధువులును నీ యనుగ్రహమున గుశలముగా నున్నాము. మీ యందరిక్షేమాతిశయములను తఱచు పత్రములు వ్రాయుచుండ వేడెద. ఈపత్రము చైత్ర శుక్ల త్రయోదశినాడు వ్రాయబడుచున్నది. నా పుత్రియగు పద్మావతిని నీకిచ్చి వివాహము చేయవలయునని నా యాశయము. కాబట్టి నీవామెను పరిణయమాడవలెనని నాకోరిక. బృహస్పతియును శుకుడును నామనస్సు నెరిగియున్నారు. వైశాఖ శుక్ల దశమీ భృగువాసరము శుభముగా నున్నది. బంధువులతో వేంచేసి యా దినమున నాకుమార్తెను పాణిగ్రహణము చేయవలయునని నా ప్రార్థన. నేనింతకన్నను వ్రాయవలసిన దేదియు లేదు. శుకమహాముని చెప్పినట్లు చేయుము." అని వ్రాసి పత్రమును శుకమునిచేతికిచ్చి పంపెను. ఆకాశరాజొక క్రోశమాత్రము

శుకునివెంట వెళ్ళి యేప్రకారముగానైనను శ్రీనివాసుని చిత్తమును వశపరచుకొని వివాహమున కంగీకరించునట్లు చేయుమని చెప్పి యింటికి మరలెను.

శ్రీశుకుడు మధ్యాహ్నసమయమున వేంకటాద్రిచేరెను. అతనిని గని శ్రీనివాసుడు తనకార్యము సఫలమయ్యెనా లేదా యని ప్రశ్నించెను. నీ కార్యము సఫలమే యని పలికి శ్రీశుకుడతనికి సాష్టాంగప్రణామ మాచరించెను. శ్రీనివాసుడు సంతసించి ఋషిని ఆలింగనముచేసి కక్షమున నేమితెచ్చితి వని యడిగెను. ఆకాశరాజు పంపిన పత్రమని లేఖను శ్రీనివాసునకు సమర్పించెను. పత్రికను చదువుకొని సంతోషించి ప్రత్యుత్తరము వ్రాయుదునని శ్రీనివాసుడు నుడివి యిట్లు వ్రాసెను. "రాజాధిరాజును సుధర్మతనయుడు నగు నాకాశరాజునకు నమస్కారము లాచరించి వ్రాయున దేమనగా—మీరు వ్రాసిన పత్రమును జూచి సంతసించితిని. మీకోరిక నంగీకరించి వైశాఖ శుద్ధదశమీ భృగువారమునాడు మీ కుమార్తెను పాణిగ్రహణము జేసెదను. పూర్వకాలమున సాగరుడు నాకు కన్యాదానమునుజేసి యెట్లు కీర్తిబడసెనో, యట్లే నీవు నాకిప్పుడు కన్యాదానమునుజేసి కీర్తిపొందెదవు. నాకు కన్యాదానమునుజేసి నీవు నీ పూర్వోత్తర కులముల నుద్ధరించి కీర్తిని పొందగలవు. నీవు విశేషజ్ఞుడవు కనుక నీకధికముగా వ్రాయనవసరములేదు" అని పత్రికమువ్రాసి శుకునిమూలముగా నాకాశరాజునకు బంపెను. హరిసందర్శనానందముతో శుకుడు మరలి యాకాశరాజపురమునకు బోయెను.

## 25. శ్రీనివాసునితో వకుళాదేవి పద్మావతీ పరిణయ వృత్తాంతమును జెప్పుట

శుకగమనానంతరము శ్రీనివాసుడు వకుళావళినిజూచి యిట్లడిగెను, "అమ్మా యేమి యింత యాలస్యమైనది. అచ్చట నాకాశరాజు

వద్ద నేమిజరిగినదో చెప్పు" మనెను. "బహుప్రయాసముతో నీకార్యమును సాధించితిని. దైవవశమున నారాయణాశ్రమమునుండి ధర్మదేవి వచ్చినది. ఆమె కన్యక నీ కియ్యదగినదని వచించెను. కన్యకూడ నీయందు రాగముకలదై యన్యుని వివాహమాడనని చెప్పెను. వారి మాటలను విని రాజు కన్యకను నీకిచ్చుట కంగీకరించెను. నీకిచ్చెదనని సభలో ప్రతిజ్ఞకూడ జేసెను" అను వకుళాదేవిమాటలను విని శ్రీనివాసుడు సంతసించెను.

భవిష్యోత్తరపు. 9-వ అధ్యా.

## 26. శ్రీనివాసుని యాజ్ఞపై బ్రహ్మాదుల నాహ్వానించుటకు శేష శేషాశనులు వెళ్ళుట

బంధు పరివారసమేతుడగు నాకాశరాజు గృహమునకు వివాహార్థము బంధుపరివార రహితముగా వెళ్ళుట యుచితముకాదని దలంచి శ్రీనివాసుడు చతుర్ముఖుని, రుద్రుని బంధుమిత్ర పరివారసమేతముగా నాహ్వానించుటకు శేషుని గరుడుని లేఖలిచ్చి పంపెను. గరుడుడు సత్యలోకమునకు వెళ్ళి చతుర్ముఖుని జూచి శ్రీనివాసునిలేఖను అందిచ్చెను. ఆ పత్రికను విప్పి బ్రహ్మదేవుడిట్లు చదివెను. "చిరంజీవియగు పుత్రుడు చతుర్ముఖునకు శ్రీనివాసుని మంగళాశాసనములు. కలియుగాదియందాకాశరాజు తన కుమార్తెను నాకు కన్యాదానము చేయదలంచియున్నాడు ఆ వివాహమునకు నీవు సపుత్రకళత్రముగాను లోకపాల నాగ గంధర్వాదులతోను వచ్చి కల్యాణమును జూచి వెళ్ళవలెను." ఆ పత్రికను జూచి బ్రహ్మ యత్యంత సంతోషమును పొందినవాడై ద్వారపాలకులను బిలచి శ్రీనివాసుని కల్యాణమునకు భారతవర్షమున శేషాచలమునకు బోవుటకు సమస్తసేనలు సర్వజనములను సంసిద్ధము కావలయునని భేరీ దుందుభులను ప్రయోగించుడని యానతిచ్చెను.

## 27. చతుర్ముఖుడు శేషాచలమునకు వచ్చుట

చతుర్ముఖుడు వస్త్రభూషణాదులచే నలంకృతుడై సరస్వతీ సావిత్రీ గాయత్రీదేవులతో హంసవాహనుడై సపరివారముగా శేషాచలమునకు వెడలెను. ముందుగా చారులువచ్చి శ్రీనివాసునికి చతుర్ముఖాగమనము నివేదించిరి. శ్రీనివాసుడు పుత్రస్నేహమువలన గరుడునధిష్ఠించి బ్రహ్మకెదురుగా బయలువెడలెను. అదిచూచి చతుర్ముఖుడు హంసనుండి దిగి సాష్టాంగప్రణామము నాచరించెను. శ్రీనివాసు డతనిని లేవదీసి పుత్రస్నేహముచే నాలింగనము చేసికొనెను. వారిద్దరును పరస్పర కుశలప్రశ్నలతో గొంతకాలము గడిపిరి. అప్పుడు శ్రీనివాసుడు ద్వాపరాంతమున వైకుంఠమున శేషతల్పముమీద నుండగా భృగుమహర్షి తన్నురమున దన్నుటయు దానివల్ల లక్ష్మి కోపగించి కొల్హాపురమునకు పోవుటయు నా విచారముచే తాను వైకుంఠమునువదలి వేంకటాద్రికివచ్చి వల్మీకమునందుండుటయు చోళరాజుభృత్యుడు రాజభార్యాతాడితుడై తన్ను కుఠారముతో గొట్టుటయు వకుళాదేవి తన్ను సంరక్షించుటయు మొదలగు తన వృత్తాంతమునంతను వివరించెను. తరువాత నొకదినమున మృగయాసక్తుడై పద్మతీర్థసమీపమున నున్న యుపవనమున కేగుటయు నచ్చట నాకాశరాజు కుమార్తెయగు పద్మావతిని చూచుటయు నామెను మోహించుటయు నామె వివాహమును ఘటింపజేయుమని వకుళావళిని గోరుటయు నామె వివాహమును నిశ్చయించుటయు మొదలగు వృత్తాంతము నంతను జెప్పెను.

## 28. శేషాద్రికి రుద్రాదు లరుదెంచుట

ఇంతలో పార్వతీషణ్ముఖసమేతుడగు శంకరుడు తన ప్రమథగణములతో గూడ వేంకటాద్రి కరుదెంచెను. నీలకంఠుడు శ్రీనివాసునికి చతుర్ముఖునకును వందనముల నర్పించెను. శ్రీనివాసు డాలింగనము

చేసి నీలకంఠుని నుచితాసనమున నిషణ్ణుని గావించెను. తదుపరి కుబే రుడు భార్యాబంధువులతోను యక్షులతోను వచ్చెను. అటుతరువాతను స్వాహాస్వధానమేతుడై మేషవాహనుడగు నగ్ని విచ్చేసెను. అటుపైన యమవరుణేంద్రవాయుచంద్రసూర్యాది దేవతలందరును నొకరితరువాత నొకరరు దెంచిరి. ఇంతలో కశ్యపభరద్వాజ వామదేవ గౌతమ విశ్వామిత్ర వసిష్ఠ వాల్మీకి పరశురామ పులస్త్యదధీచి శునఃశేఫ గాలవాది ఋషులందరును గ్రమముగా వేంకటాద్రికి వచ్చిరి. వారినందరిని శ్రీనివాసుడు యథాయోగ్యము గౌరవించి యుచితాసనములలో గూర్చుండ బెట్టెను.

## 29. విశ్వకర్మ వివాహపురమును నిర్మించుట

శ్రీనివాసుడప్పు డింద్రునిగని వివాహార్థము విశ్వకర్మచే పురమును నిర్మింపజేయుమని యాజ్ఞాపించెను, ఇంద్రుని యాజ్ఞచే విశ్వకర్మ పంచాశద్యోజనవిశాలమైనట్టియు, త్రింశద్యోజనాయతమైనట్టియు, విచిత్రమైనట్టియు, మనోహరమైనట్టియు గొప్ప పురమును నిర్మించెను. అటుపైన శచీపతి శ్రీనివాసునియాజ్ఞపై మయునితోగూడ నాకాశరాజ పురమునకు జని యచ్చటగూడ నొక వివాహగృహమును నిర్మింపజేసెను. మౌక్తికహారములతో నలంకరింపబడిన రత్నస్తంభములతో గూడిన వివాహ వేదికను గూడ విశ్వకర్మ నిర్మించెను. రత్నతోరణమండితమైన రత్నస్తంభ గోపురమును వాపీకూపశతములను వాజిగజ భవనములను గూడ నిర్మించెను.

## 30. శ్రీనివాసుడు దేవతలను ఋషులను వివాహకార్యములందు నియోగించుట

అప్పుడు శ్రీనివాసుడు దేవతలను జూచి యిట్లు పలికెను. “ఆకాశరాజునకు పద్మావతియను కుమార్తెకలదు. ఆమెను పాణి

గ్రహణము చేయవలయునని నాకిచ్ఛ కలదు. మీరందరును నీ సంబంధము నంగీకరించినచో నే నామెను నంగీకరించెదను." ఆ మాటలను విని బ్రహ్మాది దేవతలిట్లు పలికిరి. "మేమందరము మీకు దాసులము. నీ ప్రసాదమువలన నిచ్చట మహోత్సవమును జూడ వచ్చితిమి." అనిన యందరి యంగీకారము నెరింగి శ్రీనివాసుడు దేవతలను వివాహకార్యములయందు నియోగించెను. వచ్చిన దేవతలను ఋషులను సత్కరించుటకు శంకరుని నియోగించెను. దేవతల నందరిని నాహ్వానించుటకు కుమారస్వామిని, వారిని తాంబూలదానాదులచే గౌరవించుటకు మన్మథుని వంటచేయించుటకు హవ్యవాహనుని, జలమునిచ్చుటకు వరుణుని, సుగంధద్రవ్యముల నిచ్చుటకు వాయువును, ధనవస్త్రాదుల నిచ్చుటకు కుబేరుని, దీపధారణమునకు నిశాకరుని, భాండములను శుద్ధిచేయుటకు వసువులను, దుష్టులను దండించుటకును, శిష్టులను పరిపాలించుటకును యముని నియోగించెను. దేవతలందరును శ్రీనివాసుని యాజ్ఞను గైకొని వారివారికి నియమించబడిన కృత్యములను నెరవేర్చుటకు వెడలిపోయిరి.

## 31. వివాహార్థము కరవీరపురము (కొల్హాపురము) నుండి రమను రప్పించుట

అంతట చతుర్ముఖుడు శ్రీనివాసుని జేరి "పుణ్యాహవాచనము, ఇష్టదేవతాపూజ, కులదేవతాప్రతిష్ఠ మొదలగు పూర్వకర్మకలాపము జరుగ వలసియున్నది గనుక మంగళస్నానము చేయుమని" కోరెను. అప్పుడు శ్రీనివాసుడు కరవీరపురమున నున్న లక్ష్మీదేవిని తలంచుకొని విచారింపసాగెను, "రమలేని సభ శోభింపజాలదు. నీవును నేనును దేవతలునుగూడ చంద్రుడులేని నక్షత్రములవలె శోభింపజాలము. ప్రళయకాలమున నే నొక్కడను క్షీరసముద్రమున వటపత్రముమీద శయనించి

యున్నప్పుడు గూడ నన్ను విడువకుండు లక్ష్మిని విడచి నేనెట్లు సుఖము ననుభవింపగలను. ఆమె లేనిదే నేనెట్లు వివాహమాడగలను"అని యిట్లు శ్రీనివాసుడు విలపించగా, పితామహు డిట్లు పలికెను. "అట్లయినచో ముందేల చెప్పకుంటిరి? ఇప్పుడేల ప్రాకృతుని వలె విచారించెదరు. అయిన నేమి మమ్మెవరినైనా పోయి యామెను తోడితెమ్మని యాజ్ఞా పించినచో పోయి యామెను తీసికొనివచ్చెదము." అప్పుడు శ్రీనివాసుడు సూర్యుని బిలిపించి యిట్లు పలికెను. "నీవు కరవీరపురమునకేగి యచ్చట నున్న రమను నావద్దకు తీసుకొనిరమ్ము"అని యాజ్ఞాపించెను. "నేనామె నేమి చెప్పి తీసుకరావలయును. ఆమె నామాటలనెట్లు విశ్వసింపగలదు." "నీకుపాయము చెప్పెదను వినుము" అని శ్రీనివాసు డిట్లు పలికెను. "నీ వివాహముచే శ్రీనివాసుకు నిశ్చేతనుడై యున్నాడు. నా దేవిని నే నెప్పుడు చూడగలనని ప్రలపించుచు నశక్తుడుగా పడియున్నాడు. జీవిత సంశయమున నున్నట్లున్నది. ఇట్లు నీవు చెప్పినచో నీవెంట రాగలదు." ఈ యుపాయమును విని సూర్యుడు, "ఆమె సర్వజ్ఞ కదా. అందరి హృదయములలోని విషయములను నామె యెరుగగలదు కదా. నా మాటల నెట్లు నమ్మగలదు. అదియునుంగాక స్వస్థముగా నున్న నిన్ను రోగస్థుడై యున్నావని యెట్లు చెప్పగలను" అని సందేహించెను. దానికి శ్రీనివాసుడు, "నా మాయచే మోహింపబడిన యామె, నీ మాటలను విశ్వసించును. పొమ్ము" అని ధైర్యము చెప్పి వానిని బంపెను.

సూర్యునిమాటలను విని, రమ, రథమెక్కి వాయువేగముతో వేంకటాద్రికి వచ్చెను. ఆమెనెదుర్కొనుట కశక్తుని వలె శ్రీనివాసుడు, శంకరుని కంఠమున నొక భుజమును, చతుర్ముఖుని కంఠమున రెండవ భుజమునుమంచి, మెల్లమెల్లగా వెళ్ళెను. అట్టిస్థితియందున్న శ్రీనివాసుని జూచి కమలాలయ శీఘ్రముగా రథమును దిగి, సంపెంగ పుష్పముల నతని పాదములయందు జల్లి, అతి భక్తితో నాలింగనము చేసికొనెను.

ఆమె యాలింగనముచే స్వస్థుడైన శ్రీనివాసు డామెను, కుశలప్రశ్న చేసెను. ఆమెయు శ్రీనివాసుని కుశలము విచారించెను. తదుపరి కమల, "నేను నీ మాయచే మోహితురాలనైతిని. బ్రహ్మ రుద్రాది దేవతలే నీ మాయచే మోహితులు కాగా నాసంగతేమున్నది. దానికేమి కాని నన్ను పిలిపించిన కారణమేమి చెప్పు"మని శ్రీనివాసుని బ్రార్థించెను. శ్రీనివాసు డిట్లు పలికెను. "ఓ దేవీ ! రామావతారమున నీవు చెప్పినసంగతి జ్ఞప్తికి తెచ్చుకొనుము. వేదవతీవివాహమున కిప్పుడు కాలము సంప్రాప్తమైనది. ఈకలియుగమున నీపక్షమున నామెను పరిణయమాడ దలంచియున్నాను. నీ యభిప్రాయమేమి ?" అని యడుగగా, నామె పూర్వకథను జ్ఞాపకము తెచ్చుకొని, "ఆమెను వివాహమాడి నా కోరికను సఫలముచేయుము" అని శ్రీనివాసుని ప్రార్థించెను. శ్రీనివాసుడు సరి యని యామె నానంద పరచెను.

భవిష్యోత్తరపురాణము 10 - వ అధ్యాయము.

## 32. పద్మాలయ శ్రీనివాసునకు మంగళస్నానము గావించుట

అటుపైని శ్రీనివాసుడు చతుర్ముఖుని జూచి యనంతరకృత్యములను జరిగించుమని యానతిచ్చెను. అతను గరుడాది దేవతలను బిలిచి, స్నానపాత్రములను సిద్ధపరుపుమని యాజ్ఞాపించెను. అప్పుడు వరుణ వాయుదేవుల సహాయమున వారందరును సుగంధోదకములతోను తీర్థోదకములతోను నిండిన పాత్రములను సిద్ధపరచిరి. పార్వతీ సరస్వతీ సావిత్రీ మొదలగు సువాసినులు అరుంధతిని ముందిడుకొని, మంగళములను పాడ నారంభించిరి. వారందరును శ్రీనివాసుని స్నానపీఠ మలంకరింపు మని కోరగా, నాయన దీనవదనుడై కన్నీళ్ళు కార్చుచు నిట్లు పలికెను. "ఓచతుర్ముఖుడా ! నాకు తల్లితండ్రులు కాని, సహోదరులు కాని, తోడబుట్టువులుకాని, తదితరబంధువులుకాని లేరు కదా. నాకెవరాశీర్వాద పూర్వకముగా మంగళస్నానము చేయించెదరు. బంధువులు లేని

వారి జీవితము వ్యర్థము కదా" అని పలికి, ప్రాకృతుని వలె నేడువ నారంభించెను. ఆ మాటలను విని బ్రహ్మ, శ్రీనివాసు నోదార్చుచు, నిట్లు పలికెను. "ఓ స్వామీ ! యెందులకు నీవిట్లు విడంబనము చేసెదవు. నీకు బంధువులు లేకపోవుట యేమి ? మే మందరము నీ కుటుంబము కామా ? నీవు సాక్షాత్తు పరమపురుషుడవు. నీ భార్య జగన్మాత కాదా ? ఇట్టి లోకకుటుంబవంతుడ వగు నీవు మాతో నెందు కిట్లు క్రీడించెదవు" అని పలికి, మంగళస్నానము చేయించుమని, రమను సంకేతముచేసెను. అప్పుడు రమ లేచి, శ్రీనివాసుని సమీపించి, యిట్లు పలికెను. "ఓ వేంకటేశా ! నీ యభిప్రాయము తెలిసినది. విచారమును విడచి లెమ్ము. తైలాభ్యంగనము నేను చేయించెదను. స్నానపీఠము నలంకరింపుము." ఈ మాటలను విని శ్రీనివాసుడు సంతోషించి లేచి, వసిష్ఠాదిమునులను మంగళస్నానమున కనుజ్ఞయిమ్మని కోరెను. 'తథాస్తు' అని వా రనుజ్ఞ నియ్యగా, సువాసినులు వచ్చి, శ్రీనివాసుని స్నానపీఠము నలంకరింప జేసిరి. తదుపరి సింధుపుత్రి యగు రమ, తైలపూరితమగు రుక్మపాత్రి మును గ్రహించి, శ్రీనివాసుని అభ్యక్తుని జేసెను. సుగంధతైలము నొడలికి పూసి, పునుగు, కస్తూరి కలిపిన హరిద్రాచూర్ణముతో నలుగు పెట్టి, కాంచనఘటములతో తేబడిన పుణ్యతీర్థములతో నభిషేకము చేయించెను. చివరను, నలుగురు సువాసినులు తెచ్చిన శుద్ధజలముతో జలకమాడించెను. శరీరమును సావిత్రితెచ్చిన శుద్ధవస్త్రముతో నొత్తెను. పార్వతితెచ్చిన ధూపవస్తువులతో ధూపము వేసెను. రతీశచులు చామర ముల వీచుచుండిరి. భారతి ఛత్రము పట్టెను. గంగ పాదుకలను తెచ్చి సమర్పించెను. ఆ పాదుకల నెక్కి, స్వామిపుష్కరిణీ తీరమున నున్న యాసనము నలంకరించి, బ్రహ్మాది సురులును, ఇంద్రాది దిక్పాలకులును, కశ్యపాది మునులును, వసిష్ఠాది తపోధనులును, సనకాది యోగులును, భృగ్వాది ఋషులును, అర్యమాది పితరులును, తుంబురాది గాయకులును

రంభాది నర్తకులును సేవించుచుండ, నూర్ధ్వపుండ్రమును ధరించెను. తరువాత, కుబేరుడు సమర్పించిన యాభరణములచే నతనిని రమ, యలంకృతునిగా జేసెను. సంధ్యాది తాత్కాలిక క్రియలను నిర్వర్తించు కొని శ్రీనివాసుడు కశ్యపాది ఋషులకు నమస్కరించెను. వసిష్ఠుని యుత్తరకార్యముల నాచరింపుమని యాజ్ఞాపింపగా, నా ఋషి మౌక్తిక వేదికను రచియించి, విధిపూర్వకముగా సంకల్పముచేసి పుణ్యాహకర్మను జరిపించెను.

## 33. శ్రీనివాసుడు పరిణయాంగముగా కులదేవతయగు శమీవృక్షమును ప్రతిష్ఠించుట

శాస్త్రోక్తకర్మలను నిర్వర్తించిన పిదప వసిష్ఠుడు, కులదైవమును బూజింపవలసియున్నది. కనుక మీ కులదైవ మేది యని శ్రీనివాసు నడిగెను. శమి మా 'కులదైవ'మని చెప్పి, యది యెచ్చట కలదని శ్రీనివాసుడడిగెను. శమీవృక్షము కుమారధారవద్ద నున్నదని యగస్త్యుడు చెప్పగా, శ్రీనివాసు డచ్చటికేగి దానిని పూజించి, చిన్నకొమ్మను విఱిచి తెచ్చెను. దీని నెచ్చట స్థాపింపవలసినదని శ్రీనివాసుడడుగగా నారదముని, వరాహస్వామివద్ద స్థాపింపవలెనని చెప్పెను. అప్పుడు శ్రీనివాసుఁడు వరాహస్వామివద్దకు వెళ్ళి వారి యనుజ్ఞ గైకొని శమీవృక్షమును, వారి సమీపమున ప్రతిష్ఠించెను.

## 34. శ్రీనివాసుడు పరిణయమునకు కుబేరునివద్ద ధనమును ఋణము చేయుట

ఆకాశరాజుపురమగు నారాయణపురమున కందరిని పయనము చేయవలసినదని శ్రీనివాసుడు చతుర్ముఖునితో జెప్పగా నతడిట్లనియెను. "పుణ్యాహకర్మ చేసికొని భోజనములేక యుపవాసముతో వెడలరాదని

నా యభిప్రాయము. మనులును, బాలవృద్ధాది జనులును భోజనమున కెదురుచూచుచున్నారు" అనిన, శ్రీనివాసుడిట్లనియెను. "నేను రిక్తుడను. నా ధనమంతయును పోయినది. నే నెట్లు సమారాధన చేయగలను" అనిన, బ్రహ్మ యూరకుండెను. కాని శంకరు డిట్లు పలికెను. "వివాహము చేయుటకును, నిల్లు కట్టుటకును ప్రారంభించిన వా డంతము వరకు యత్నమును మానగూడదు. శుభకార్యములలో సమస్తసంభార ములను సిద్ధపరుపవలెను. కాని విడువకూడదు. ధనములేనిచో ఋణము చేసియైనను, కార్యము సమగ్రముగా నడిపించవలెను. కాని విడుచుట కీర్తికరము కాదు." శంకరుని పలుకులు విని, శ్రీనివాసు డిట్లనియె. "సభలో పౌరుషముగా మాటలాడుచున్నావు. ఈ నా వివాహమునకు పుష్కలముగా ధనమును ఋణమిచ్చువారెవరు కలరు. పురుషుడైనవాడు పౌరుషముతో యత్నము చేయనగునుగాని మాటలాడుటవలన ప్రయోజన మేమున్నది" అని యిట్లు శంకరునకు సమాధానము పలికి, కుబేరునితో నిట్లనియె. "ఓ కుబేరా! నీ వలన కొంచెము కార్యమున్నది. నీ విట్లు రమ్ము" అని కుబేరుని బిలుచుకొని, బ్రహ్మరుద్రులతో సభను వదలి, పుష్కరిణీతీరమున నున్న యశ్వత్థవృక్ష మూలమునకు రహస్యముగా మాటలాడుటకు వెళ్ళెను. అచ్చట రహస్యముగా కుబేరునితో నిట్లు పలికెను. ఈ కలియుగమున నా కల్యాణమును నీవు ధనమిచ్చి జరిపించ వలయును. నా యవతారములలో నేను గృహమునుండి ధనముతెచ్చుట లేదు. భూలోకమున నార్జించిన ధనమును, నా గృహమునకు దీసికొని పోవుటలేదు. నేను యుగము ననుసరించియు, కాలము ననుసరించియు, దేశమున నుసరించియు, వయస్సు ననుసరించియు నా యవతారములను వడుపుచుందును. కాబట్టి, యీ యుగానుసారముగాను, దేశ కాలాను సారముగాను నీవు నాకు ధనము నిమ్ము, నేను యుగానుసారముగా దీర్చెదను" అనిన, "ధనము లేనివాడు ధనవంతున కెట్లు పత్రిమును

వ్రాసి పుచ్చుకొందునో యట్లు నీవు నాకు పత్రము వ్రాసినచో ధనము నిచ్చెద" నని కుబేరుడనెను. శ్రీనివాసు డట్లే యని యంగీకరించి, పత్రము వ్రాయుమని బ్రహ్మ నాజ్ఞాపించెను. చతుర్ముఖు డిట్లు పత్రము సిద్ధపరచెను. "కలియుగమున విళంబిసంవత్సర వైశాఖ శుక్ల సప్తమి నాడు, కుబేరునినుండి శ్రీనివాసుడు, తన కల్యాణము నిమిత్తము ఐదునాలుగు లక్షలసంఖ్యల రామముద్రనిష్కములను వృద్ధికి తీసికొనెను. వివాహవర్షము మొదలు, వెయ్యి సంవత్సరముల లోపున ఋణము తీర్చే నిర్ణయము. ఇందుకు చతుర్ముఖు డొక సాక్షి, శంకరుడు రెండవ సాక్షి, అశ్వత్థవృక్షము మూడవ సాక్షి." ఇట్లు ధనపత్రమును వ్రాసి శ్రీనివాసుడు కుబేరునకిచ్చి ధనమును ఋణముగా గ్రహించెను.

## 35. శ్రీనివాసుడు వేంకటాద్రికి వచ్చిన దేవతలకు ఋషులకు సంతర్పణ చేయుట

తాను ఋణముతీసికొనిన ధనమును ధనదునిచేతికిచ్చి సంతర్పణ కవసరమగు తండుల మాషముద్గ గుడతైల మధుక్షీర శర్కరాజ్య దధ్యాది పదార్థములను, వస్త్రోత్తరీయ దుకూలాది పరిచ్ఛదములను, నాగవల్లీదళ పూగీఫలైలా లవంగ కర్పూరాది సుగంధ ద్రవ్యములను, వివాహమున కవసరమగు మాంగల్య తంతుపాదాంగుష్ఠ ముద్రికా ద్యాభరణములను సిద్ధము చేయుమని కోరెను. అతను వానిని సిద్ధపరుపగా, షణ్ముఖుని బంపి యగ్నిదేవుని బిలిపించి, యతిశీఘ్రముగా భక్ష్యాన్నశాకాదులను పచనము చేయుమని యానతిచ్చెను." పాకార్థము భాజనమొకటైనను లేదు. ఎట్లు పచనముచేయగలను"అని యగ్ని యనగా, వేంకటేశ్వరు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "మీవంటివారి యిండ్లలో నుత్సవములు సంప్రాప్తించెనేని భాజనములు సమృద్ధిగా దొరకును. నా కల్యాణమున

కొక్క భాజనమైనను గానరాదు. నా యదృష్ట మిది. అయినను, నుపాయము చెప్పెదను వినుము. స్వామి పుష్కరిణియే యన్న పాత్రము. పాపవినాశనతీర్థము సూపపాత్రము. ఆకాశగంగ పరమాన్నపాత్రము. దేవతీర్థము శాకభాజనము. తుంబుర తీర్థము చిత్రాన్న భాజనము. కుమారధారికా తీర్థము భక్ష్య భాజనము. పాండుతీర్థము తింత్రిణీరస పాత్రము. మిగిలిన తీర్థములు వ్యంజనపాత్రములు. ఈ ప్రకారముగా పాక మాచరింపుము. అట్లే యని యగ్నిదేవుడు పోయి, పంచభక్ష్య పరమాన్నములతో సర్వమును పచనముచేసి, దేవద్విజమునీశ్వరులను భోజనార్థ మాహ్వానింపు మని శ్రీనివాసునితో నివేదించెను. వెంటనే శ్రీనివాసుడు షణ్ముఖుని బిలువనంపి యతనిని భోజనార్థము, దేవద్విజ మునీశ్వరులను నాహ్వానించుమని యాజ్ఞాపించెను. వారందరును రాగా, వారిని, పాండుతీర్థము మొదలు శ్రీశైలము వరకును, పంక్తులు తీర్చి కూర్చుండబెట్టెను. అప్పుడు శ్రీనివాసు డా నివేదితాన్నమును భుజింప జేయగూడదు గనుక చతుర్ముఖుని బిలిచి సమస్తపదార్థములను నహోబిల నృసింహస్వామికి నివేదనముచేసి భుజింపవలయునని చెప్పెను. బ్రహ్మ యట్లుచేసి యందరిని భుజింపజేసెను. శ్రీనివాసు డందరకును నుపచార వాక్యములను బలుకుచు, తనకు కలిగినది స్వల్పముగా పెట్టినను వారు కృపతో స్వీకరించి, తన్ను కృతార్థుని చేయవలయునని ప్రార్థించెను. అపుడందరును నేక కంఠముతో, నీవు పెట్టినయన్న మమృతమువంటిది, ముక్తిమార్గసాధనము. మేము ధన్యులమైతిమి. కృతార్థులమైతిమి" అని యభినందించి భుజించి సంతుష్టులైరి. భోజనానంతరము దక్షిణతో గూడిన తాంబూలము నందరకును పంచిపెట్టిరి. అందరి భోజనములైన తరువాత శ్రీనివాసుడు భార్యాపుత్రులతో భుజించెను. సూర్యాస్తమయము కాగా నందరును రాత్రి విశ్రమించిరి.

## 36. శ్రీనివాసుడు సపరివారముగా నాకాశరాజుపురమున కేగుట

మరునాడుదయమున శ్రీనివాసుడు శీఘ్రముగా లేచి గరుడుని బిలిచి, చతుర్ముఖునియొద్దకుపోయి నారాయణపురమునకు తరలివెళ్లుటకు సర్వసన్నాహములు చేయవలయు నని చెప్పుమనెను. బ్రహ్మదేవుడు ప్రయాణమునకు చతురంగబలమును సజ్జీకృతము చేసి, శ్రీనివాసుని సమీపించి, "బలమంతయు సజ్జీకృతమయినది. దేవరవారలు గరుడు నధిష్ఠించి, బయలు వెడలవచ్చు" ననెను. శ్రీనివాసుడు గరుడునధిష్ఠించి బయలుదేరెను. బ్రహ్మ ముందును, దక్షిణపార్శ్వమున రుద్రుడును, వామపార్శ్వమున వాయువును, కుమారస్వామి వెనుకను వచ్చుచుండిరి. రమ కాంచననిర్మితమగు రథము నధిరోహించెను. వకుళాదేవి విమాన మున బయలుదేరెను. ఇట్టి పరిచ్ఛదముతో శ్రీనివాసుడు బయలుదేరగా శేషుడు శ్వేతచ్ఛత్రమును వహించెను. వాయువు చామరములను వేయ సాగెను. విష్వక్సేనుడు వ్యజనమును గైకొనెను. ఇట్లు భేరీదుందుభి ఘోషములతోను, వాదిత్రముల శబ్దములతోను, నట నర్తకులతోను, శ్రీనివాసుడు బయలువెడలెను. మార్గమున దేవతలయు, ఋషులయు, గంధర్వులయు, పశువులయు సమ్మర్దమధికముగా నుండెను. శేషాచలము నుండి నారాయణపురమువరకును నుండు మార్గమున తిలమాత్రావకాశము లేకుండెను. శ్రీనివాసుని సేన పద్మతీర్థమార్గమున నాకాశరాజ పురము నకు పోవుచుండెను.

## 37. శ్రీశుకుడు శ్రీనివాసుని కాతిథ్యమిచ్చుట

శ్రీనివాసుడు పద్మతీర్థమును సమీపించగా శ్రీశుకుడు సాష్టాంగ నమస్కార మాచరించి యిట్లనియెను. "దేవా! ఇన్నిదినములకు నాతపస్సు ఫలించినది. ఏలయనగా బ్రహ్మరుద్రాదుల కగమ్యుడవగు నీవు నా కిప్పుడు సాక్షాత్తుగా గనబడితివి. పుత్రమిత్రులతోను, లోకపాలురతోను, శేషుని

తోను గూడిన లక్ష్మీసమేతుడ వగు నిన్ను, ఈ నేత్రములతో జూచు భాగ్యము నాకు గలిగినది. ఆహా ! యేమి యదృష్టము ! నా పనవి మన్నించి నే సమర్పించు కందమూలాదులను గృపతో బరిగ్రహించి నన్ను గృతార్థుని జేయుము.'' శుకుని ప్రార్థనను విని శ్రీనివాసు డిట్లనియె. "నీవు బ్రహ్మచారివి, విరాగివి, కృశుడవు, మేము సంసారులము. అనే కులము. అందుచే నీవు శ్రమపడకుము. మేము నారాయణపురమునకేగి యచ్చట భుజింప దలచియున్నాము.'' అనిన శ్రీశుకుడిట్లు పలికెను. "నే నకించనుడను. అందు సందేహములేదు. కాని నీవు భుజించినచో లోకమంతయు భుజించినట్లగును. కాని నీవు విచారముచేయక నాప్రార్థన నంగీకరింపుము.'' ఆ మాటలను విని వకుళాదేవి యిట్లనియెను. "నీ వివాహమున కీ శుకముని విశేషయత్నము చేసియున్నాడు. ఆకాశ రాజును బోధించి సమ్మతింప జేసెను. కాబట్టి యతని ప్రార్థనను నంగీ కరింపుము.'' వకుళాదేవి వాక్యములను విని శ్రీనివాసుడు శ్రీశుకుని యాతిథ్యము నంగీకరించి యతని యాశ్రమమును ప్రవేశించి కుటీరము లోనికి బోయెను. శ్రీశుకుడు పద్మతీర్థమున స్నానముచేసి భక్తితోగూడ నన్నమును కూరను రసమును వండెను. పద్మపత్రములను బరచి తాను పచనముచేసిన పదార్థములను వడ్డించి సాష్టాంగ దండప్రణామము నాచ రించి భోజనముచేసి తన్ను గృతార్థుని జేయమని ప్రార్థించెను. అతని భక్తికి సంతసించి శ్రీనివాసుడు ఋషుల కుచితమైన భోజనమును భుజించెను. అతని యాజ్ఞపైన శ్రీమహాలక్ష్మియు వకుళాదేవియుకూడ భుజించిరి. శ్రీనివాసుడు భుజింపగా ఋషులందరును గోపావిష్టులై శుకమునిని తర్జింప జొచ్చిరి. ఆ తపోధనులు శాపమిత్తురేమో యను సందేహమున శ్రీనివాసుడు వారిని దృప్తిపరచుటకై తేన్చెను. శ్రీనివాసుని ముఖాంభోజమునుండి వెడలిన వాయువుచే నా ఋషులందరును దృప్తులై సంతసించి శ్రీశుకుని స్తుతించిరి. శ్రీనివాసు డొకదిన మచ్చటనుండి

పటనాపపయమున గడుకు సధిష్ఠించి నారాయణపురమునకు పయన మాయెను.

## 38. సపరివారముగా నాకాశరాజు శ్రీనివాసు నెదుర్కొనుటకు వచ్చుట

ఆ సాయంకాల మాకాశరాజు పద్మావతిని స్నానమాడించి, యలంకరించి గజము నెక్కించి యామెతోను పుత్రునితోను శ్రీనివాసు నెదుర్కొనుటకు పురోహిత సమేతముగా చతురంగ బలయుక్తుడై బయలు దేరెను. అతని సోదరుడు తొండమానుడుకూడ నతనితో బయలు దేరెను. గరుడారూఢుడగు శ్రీనివాసుని జూచి యాకాశరాజు రథము నుండి దిగి, పద్మావతిని పురోహితుని పురస్కరించుకొని శ్రీనివాసుని సమీపించి యిట్లు మనవిచేసెను. "నే నిప్పుడు కృతకృత్యుడనైతిని. ధన్యుడనైతిని, స్వర్గమార్గమును బడసితిని.'' అని పలికి శ్రీనివాసుని వసనాభరణాదులతోను, గంధమాల్యాదులతోను పూజించెను. పద్మావతీ శ్రీనివాసు లన్యోన్యము సందర్శించుకొనిరి. తరువాతను పద్మావతీ శ్రీనివాసుల నలంకృత వీథులగుండ వాద్యములతో నాకాశరత్న నిర్మిత మగు మందిరమున ప్రవేశపెట్టెను. అప్పుడు రాత్రి యైదు ఘడియల వేళయయ్యెను. శ్రీనివాసుడు తొండమానుని బిలిచి యిట్లు పలికెను. "నేనును, నా లక్ష్మియు, నాతల్లియగు వకుళావళియు, నా కుమారుడును మాతో వివాహార్థమువచ్చిన పరివారమంతయు క్షుధార్తులమై యున్నారము. కాబట్టి వెంటనే పాకముచేయించి వారందరికిని భోజనము పెట్టింపుము. నాకుకూడ భోజనమును నా మందిరమునకు బంపవలయును." వెంటనే తొండమానుడు పోయి పాకముచేయించి యాకలితోనున్న ఋషులకును, దేవతలకును, విప్రులకును భోజనములు పెట్టించి వారిని దృప్తిపరచెను. బహువిధాన్న భక్ష్యములను వాసుదేవునికిగూడ

బంపెను. తాను స్వయముగా వెళ్ళి సపరివారముగా శ్రీనివాసుని భుజింప జేసి, వారిని వస్త్రాదులతో బూజించి వారి యాజ్ఞగొని స్వగృహమున కేగెను. శ్రీనివాసుడు సపరివారముగా రాత్రి విశ్రమించెను.

## 39. వివాహార్థము శ్రీనివాసుని నాహ్వానించుటకు ఆకాశరాజు తన్మందిరమున కేగుట

మరునాడు ప్రాతఃకాలమున లేచి శ్రీనివాసుడు వసిష్ఠుని బిలిచి యిట్లనెను. "నేనును, లక్ష్మియు, బ్రహ్మయును, మాతల్లియు, పురోహితుడును మేమయిదుగురము మీ దినమున భోజనము చేయగూడదు. ఆకాశరాజుభవనమున నా రాజును, నతని భార్యయును, కన్యకయును, యామె యన్నయును, బురోహితుడు నను నైదుగురును భోజనము చేయగూడదు. నీ వట్లు జరిగింపుము." అని వసిష్ఠునితో జెప్పి కుబేరుని బిలిచి యతనితో నిట్లనియెను. "నీ వాకాశరాజుభవనమున కేగి యతనితో నిట్లుచెప్పుము. నేటిరాత్రి పదమూడుఘడియలకు వివాహముహూర్తము. అప్పుడు బ్రాహ్మణభోజన మసాధ్యము. కాబట్టి తత్పూర్వమందే బ్రాహ్మణభోజనము కర్తవ్యము. అని చెప్పిరమ్ము." కుబేరుడట్లు చెప్పగా నాకాశరాజు రాత్రి శీఘ్రముగానే బ్రాహ్మణులను భుజింపజేసి దక్షిణతాంబూలముల నిచ్చి తృప్తిపరచెను.

ఆ సాయంకాలము చతురంగబలమును ముందిడుకొని వసుదానునితోను, తొండమానునితోను, పురోహితునితోను నాకాశరాజు బయలు దేరి, ఐరావతమను మహానాగము నలంకరించి తనతో దెచ్చెను. శ్రీనివాసుని వివాహార్థమాహ్వానించుటకు శ్రీనివాసుని మందిరము చేరెను. అప్పుడు శ్రీనివాసుడు సమస్తదేవతలతోను, ఋషులతోను నాస్థానమండపమున నాసీనుడై యుండెను. ఆకాశరాజు వచ్చుటను జూచి శ్రీనివాసుడు లేచి యతని నాలింగనముచేసి "వృద్ధుడవు, నీ వెందులకు శ్రమతీసికొని

రావలయును. నీ కుమారుడగు వసుదానుని బంపిన జాలదా ?" అని పలికెను. అంతట నాకాశరాజు వసిష్ఠుని జూచి వరపూజ జరిగింపుమని కోరెను. వసిష్ఠు డరుంధతిని పురస్కరించుకొని వరపూజ జరిగింపుమని ధరణీదేవితో జెప్పెను. ఆమె తాను కృతార్థురాలనైతినని తలంచి చందనకర్పూరతాంబూలాదులతో శ్రీనివాసుని నర్చించెను. వస్త్రములను రత్నాద్యాభరణములను సమర్పించెను. తరువాత నాకాశరాజు శ్రీనివాసుని గజమునెక్కించి సమస్తదేవతలతోను, ఋషులతోను, సర్వమంగళ వాద్యములతోను, దీపములతోను రత్నతోరణాదిమండితమగు తన భవనమునకు తీసికొని వెళ్ళెను. భవనద్వారమువద్ద తొండమానునిభార్య శ్రీనివాసునికి నీరాజనము నిచ్చెను. ఆకాశరాజు శ్రీనివాసుని తన భవనములోనికి తీసికొనిపోయి చతుఃస్తంభయుతమైన రత్నవేదియందు రత్నాసనము నలంకరింపజేసెను. దేవతలు ఋషులు మొదలగు వారందరును శ్రీనివాసుని చుట్టును చతుర్ముఖుని పురస్కరించుకొని యుత్సవ దర్శన కుతూహలులై యాసీనులైరి.

## 40. పద్మావతీ శ్రీనివాసుల వివాహము

ధరణీదేవి స్నానముచేసి యలంకరించుకొని వరుని పాదముల గడుగుటకు బ్రాహ్మణసమేతముగా స్వామిపుష్కరిణీతీర్థమును సువర్ణ కుంభమున దెచ్చెను. వెంటనే పురోహితుడు సంకల్పమును జెప్పి మధుపర్కము నిచ్చెను. తరువాత నాకాశరాజు ధరణీదేవి యుంచిన యుదకముతో శ్రీనివాసుని పాదములు కడిగి యా యుదకముతో తన్ను తన కుటుంబమును గృహమును బ్రోక్షించి దానితో నతని జీవితము సఫలమయ్యెనని నతని పితరులు తుష్టులైరనియు దలంచెను.

సుముహూర్తము ప్రాప్తించగా నాకాశరాజు శ్రీనివాసునికి కోటి సంఖ్యగల నిష్కములను దక్షిణగా నిచ్చెను. మఱియు శతభారమగు

కిరీటమును, అంతభారముగల కంఠమాలను, తదర్ధమగు కంఠమాలను, తదర్ధమగు మరియొక కంఠమాలను, అనర్ఘములైన యేడు పతకములను ముక్తామాలిక నొకదానిని, భుజభూషణములు రెంటిని, మౌక్తికములతో జేయబడిన కర్ణభూషణములను, ద్వాత్రింశద్భారయుక్తమగు రత్న మాణిక్య వైడూర్య నిర్మితములగు కంకణములను, రెండు నాగభూషణ ములను, పది యుంగరములను, వజ్రఖచితమగు స్వర్ణకటిసూత్రమును పాదుకలను శ్రీనివాసునికి సమర్పించెను. షష్టిభారయుతమగు భోజన పాత్రమును, రెండు తీర్థపాత్రములను, నరువదినాలుగు కంబళములను గూడ సమర్పించెను. వీటి యన్నిటితోగూడ పద్మావతిని కన్యాదానము చేసెను. మంత్రపూతమగు స్వామిపుష్కరిణీతీర్థముతో గూడ పద్మావతిని శ్రీనివాసునికి దక్షిణకరమున నిచ్చెను. ఇద్దరికిని కంకణధారణము జరిగినపిదప శ్రీనివాసుడు పద్మావతికి మంగళసూత్రమును సువాసినులు మంగళములు పాడుచుండగా కంఠమున గట్టెను. తరువాత పురోహితుడు పద్మావత్యంజల్యర్పితములగు లాజములను శ్రీనివాసునిచే హోమము చేయించెను. తరువాత మిగిలిన వైవాహిక విధినంతను యజుఃశాఖానుసారముగా పురోహితుడు చేయించెను. తరువాత నవ రత్నాక్షతలతో దేవతలు ఋషులు అందరును శ్రీనివాసుని వేదోక్తముగా వాశీర్వదించిరి. తరువాత నాకాశరాజు బ్రాహ్మణులకందరకును భూరి దక్షిణల నిచ్చెను. వివాహానంతర మిదివరలో భోజనము చేయని పురోహితుడు, శ్రీనివాసుడు, లక్ష్మి, బ్రహ్మ, వకుళావళి, ఆకాశరాజు, అతని పత్ని, వసుదానుడు మొదలగువారు భుజించిరి. మరునాడుదయ మున సువాసినులు శ్రీనివాసునికి పద్మావతికిని సహాసముగా నన్యోన్య మజ్జనములు గావించిరి. ఆకాశరాజు తన గృహమున వచ్చిన వారంద రకును సంతుష్టిగా నాలుగుదినములు సంతర్పణలు జరిగించెను. అయిదవ

దినమున నాకబలి జరిగించి యాకాశరాజు వధూవరులను రత్నసింహాసనమున గూర్చుండబెట్టి వస్త్రాలంకారములతో బూజించెను.

41. శ్రీనివాసుడు పద్మావతితో శేషాచలమునకు పయనమగుట

వివాహము పూర్తియైన పిదప సకుటుంబముగా నాకాశరాజు పద్మావతిని శ్రీనివాసునకొప్పగించి యైరావతము నెక్కించి యతని విడిదికి బంపెను. అనంతరము శ్రీనివాసుడు శేషాచలమునకు వెడలనెంచి పద్మావతితో గూడ గరుడు నధిష్ఠించి శేషాచలము పోవుచున్నానని చెప్పుట కాకాశరాజుభవనమున కేగెను. ఒక మాస మచ్చటనుండి వెళ్ళవలయునని యాకాశరాజు కోరెను. కాని శ్రీనివాసుడు కార్యత్వరకలదని చెప్పి వెంటనే వెళ్ళుటకు నిశ్చయించెను. ఆకాశరాజును నతని భార్యయగు ధరణీదేవియును పద్మావతీ శ్రీనివాసుల నాశీర్వదించి స్వస్థానమునకు పయనము చేసిరి.

వారి వెనుక నాకాశరాజు సకుటుంబముగా గొప్పసారెను తీసుకవెళ్ళి శ్రీనివాసున కర్పించెను. అది యెట్లన—నూరుగరిశెల ధాన్యము, ముప్పదిగరిశెల పెసలు, విస్తారముగా బెల్లము, చింతపండు, వెయ్యిఘటముల పాలు, నూరుభాండముల పెరుగు, అయిదువందల ఘృతపూర్ణ పాత్రములు, రెండువందలు శర్కరతోనిండిన పాత్రములు విశేషముగా సర్షపమును, ఇంగువ, లవణము, వార్తాకకూష్మాండకదళీకందమూలాదిశాకములు, రెండువందల మధుభాండములు, పదివేల గుఱ్ఱములు, వెయ్యి యేనుగులు, అయిదువందల గోవులు, నూరుగొఱ్ఱెలు, రెండువందల దాసీలు, మూడువందల దాసులు, వివిధవస్త్రములు, రత్నపర్యంకము మొదలగునవి.

వీటి నన్నింటిని దెచ్చిన యాకాశరాజును జూచి శ్రీనివాసు డిట్లు పలికెను. " ఓ రాజా ! నీ వింతదూర మెందులకు వచ్చితివి. మిక్కిలి

శ్రమపడితివి. నీ కుమారునిచే వీటిని పంపరాదా? కన్యాదానముచేసినందున నాకు జాల సంతోషము కలిగినది. నీవు సందేహింపక మనోగతమును గోరికెను గోరుకొనుము." అనిన నాకాశరాజిట్లు పలికెను. "నీప్రసాదమువలన మా కన్నిమంగళములును లభించినవి. నేను కోరదగినది మరేమియు లేదు. సకుటుంబముగా నాకు నీయందచంచలమైన భక్తిని ప్రసాదింపుము." అది విని శ్రీనివాసుడతనికి సాయుజ్యమును ప్రసాదించెను. తన శ్యాలుని వస్త్రాదులచే గౌరవించి పంపెను. ఆకాశరాజు విచారించుచున్న పుత్రిని నోదార్చి స్వపురమున కేగెను.

## 42. ఆరుమాసము లగస్త్యాశ్రమమున నుండుటకు శ్రీనివాసుడు నిశ్చయించుట

బ్రహ్మరుద్రాదులతో శ్రీనివాసుడు సువర్ణముఖి నదీ ప్రాంతమును పొందెను. ఆరుమాసములవరకు వివాహదీక్షయగుటచే శైలము నెక్కజాలను. కనుక యగస్త్యాశ్రమమున నంతకాల ముండెదనని నిశ్చయించి యచ్చట నుండెను. బ్రహ్మాదిదేవతలకు యోగ్యవస్త్రాదులను సమర్పించి స్వస్వస్థానములకు వెళ్ళుమని యాజ్ఞాపించెను. అతని యాజ్ఞానుసారము వారట్లు పోయిరి. శ్రీమహాలక్ష్మి కరవీరపురమునకు తిరిగి వెడలి పోయెను.

మహోత్సవం తం త్వనుభూయ దేవతా
బ్రహ్మేశపూర్వాః సమహర్షిసత్తమాః ।
జగ్ముః స్వకం ధామ మహానుభావా
రాజేంద్రపూజ్యం ప్రశశంసురాదరాత్ ॥

భవిష్యోత్తరపురాణము 11-వ అధ్యాయము.

## 43. ఆకాశరాజు నిర్యాణము

శ్రీనివాసుడును పద్మావతియు నగస్త్యాశ్రమమున కాలము గడుపు చుండగా, నారాయణపురమునుండి దూతయొకడు వచ్చి ఆకాశరాజు మరణాభిముఖుడుగా నున్నాడని వర్తమానము తెలియజేసెను. ఆ సమాచారమును విని శ్రీనివాసుడు పద్మావతీ వకుళమాలికలతో గూడ నగస్త్యమహామునిని పిలుచుకొని నారాయణపురమున కేగెను. సాయంకాలమున కానగరముచేరి రాజభవనములోనికి వెంటనే పోయి యింకను నిఃశ్వసించుచున్న యాకాశరాజును చూచెను. శ్రీనివాసుడును నగస్త్యుడును నెంత పిలిచినను నాకాశరాజు పలుకలేక పోయెను. శ్రీనివాసుడు మిక్కిలి చింతించి తుదకు ప్రాకృతునివలె రోదనము చేయసాగెను. అప్పుడాకాశరాజు కొంచెము జ్ఞానము వచ్చినవాడై శ్రీనివాసుని "నా కుమారుడును సోదరుడును నీయధీనులు; వారిని రక్షింపుము" అని మాత్రము పలికి వారిచేతులను శ్రీనివాసునికొప్పగించి, భార్యకు సహగమనమున కనుజ్ఞ యొసంగి ప్రాణములను విడచెను. వెంటనే విమానము రాగా భార్యాభర్తలిద్దరును దానినెక్కి స్వర్గమునకు పోయిరి. వసుదానుడు వారి శరీరములను దహనముచేసి బ్రహ్మమేధవిధిని వారికి సంస్కారములను జరిగించెను. ప్రేతకార్యములన్నియు ముగిసినపిదప శ్రీనివాసుడు పద్మావతితో గూడ తిరిగి యగస్త్యాశ్రమమునకు పోయి సుఖముగా నుండెను.

## 44. రాజ్యముకొరకు తొండమానవసుదానులు కలహించుట

ఆకాశరాజు మృతుడైన పిదప శ్రీనివాసు డగస్త్యాశ్రమమునకు వెళ్ళగా తొండమానునకును వసుదానునకును రాజ్యముకొరకు కలహము ప్రారంభమయ్యెను. జ్యేష్ఠుడు మృతిచెందగా కనిష్ఠునికి రాజ్యము రావలసినదని తొండమానుడున్ను పరాక్రమార్జితమగు నా తండ్రిగారి రాజ్యము నాకు రావలయునని వసుదానుడున్ను పట్టు పట్టిరి.

తుదకు వారొక నియమమునకు వచ్చిరి. రాజ్యము కొఱకిద్దరును యుద్ధము చేయుటకున్ను, యుద్ధము నందెవరు గెలుపొందుదురో వారు రాజ్యమును తీసికొనుటకున్ను, రెండవవారు మిన్నకుండుటకున్ను నిర్ణయించుకొనిరి. ఇద్దరును సైన్యములను సమకూర్చుకొని సహాయార్థము శ్రీనివాసునికడకు వచ్చిరి. ఇద్దరును ఇష్టులగుటచే నెవరికి సహాయము చేయవలయునో నిశ్చయింపలేక, శ్రీనివాసుడు పద్మావతినే యడిగెను. పద్మావతి యిట్లనెను. "ఓనాథా! నీకు ధర్మము తెలియదా, నన్నడుగుట యేల. ధర్మమేకదా చేయవలయునని పెద్దలు చెప్పెదరు. మాతా పితృహీనుడును, బాలుడును నగు వసుదానుని రక్షించుట ధర్మము కాదా?" పద్మావతిమాటలను విని శ్రీనివాసుడు, వసుదాసునికి సహాయము చేయ నిశ్చయించి, తన శంఖచక్రములను తొండమానునకు సహాయార్థమిచ్చి తాను వసుదానునకు సహాయార్థ మశ్వము నెక్కి, యతనితో వెళ్ళెను. తొండమానునకును వసుదానునకును యుద్ధము ప్రారంభమయ్యెను. కురు పాండవ యుద్ధము వలె ప్రచండముగా జరుగుచుండెను. కొంతసేపటికి తొండమానునికుమారుడు శ్రీనివాసుని జక్రముతో గొట్టెను. ఆదెబ్బకు శ్రీనివాసుడు ప్రాకృతునివలె మూర్ఛిల్లి క్రిందపడెను. అప్పుడు ప్రాకారము నెక్కి చూచుచున్న పద్మావతి యగస్త్యునితో నిట్లనియెను. "ఓమునీంద్రా! చూడుము. చక్రపాణి మూర్ఛిల్లి క్రింద పడియున్నారు. ఏమి యవస్థ పంభవించినది. ఏమి చేయగలను. నా కుపదేశింపుము." అందుకు అగస్త్యుడు, "యుద్ధమున క్షత్రియు లందరును, యెవరి పని వారు చూచుకొనుచున్నారు. అందుచే నీ భర్తను జూచువా రెవ్వరును లేరు. క్షత్రియులు యుద్ధమునందు ప్రవేశించి, సంగరోత్సాహముతో నుందురు. అందుచే వారికి సజీవములగు శరీరములయందే దృష్టి యుండును; కావి నిర్జీవములైనవానిని నెవ్వరును కన్నెత్తి చూడరు. కాబట్టి నీవు పోయి నీ భర్తను యుద్ధమునుండి నివర్తింపఁజేయుము. పతిభక్తి స్త్రీలకు పరమ

ధర్మము కదా ! నీ పినతండ్రి గెలిచినను, నీ సోదరుడు గెలిచినను నీకు సమానమే కదా ! కాబట్టి, నీవుపోయి నీభర్తకు హితము నాచరింపుము. సంధిచేయుటమంచిదని నాకు తోచుచున్న"దనిచెప్పెను. ఆ మాటలను విని పద్మావతి పల్లకీనెక్కి యుద్ధరంగమునకు వెళ్ళి శ్రీనివాసునకు శీతలోప చారములు చేసి, తెలివి వచ్చునట్లు చేసెను. శ్రీనివాసుడు నిద్రనుండి లేచినట్లు లేచి పద్మావతిని జూచి, కోపముతో కనుబొమ్మలను ముడిచి యిట్లనెను. "ఈ ఘోర యుద్ధరంగమున వనితల కేమి కార్యము ? ఈమెను శీఘ్రముగా మరలుమని చెప్పుము " అని యగస్త్యునితో ననెను. అది విని యగస్త్యుడిట్లనెను. "ఓ ప్రభూ ! సంధి జరిగించుము. పినతండ్రికిని సోదరునకును సంధిచేయించు నుద్దేశముతో, పద్మావతి వచ్చియున్నది." అగస్త్యునిమాటలను వినినప్పటికిని శ్రీనివాసునికి కోపము శాంతింపక తిరిగి యిట్లు పలికెను. "ఓ మునీ ! యోషితలకు సంగ్రామ భూమి కరుగుట యుచితము కాదు. నే నిప్పుడు తొండమానుని, నతని తనయుని సంహరించి, వసుదానునకు రాజ్యమిచ్చెదను." శ్రీనివాసుని మాటలను విని, పద్మావతి యంజలి జోడించి, తిరిగి యిట్లు పలికెను. "ఓ ప్రాణనాథా ! కృపానిధే ! దయ చూపుము. లోకనాశనము చేయ బూనితివా ? ఇద్దరును రాజ్యార్హులే, అందుచే రాజ్యమును, కోశమును సమముగా విభజించి యిద్దరకు నిమ్ము. సర్వలోకములకు స్వస్తియగు గాక. రణభూమినుండి నివర్తింపుము." శ్రీనివాసు డామెమాటల కియ్యకొనక వెండియు నిట్లనియె. "క్షాత్రధర్మము నీకు తెలియదు. నీవు యుద్ధరంగమునుండి వెళ్ళుము. నేనిప్పుడు తొండమానుని సంహరించి, రాజ్యమును వసుదానున కియ్యవలయును. లేదా, వసుదానుని కొఱకు యుద్ధములో ప్రాణములనైన విడువవలయును." అది విని పద్మావతి నఖశిఖపర్యంతము కంపమును పొంది, యగస్త్యునితో, శ్రీనివాసుని రణమునుండి నివర్తింపజేయుమని ప్రార్థించెను. అగస్త్యు డామెప్రార్థన

ప్రకారము శ్రీనివాసునితో నిట్లనియెను. "స్వామీ! తొండమానుని, వసుదానుని సమాధానపరచి సంధిజేయుము. రాజ్యమును, కోశమును విభజించి వారికిమ్ము." అగస్త్యుని ప్రార్థనను మన్నించి, శ్రీనివాసుడు తొండమానుని బిలిచి నీ మనోభీష్టమేమి యని యడిగెను. "నీవే నాకు గతివి. నీవు చెప్పినట్లు నేను వినుకొనెదను" అని తొండమానుడు మనవి చేసెను. తదుపరి శ్రీనివాసుడు వసుదానుని బిలిచి యిట్లనియె. "నీ సోదరి సంధి చేసికొనవలయు నని చెప్పుచున్నది. నీయుద్దేశమేమో చెప్పుము." వసుదానుడిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "నే నెప్పుడును నీశాసనము నతిక్రమించువాడనుకాను. నీయిష్టమువచ్చినట్లు చేయుము." వారి మాటలను విని వారిద్దరు ననుకూలురుగా నున్నట్లు తెలిసికొని, శ్రీనివాసుడు వారికి సంధి చేసెను. రాజ్యమును, కోశదండములను, దుర్గములను సమముగా విభాగముచేసి వారిద్దరికి నిచ్చుచు, మీతోగూడ యుద్ధము చేసి ప్రాణములను విడుచుటకు సిద్ధపడిన నాకుగాని, మీ కుమార్తెకుగాని షోడశభాగ మిచ్చుట న్యాయమని తొండమానునితోను, వసుదానునితోను జెప్పెను. వారట్లేయని ముప్పదిరెండు గ్రామములను శ్రీనివాసుని కిచ్చిరి. తరువాతను శ్రీనివాసుడు, తొండరాజ్యమున తొండమానుని, నారాయణపురమున వసుదానుని ప్రతిష్ఠించి, వారియింట నొక్కొక్కదినము విందు భుజించి, పద్మావతితో గూడ తిరిగి యగస్త్యాశ్రమమునకు బోయెను. భవిష్యోత్తరపు, 12-వ అధ్యా.

## 45. శ్రీనివాసుడు తొండమానుని దివ్యాలయమును కట్టింపుమని ప్రేరేపించుట

ఒకానొక దినమున తొండమానుడు, వేంకటేశుని దర్శనార్థము వచ్చెను. అతనినిజూచి మిక్కిలి సంతసించి శ్రీనివాసు డాలింగనము చేసికొని, వచ్చినకార్యమేమని యడిగెను. తొండమానుడిట్లు మనవిచేసెను.

"నీదర్శనార్థము వచ్చితిని. నా కేమియును పనిలేదు. మహామునులు, మనుజశ్రేష్ఠులు, నిన్ను వేదవేద్యుడగు పురాణపురుషుడవని చెప్పుదురు. అది విని, నిన్ను సేవించు నుద్దేశముతో వచ్చితిని" అని పలికెను. శ్రీనివాసు డాకాశరాజుమరణమునకు జింతించి, తొండమానునితో నిట్లు పలికెను. "నీ భ్రాతయగు నాకాశరాజుచే నేను గృహస్థుడనుగ చేయ బడితిని. కాని నాకు వాసార్థము భవనములేదు. ఆకాశరాజు యొక్క జామాత పరగృహమున నివసించుచున్నాడను నపకీర్తిని నేను సహింప జాలను. పారతంత్ర్యము మహాకష్టము కాదా. కాన నాకు నీవు భవనమును కట్టించిపెట్టుము. నీవుతప్ప మరి యెవ్వరును నిట్టి కీర్తిని బొంద దగినవారు మూడు లోకములలోను లేరు." శ్రీనివాసుని కోరికను విని తొండమానుడు, తప్పక యట్లే కట్టించెదనని వాగ్దానమిచ్చెను. స్థలమును జూపుటకు శ్రీనివాసు డొక శుభనక్షత్రయుక్త శుభదినమునందు పద్మావతీ సమేతుడుగా రాజుతో శేషాచలమునెక్కెను. వరాహస్వామియనుమతిపై స్వామిపుష్కరిణికి దక్షిణతీరమున స్థానము నేర్పాటు చేసెను. అచ్చట పూర్వముఖముగా నాలయము నేర్పరుపమని చెప్పెను. ఆలయమెట్లుండ వలయునంటే — రెండు గోపురములతోను, మూడు ప్రాకారములతోను, సప్తద్వారములతోను, ధ్వజస్తంభముతోను, కూడి యుండవలయును. ఆస్థానమండపము, యాగమండపము, గోశాల, ధాన్యభవనము, మాలాగృహము, వస్త్రగృహము, తైలశాల, ఘృతభవనము, భక్ష్యశాల, భూషణశాల, కర్పూరాది వాసనద్రవ్యగృహము, వీటి యన్నిటితో నాలయముండ వలయును. తామ్రపట్టములతో సంబద్ధముగాను సువర్ణాలంకార మండితముగాను నుండవలయును. ఇట్టి దేవాలయమును నిర్మింపుమని చెప్పి, శ్రీనివాసుడు తిరిగియు నిట్లుపలికెను. "పూర్వము నీవు శ్రీతీరమును భూ తీర్థమును నిర్మించి కీర్తిబడసియున్నావు. ఇప్పుడు నాకు శిలాభవనమును నిర్మించి కీర్తిని బడయుము."

## 46. తొండమానుని పూర్వజన్మవృత్తాంతము

అనిన విని యాశ్చర్యపడి తొండమాను డిట్లడిగెను. "స్వామీ! పూర్వము నే నెట్లు కూపములను నిర్మించితిని. నే నెట్టి జన్మము నెత్తి యాపనిని చేసితిని. నా కానతిమ్ము" అని తొండమానుడు ప్రార్థింపగా, శ్రీనివాసుడు వాని పూర్వజన్మవృత్తాంతము నిట్లు చెప్పెను.

"పూర్వము వైఖానసుడను నొక ఋషి కృష్ణావతారకథను విని, కృష్ణరూపమును ప్రత్యక్షముగా జూడగోరినవాడై చోళదేశమున దుష్కరమైన తపము నాచరించెను. భగవంతు డతనితపమునకు మెచ్చి గోపాలరూపమున నతనికి ప్రత్యక్షమయ్యెను. అప్పు డా ఋషి కృష్ణరూపమున భగవంతుని పూజింతునని నుడివెను. భగవంతు డతనితో నిట్లనియె. "నీవు కృష్ణరూపమును పూజింపరాదు. శ్రీనివాసుని నీవు పూజింపవలయును. నీవు శేషాచలమునకు పొమ్ము. అచ్చట వల్మీకమున శ్రీనివాసుడు వసించుచున్నాడు. ఆ శ్రీనివాసుని పూజింపుము. మార్గమున రంగదాసుడను శూద్రుడు నిన్ను గలసికొనును. పూజయందు నీ కతడు సహాయము చేయును." ఆ మాటలను విని వైఖానసఋషి వేంకటాద్రికి బయలుదేరెను. మార్గమున నతనిని రంగదాసుడను శూద్రుడు కలసికొనెను. వానితో వేంకటాద్రి చేరి, వల్మీకమున నున్న శ్రీనివాసుని బూజించుచుండెను. రంగదాసుడు, పూజకు పుష్పములను దెచ్చి సమర్పించుచుండెను. ఆరామమును బెంచుటకు రంగదాసుడు, నుయ్యి నొకదానిని త్రవ్వించెను. వసంతకాలమున నొకదినమున కుండలుడను గంధర్వుడు భార్యలతో గూడ స్వామిపుష్కరిణి యందు జలక్రీడ లాడుచుండెను. రంగదాసుడు వారిని చూచుచుండ పూజకు పుష్పములు సకాలమున జేరలేదు. ఆలస్యమైనందులకు ఋషి కోపగించెను. రంగదాసుడు తాను చేసిన తప్పునకు పశ్చాత్తాపమును పొందినవాడై, యూర

కుండెను. శంఖచక్రధరుడగు శ్రీనివాసుడు, పశ్చాత్తాపతప్తుడగు రంగ దాసుని జూచి యిట్లనియె. "ఓ రంగదాసుడా ! భయపడకుము. నా మాయచే నీవు మోహితుడవైతివి. నీవు పశ్చాత్తాపమును పొందితివి కనుక నీకు శుభమగును. కాబట్టి, పవిత్రమగు నీ స్వామిపుష్కరిణీ తీరభాగమున నీవు మరణించి, యీ కళేబరమును విడిచి, శుద్ధమైన జన్మాంతరమును పొందినవాడవై, సుధర్మతనయుడవై, తొండమాను డను నామముతో బుట్టెదవు. తొండమండలమునకు రాజై, ప్రఖ్యాతిని గాంచెదవు నాయందు భక్తి విశ్వాసములు గలిగియుందువు. కాబట్టి నీ విప్పుడే దేహమును త్యజింపుము." అ మాటలను విని స్వామియాజ్ఞాను సారము అతడు శరీరమును విడిచెను. ఆరంగదాసుడే నీవై యిప్పుడుద్భ వించితివి. అప్పుడు నీ వారామము కొరకు కూపమును కల్పించితివి. ఇప్పుడు నాకు మందిరమును కల్పించి, కీర్తిని పొందుము.

## 47. శ్రీనివాసుడు, తొండమానుడు నిర్మించిన మందిరమున ప్రవేశించుట

శ్రీనివాసుడు చెప్పిన పూర్వ జన్మవృత్తాంతమును విని తొండ మానుడు, పూర్వజన్మమున తాను కల్పించిన కూపమును శుభ్రపరచి, మహోన్నతమైనట్టియు, రత్నఖచితమైనట్టియు, చతుర్మూర్తిసమోపేత మైనట్టియు, వైనతేయవిభూషిత మైనట్టియు, సువర్ణకలశముతో గూడి నట్టియు, విమానమును నిర్మించెను. స్వామిని సేవించుటకు వచ్చిపోవు జనుల కెక్కుటకును దిగుటకును ననువుగానుండు సోపానములతో గూడిన యోజనవిస్తీర్ణమగు మార్గమును గల్పించెను. మధ్యమధ్యను జనులు విశ్రమించుటకు మంటపములను, దాహమునకు ప్రపాకూపములనుగూడ నిర్మించెను. ఇవన్నియు సిద్ధమైన పిదపతొండమానుడు, శ్రీనివాసుని సమీపించి యిట్లు విన్నవించెను. "స్వామీ ! నీ నియమానుసారము

సర్వము సంపూర్ణమైనది. నీ విమానమునకు నీవు దయచేయుము." అతనిప్రార్థనను విని శ్రీనివాసుడిట్లనియెను. "నీ భక్తికి మెచ్చుకొంటిని. నేనవశ్యము నీవెంట వచ్చుచున్నాను" అని, యింద్రుడాదిగాగల దేవతల తోడను, మహర్షులతోడను, వేదపాఠకులతోడను, వాద్యములతోడను, బయలు వెడలిన పద్మావతితో గూడిన శ్రీనివాసుని, తొండమానుడు మందిరమున బ్రవేశపెట్టెను. తొండమానునిచే కట్టించబడిన యానంద నిలయ విమానమున శ్రీనివాసుడు వాసమేర్పరచుకొనెను. ఆనందజనక మగుటచే నా విమానమునకు ఆనందనిలయ మని పేరు వచ్చెను.

ఆనందజనకత్వాత్తమానందనిలయం విదుః ॥

పద్మాసనమునసున్న పద్మావతిని శ్రీనివాసుడు తనవక్షఃస్థలమునం దుంచుకొనెను. శంఖచక్రవిహీనుడై, వామహస్తమును కటియందుంచు కొని దక్షిణహస్తముతో తన పదపద్మములను చూపుచు, శ్రీనివాసుడు ఆనందనిలయమున వేంచేసియున్నాడు. నరులకు పరమగతియగు తన పాదముల నాశ్రయించినవారికి సంసారసాగరము, కటిదఘ్నముగానుండు నని యా హస్తవిన్యాసము సూచించుచున్నది.

కటిన్యస్తకరేణాపి నిజపాదాబ్జగామినామ్ ।
నృణాం భవపయోరాశిం కటిదఘ్నం ప్రదర్శయన్ ।
విరాజతే వేంకటేశః సంప్రత్యపి రమాపతిః ॥

(భవిష్యోత్తరపు. 13-వ అధ్యా.)

## 48. బ్రహ్మ దీపారోపణమును భగవదుత్సవమును జేయించుట

సమస్తభూతములకు నభ్యుదయము కొఱకును, హితము కొఱకును బ్రహ్మ శ్రీనివాసునకు రెండు దీపములను సమర్పించి, కలియుగాంతము వరకును నా దీపము లుండవలయుననియు, నెప్పుడు విమానము

పడిపోవునో, దీపములు నశించునో, యప్పటి వరకును శ్రీనివాసుని యవతారము భూలోకమున నుండవలయు ననియు వరమును కోరెను. అట్లే యగుగాక యని వరము నిచ్చి, ధ్వజారోహణముతో నారంభించి, రథారోహణముతో నంతమగునట్టి వాహనయుక్తమగు నుత్సవముచేయు మని శ్రీనివాసుడు బ్రహ్మదేవుని నాజ్ఞాపించెను. బహు చిత్రములైన నైవేద్యములతోను, వేదపాఠకులతోను, తనకళ్యాణమును జరిగించుమని చెప్పెను. అట్లే కావించెదనని చెప్పి, బ్రహ్మదేవుడు తొండమానుని బిలిచి, శ్రీనివాసునకు విచిత్రములైన వాహనములను, దారుమయమగు రథమును చేయించుమని యతనితో చెప్పెను. పై వాహనములను, ఛత్రములను, చామరములను, వ్యజనములను, విశ్వకర్మచే చేయించు మని చెప్పెను. విశ్వకర్మ బ్రహ్మాయాజ్ఞానుసారముగా వాహనరథాదులను వెంటనే చేసిపెట్టెను.

అప్పుడు శ్రీనివాసుడు బ్రహ్మతోను, రాజుతోను నిట్లనియెను. "సర్వదేశజనాకీర్ణమైన యుత్సవ ముత్తమమందురు. కాబట్టి, నానాదేశ గతులగు రాజుల నుత్సవమున కాహ్వానింపుము." శ్రీనివాసుని యాజ్ఞా నుసారము తొండమానుడు సర్వదేశములకును భృత్యులను బంపెను. రాజుకోరికప్రకార మీ క్రింది దేశముల రాజులు సకుటుంబ సపరివారముగా నుత్సవమును జూచుటకు వచ్చిరి. అంగదేశము, వంగదేశము, కళింగము, పౌగండదేశము, కాశిదేశము, కాంభోజదేశము, కేరళ దేశము, విరాటదేశము, కురుదేశము, జాంగలదేశము, బర్బరదేశము, పాండ్యదేశము, చేదిదేశము, మత్స్యదేశము, సింధుదేశము, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజాతులవారును, తక్కిన యరణ్యజాతివారును, చండాల యవనులు మినహాయింపుగా నందరు, నుత్సవమును సేవించు టకు వచ్చిరి. వచ్చిన వారందరును తమ ధనమును, వస్త్రములను, భూషణములను, శరీరములను, జీవములను, సుఖమును, శ్రీనివాసుని

కర్పణము చేసిరి. వచ్చిన రాజులను, మునులను యథార్థముగా గౌరవించి, కన్యామాసమందు ద్వితీయాతిథి నాదంకురార్పణముతో ధ్వజారోహణము వైఖానసశ్రేష్ఠులచే చేయించి, రత్నమయమగు నరయానమును తీసికొనివెళ్ళి బ్రహ్మదేవుడు, శ్రీనివాసుని నరయానమునధిష్ఠించి, చైత్యప్రదక్షిణము చేయుమని కోరెను.

## 49. భగవదాజ్ఞపైని బ్రహ్మ భగవన్మూర్తిచతుష్టయమును నిర్మించుట

కాని శ్రీనివాసుడు, బ్రహ్మదేవుని చతుర్వేదాత్మకములైన నాలుగు శ్రీనివాసమూర్తులను నిర్మింపుమని యాజ్ఞాపించెను. వారి యాజ్ఞానుసారము బ్రహ్మదేవుడు నాలుగు మూర్తులను నిర్మించి, వానికి నామములనిడెను. మొదటిది ఉత్సవ శ్రీనివాసమూర్తి, రెండవది ఉగ్ర శ్రీనివాసమూర్తి, మూడవది సర్వాధిప శ్రీనివాసమూర్తి, నాల్గవది లేఖక శ్రీనివాసమూర్తి. ఈ నాలుగు మూర్తులకును మూలమూర్తిగా సాక్షాత్తు వేంకటాధీశుడగు శ్రీనివాసుడే యుండెను. బ్రహ్మదేవుడు తత్తన్మూర్తుల కభిమానదేవతలను గూడ గల్పించెను. ఉత్సవ శ్రీనివాసుడు యాత్రోత్సవములకు దీక్షితుడై యుండెను. షడ్విధాన్నములగు గుడాన్న, తిలాన్న, పరమాన్న, ముద్గాన్న, మాషాన్న, దధ్యన్నములతోను; గుడాపూప, తిలాపూప మాషాపూప, మనోహర, మోదకాది భక్ష్యములతోను గూడిన బహువిధములైన చిత్రచిత్ర నైవేద్యములు బ్రహ్మోత్సవమున జేయబడి దేవునకు నివేదన చేయబడినవి.

## 50. బ్రహ్మ జరిగించిన యుత్సవక్రమము

ఉత్సవ శ్రీనివాసులకు, ధ్వజారోహణపూర్వకముగా తిరువీధి యుత్సవములు బ్రహ్మ చేయించెను. ధ్వజారోహణ దివసమునకు బూర్వ

దినము సాయంకాల మనంతగరుడ బ్రహ్మాదులతో, ఋషులతోను గూడిన వారై, విష్వక్సేనపురస్సరముగా వెళ్ళి, పట్టణము బయటను వల్మీకము నుండి మంత్రములతో త్రవ్విన మట్టిని యేనుగుపైని సర్వమంగళవాద్య పురస్సరముగా, ప్రదక్షిణముగా, వీథులలో తెచ్చి యంకురార్పణము చేసిరి. మరునా డుదయమున ధ్వజారోహణము చేసిరి. ఇట్లారంభించి, శ్రీనివాసునికి నుత్సవము విధియుక్తముగా నవభృథాంతము, పుష్పయాగాంతము బ్రహ్మదేవుడు చేయించెను. ఆ యుత్సవమున మొదటిదగు ధ్వజారోహణ వాసరమున, మొదట మనుష్యాందోళిక వాహనముగానుండెను. రెండవది రాత్రియందు శేషవాహనముగా నుండెను. రెండవదివసమున మొదట తిరిగి శేషవాహనమే యుపయోగింపబడెను. రెండవనాడు రాత్రి హంసవాహన ముపయోగింపబడెను. మూడవదినము సింహవాహనము మొదటిదిగా నుండెను. రాత్రియందు రెండవది మౌక్తికమండపము. నాల్గవదినము ప్రాతఃకాలమున గల్పవృక్షవాహన ముపయోగింపబడెను. రాత్రి రెండవది సర్వభూపాలవాహనము. అయిదవ దినము మోహినీ వేషమును ధరించిన దేవునకు పల్లకివాహనముగా నుండెను. రాత్రి శ్రీని వాసరూపమున నున్న దేవునకు గరుడవాహన ముపయోగించబడెను. ఆరవదినము మొదట హనుమంతవాహనము, రెండవది దేవితో వసంతోత్సవమునకు బోవునప్పుడు మంగళగిరి వాహనమును, మూడవది రాత్రియందైరావతమును, ఏడవనాడుదయమున సూర్యమండల వాహనమును, సాయంకాలముద్యాన విహారమునకు మహిషులతో బోవునప్పుడు మంగళగిరి వాహనమును, రాత్రి మూడవది చంద్రమండలమును, ఎనిమిదవ దినమున మొదట నానావిధాలంకారయుక్తమగు రథముదయమునను, రాత్రి రెండవది హయవాహనమును, తొమ్మిదవ దినమున మొదట నుదయమున పల్లకియు, తరువాత నవభృథస్నానమంగళోత్సవమునకు బోవునప్పుడు మంగళగిరియానమును, మంగళచూర్ణములతో

సభిషిక్తుడై మంగళగిరివాహనమున విమానమునకు ప్రదక్షిణముచేసి వేదమంత్రములు జపింపబడుచుండగా స్వామిపుష్కరిణీతీర్థమం దవభృథస్నానము నాచరించెను. అవభృథస్నానము శ్రవణనక్షత్రయుక్తావతార దినమందు జరిగెను. రాత్రి ధ్వజావరోహణోత్సవమున దిరిగియు మంగళగిరి వాహనము. ఆ మరునాడు పుష్పయాగోత్సవము జరిగెను. అటుతరువాతను దేశాంతరములనుండి వచ్చిన రాజులకు గౌరవములు జరుపబడగా వారందరును వారివారి స్థలములకు బోయిరి. దేవత లందరును దేవమహోత్సవమును వీక్షించి తమతమ స్థానములకు బోయిరి. బ్రహ్మ శ్రీనివాసుని నమస్కరించి తనలోకమునకు బోయెను. ఉత్సవమును పూర్తిచేసి తొండమానుడు శ్రీనివాసుని నమస్కరించి యతని యాజ్ఞనుబడసి స్వపురమునకేగి తన మందిరమున వేంకటేశుని స్థాపించి పూజించుచుండెను. సత్యముతో బృథివిని బాలించుచుండెను. సద్ధర్మ నిరతుడై, శాంతుడై, జితేంద్రియుడై బిలమార్గమునవచ్చి నిత్యమును శ్రీనివాసు నర్చించు చుండెను.

## 51. కూర్మ్మడను ద్విజుని వృత్తాంతము

కార్తికమాసము సంప్రాప్తించగా కూర్మ్మడను వసిష్ఠ గోత్ర బ్రాహ్మణుడు తన తండ్రిగారి యస్థులను తీసికొని గంగాస్నానమునకు భార్యాపుత్రులతో గూడ పోవుచు మధ్యను తొండమానుని కీర్తిని విని యతని పురమున కేగెను. మహాలక్ష్మియను భార్యను రాఘవుడను కుమారుని యూరిబయట నుండుమని రాజదర్శనము కొరకు రాజమందిరమునకు బోయెను. విద్వన్మండలమధ్యను సింహాసనాసీనుడగు తొండమానుని జూచి వేదోక్తముగా నాశీర్వదించి యిట్లు పలికెను. "ఓ రాజా, నీకీర్తిని విని నీవద్దకు వచ్చియున్నాను." అనిన రాజు నీ వేమికారణముపై నావద్దకు వచ్చితి వని యడిగెను. కూర్మ్మ డిట్లు పలికెను. "నా తండ్రి

కాలధర్మమును బొందెను. అతని యస్థులను గంగలో గలుపుటకు నేను కాశికి పోవుచున్నాను. మార్గమున నా భార్య గర్భవతియైనది. మరియు నైదేండ్ల యీడుగల నా పుత్రుడు నడవలేకయున్నాడు. వారిద్దరిని నీ విచ్చటనుంచి రక్షించుచున్నచో నేను కాశికిపోయి యస్థులను గంగలో గలిపి తిరిగివచ్చి వారిని తోడుకొని పోయెదను." ఆ మాటలను విని రాజు అట్లే యగుగాక యని యా బ్రాహ్మణునకు ధనమునిచ్చి పంపెను. అతని భార్యయును పుత్రుఁడును అతనిని శీఘ్రముగ మరలి రమ్మని చెప్పి రాజుభార్యవద్ద నుండిరి. బ్రాహ్మణుడు వెళ్లిన పిదప రాజు వారిద్దరి నొక యేకాంతమగు భవనమున నుంచి, ఆరుమాసములకు సరిపోవు భోజనాదిపదార్థములను సమస్తపరికరములను గృహమునందుంచి యాగృహమును గొలుసులతో జాగ్రత్తగా బంధించి, యర్ధక్రోశము వరకును నౌఖరులనుంచి ధూర్తులెవరును ప్రవేశించకుండునట్లుగా రక్షించు చుండెను. ఇట్లామెను సురక్షితముగా నుంచి తాను రాజకార్యనిమగ్నుడై యుండెను. రాజకార్యభారముచే దిరిగియు నామెను రాజు స్మరించుట కవకాశము లేకపోయెను. రెండు సంవత్సరముల కామె భర్తయగు కూర్ముడు కాశికిపోయి గంగాస్నానము చేసికొని, గయకుపోయి గయా శ్రాద్ధము చేసికొని కాశికావిడిని భుజమున మోయుచు తొండమానుని వద్దకు వచ్చి రాజు నాశీర్వదించి యిట్లుపలికెను. "ఓ రాజా ! నీ ప్రసాద మువలన గంగాస్నానము గయాశ్రాద్ధమును చేసికొని వచ్చితిని. గంగా జలమును నేను తెచ్చియున్నాను. దానిలో నీవును స్నానముచేసి పావ నుడవు కమ్ము." అనిన యతనిమాటలను విని రాజు బ్రాహ్మణభార్య నప్పుడు జ్ఞప్తికితెచ్చుకొని యామె యేమైనదో యని చింతాక్రాంతుడై నిశ్చేష్టుడయ్యెను. కొంతసేపటికి ధైర్యమును తెచ్చుకొని మనస్సును స్వస్థము చేసికొనెను. బ్రాహ్మణుడు జేని యవస్థను జూచి దుఃఖించి, యతను స్వస్థుడగుటను జూచి యతని కుశలము నడిగెను. రాజు స్వస్థుడు

కాగా బ్రాహ్మణు డతనితో నిట్లనియెను." గర్భిణిగానుండిన నా భార్య నిచ్చట విడిచియుంటిని. ఆమె ప్రసవించినదా? ఆమెవార్త యేమియును దెలియకపోవుటచే నాకు విచారముగా నున్నది. నాకుమారుడెల్లప్పుడును తటాకాదులయందాడుట కాసక్తికలవాడు. అతడు క్షేమముగా నున్నాడా? నాభార్య నన్నుజూచుట కింతవరకును రాలేదు. నేను రాత్రింబవళ్ళువారినే తలచుచుంటిని. నాకు భయముగా నున్నది. వారెచ్చటనున్నారు." అతని మాటలను విని తొండమానుడు ధైర్యమును వహించి యతనితో నిట్లనియెను. "ఓ బ్రాహ్మణోత్తముడా! భయపడకుము. నీ పుత్రుడు క్షేమముగా నున్నాడు. నీ భార్యకు సుఖప్రసవమైనది. పుత్రిక జన్మించినది. అనేకమంది స్త్రీలు నాకంటబడిరి కాని నీ భార్యమాత్రము నాకంట నెప్పుడును బడలేదు. ఆమెవృత్తాంతమును చెప్పెదను వినుము. నిన్నను శుక్రవారము గనుక శ్రీవేంకటేశుని కభిషేకము ప్రసక్తమైనది. అభిషేకదర్శనమునకు నాకన్యలందరు వెళ్ళియుండిరి. వారితో గూడ నీ భార్యయు పుత్రీసుతులతోగూడ వేంకటాద్రికి వెళ్ళినది. ఈ దినము గాని రేపుగాని యా మరుసటిదినముగాని నీ భార్య నీవద్దకు రాగలదు." అని యా బ్రాహ్మణు నోదార్చి, తనపుత్రుని బిలిచి రహస్యముగా నిట్లు పలికెను. "నీవు బ్రాహ్మణపత్ని నుంచిన భవనమునకు బోయి గొలుసులను విడగొట్టి, యామెనుచూచి శీఘ్రముగా నామెను పుత్రసహితముగా తోడుకొని రమ్ము" రాజకుమారుడు పోయి చూడగా నచ్చట యస్థిసంచయము మాత్రము కనబడెను. ఈ విపత్తుతో తన వంశనాశము చిన్నమూల మగునని దలంచి రాజకుమారుడు తండ్రితో నిట్లనియె. "తండ్రీ, మన రాజవంశమునకు నాశకాల మాసన్నమైనది. ఏలయన కూర్మబ్రాహ్మణునిభార్య పుత్రసహితముగా మరణించినది. అస్థులుమాత్రము మిగిలి యున్నవి. ఇది యంతయును నామె యన్నాదులను మనము విచారించక

పోవుటచే సంభవించినది.” రాజు ధైర్యముతో బ్రాహ్మణునకు స్వయం పాకమునిచ్చి భుజింపుమనిచెప్పి యతను స్నానార్థము జలాశయమునకు బోగా తాను పుత్రునితోగూడ శ్రీనివాసుని శరణుజొచ్చుటకు వేంకటాద్రికి వెళ్ళెను. అచ్చట శ్రీనివాసుని పాదారవిందములను పట్టి మ్రొక్కి యేడువ నారంభించెను. రోదనముచేయుచున్న రాజునుజూచి శ్రీనివాసు డిట్లడిగెను.” “ ఓ రాజా! అకాలమున నీవెందుల కిచ్చుటకు వచ్చితివి. నీ వెందుల కేడ్చుచున్నావు. నీ ధీరత్వమును ధనుష్మత్త్వమును లోక ప్రసిద్ధములుకదా. అట్టి నీకు రోదనకారణ మేమిగలిగినదో చెప్పుము ” ఎంత యడిగినను బ్రత్యుత్తరమీయక యేడ్చుచున్న రాజునుజూచి యతని హృదయమును దెలిసికొని శ్రీనివాసుడు తిరిగియు నిట్లు పలికెను. “ ఓరాజా, నీ హృదయము నేనెరిగితిని. నీవుచేసినపాపము నేనాచరించి నట్లే. నీవు పాపమును చేసితివి. నే నేమిచేయగలను. నీవు మరలి నీయింటికి పొమ్ము. నీవకార్యమును జేసితివి. నేను పాపుడను, దురా చారుడను, నిత్యదుఃఖయుక్తుడను నగుచున్నాను. నే నకాలమరణము నైనను బొందవలయును. లేనిచో నరకమునకైనను పోవలయును. నాభక్తునకు దౌర్భాగ్యము రాకూడదు. నాభక్తునకు దారిద్ర్యము రాకూడదు. నీకు నాయందు భక్తికిలోపము లేదు. నీవు క్రూరమైన పాపమును చేసితివి. నే నేమిచేయుదును. ఎచ్చటికి పోవుదును. నీయందు నాకుండు ప్రీతిచే మృతులను సజీవులుగా చేసెదను. నాకు కలియుగమున వేంకటనాథుడు మహాపాతకికి పాపవిముక్తియగునట్లు చేసెనను కీర్తి కలుగుగాక. నీపుత్రుని బంపి మృతులైనవారి యస్థులను దెప్పింపుము.” శ్రీనివాసుని యా మాటలను విని మరణించినవారి యస్థులను దెచ్చుటకు తన కుమారుని బంపెను. అత డతిశీఘ్రముగా గతించినవారి యస్థులను దెచ్చుటకు వెళ్ళెను, వాటినొక వస్త్రమున మూటగట్టి నరయానములో బెట్టి వేంకటాద్రికి దెచ్చి తండ్రికి కొప్పగించి శ్రీనివాసునితో నస్థులు

తేబడినవని చెప్పి యా బ్రాహ్మణులను బ్రతికింపుమని ప్రార్థించెను. శ్రీనివాసు డాయస్థులను తీసికొని తన యుత్తరీయములో గట్టి స్వామి పుష్కరిణికి బూర్వదిశయందుండు పాండుతీర్థమునకు బోయి దాని దగ్గరనున్న యొక దేవఖాతమున గంఠదఘ్నముగ నీటిలో నిలచి అస్థులను నొడ్డున నొక శిలమీదనుంచి వానిమీద తన యంజలితో నీళ్ళను జల్లెను. వెంటనే యా బ్రాహ్మణియు నామె పిల్లలును సజీవులైరి. ఆ తీర్థమున వెంటనే పుష్పవృష్టిపడెను. చూచిన వారందరు నాశ్చర్యమును పొందిరి. ఆతీర్థప్రభావమువల్ల నస్థిరూపమున నున్నవారు సజీవులగుటచే దానికి నస్థితీర్థమని యప్పటినుండి వ్యవహారము కలిగెను. దేవత లందరును నరకమునందున్నవారి యస్థులను గూడ నీ తీర్థమున ముంచినచో స్వర్గమునకు పోవుదురని వరము నిచ్చిరి. ఇట్లు బ్రాహ్మణిని బుత్రులతో గూడ బ్రతికించి రాజున కొప్పగించి శ్రీనివాసు డతనితో నిట్లు పలికెను. " నీ యగ్రజుడు నా కాప్తుడగుటచే నాకుపకారము చేసిన నీకు శతాధికముగా ప్రత్యుపకారము చేసితిని. ఇటుపైని నేను మౌనమును వహించెదను. అత్యంతము నేకాంతజనముతోతప్ప మరి యెవ్వరితోను మాటలాడను. ఈ కలియుగమున నిక నే నన్యముఖముచేతనే మాటలాడుదును. ఓ రాజా, నీవు నీ పురమున కేగుము. ఆ బ్రాహ్మణునకు భార్యను పుత్రుని సమర్పించి యకంటకముగా నీవు నీ రాజ్యమును బాలించుకొనుము." అని శ్రీనివాసునిచే నాజ్ఞాపింపబడినవాడై తొండమాను డతని యనుజ్ఞను బడసి తన నగరమునకేగి యా బ్రాహ్మణునకు బిల్లలతో గూడిన భార్యను సమర్పించెను. జరిగిన వృత్తాంతము నంతను నతనికిజెప్పెను. అప్పుడు కూర్మబ్రాహ్మణుడు రాజు సమక్షముననే తన భార్యను నీ విన్నిదినము లెచ్చటికి బోయి యుంటివని యడిగెను. అప్పుడామె యిట్లనియెను. " దేవమాయ నేనేమని వర్ణించెదను. శ్రీనివాసుని యుదరమున విచిత్రమైన లోకవిస్తరమును చూచియుంటిని. బ్రహ్మ

మొదలగు దేవతల నందరను చూచితిని. లోకాలోకమును చూచితిని. సప్తసముద్రములను గిర్యటవీవృక్షములను చూచితిని.'' ఆ మాటలను విని లజ్జితుడై బ్రాహ్మణు డిట్లు పలికెను. "నాజన్మమెందుకు, నావేదాధ్య యన మెందుకు, నా తపస్సెందుకు. త్రినేత్రాది దేవతలకు కూడ చూడ శక్యముకాని విచిత్రములను నీవు నారాయణుని యుదరమున జూచితివి. నీవే ధన్యురాలవు." తొండమానుడుగూడ శ్రీనివాసుని యుదరమున నాశ్చర్యములను జూచుటకు బ్రాహ్మణియెంత పుణ్యము చేసినదోయని యాశ్చర్యపడెను. కూర్మబ్రాహ్మణుడు తొండమానుని యద్భుతశక్తిని స్తుతించి, తన భార్యాపుత్రులతో స్వగ్రామమునకు సంతోషముతో బోయెను.

## 52. తొండమానుడు శ్రీనివాసునకు సహస్రనామార్చన చేయించుట

విప్రుడు నిష్క్రమించిన వెనుక తొండమానుడు శ్రీనివాసుని ప్రభావ మును తలంచుకొని యాశ్చర్యపడి, తనమీద నాగ్రహించినాడని తెలిసి కొని శ్రీనివాసుని యనుగ్రహమును సంపాదించుట కేమిచేయవలయు నని యాలోచించుచు నంగిరసాదిఋషుల నుపాయ మడిగెను. రాజు మాటలను విని యంగిరసు డిట్లు పలికెను. "శ్రీనివాసుని యనుగ్రహ మును సంపాదించుట కాయనకు తులసీదళములతో సహస్రనామార్చనము చేయుము. తులసి యతనికి ప్రియమైనది. అట్లు పూజించితివేని శ్రీని వాసుడు నీకు ప్రత్యక్షమగును." అంగిరసుని యాజ్ఞానుసారము రాజు స్వర్ణముతో తులసీదళసహస్రమును జేయించి వేంకటేశ సహస్రనామ ములతో వాటిని యతని పాదములలో నర్పించుచు నర్చన చేయించెను. ఈ ప్రకారముగా మూడు మాసములు నిత్యము నర్చించినను శ్రీనివాసు డతనిమీద గోపము విడువలేదు. అప్పుడు తొండమానుడు మిక్కిలి

ఖిన్నుడై శ్రీనివాసు నిట్లు ప్రార్థించెను. "నీవంటి గుణాధికులు భక్తుల యపరాధములను లెక్కింపరు. ఓ పురుషోత్తముడా! భక్తుడగు నా దౌరాత్మ్యమును క్షమింపుము. వరమునిచ్చు వారలలో నీవు శ్రేష్ఠుడవు గదా! భక్తుడగు నాపై దయను జూపుము." ఇట్లు ప్రార్థించగా శ్రీనివాసు డాకాశభాషితముతో నిట్లు పలికెను. "నాకు భక్తులు చాలమంది యున్నారు. కాని నీవంటివా రెవ్వరునులేరు. బ్రాహ్మణస్త్రీ పుత్రఘాతుక రూపమైన ఘోరపాపము నాచరించి, పాపము నెట్లు తప్పించుకొనగలవు. నీ యగ్రజుని యుపకారమును బురస్కరించుకొని వారిని నేను సజీవులను జేసితిని." ఈ యాకాశభాషితమును విని రాజు మోహమును పొంది, తెలివి తెచ్చుకొని యిట్లు పలికెను. "ఓ హరీ! ఉపకారమును చేసిన వారు వారు చేసినదానిని చెప్పుకొనరు. మూఢుడైనప్పటికిని తాను చేసిన సేవ నెవడు చెప్పుకొనును. నావంటి భక్తుడు మూడులోకములలోను లేడు. నీయందేకాంతరతుడు నాకంటె నెవడున్నాడు? భక్తులలో నేనగ్ర గణ్యుడను. దయాళువులలో నీవగ్రగణ్యుడవు." ఇట్టి యతని గర్వోక్తు లను విని శ్రీనివాసు డూరకుండెను. తిరిగియును సువర్ణ తులసిదళ ములచే శ్రీనివాసుని భక్తితో నర్చింపజేసెను.

ఇట్లర్చించుచుండగా నొక దినమున సువర్ణకృత తులసీదళముల పైని నలచియున్న మృణ్మయమైన తులసీకుసుమావళి నొకదానిని తొండ మానుడు చూచెను. మరియొక దినమున సువర్ణనిర్మిత తులసీకుసు మావళిని దూరనిరస్తముగాను మృణ్మయమైన తులసీ కుసుమావళిని హరిపాదలగ్నముగాను తొండమానుడు చూచెను. దీనినిబట్టి శ్రీనివాసు నికి తనమీద వింకను నాగ్రహముగానున్నదని తలంచి బిగ్గరగానేడ్చుచు తొండమానుడు శ్రీనివాసునిగూర్చి యిట్లు పలికెను. "ఓ భగవంతుడా! పాపాత్ముడైనట్టియు, యనాథుడైనట్టియు నన్నెందులకు పేక్షించు చున్నావు? ఏ భక్తాగ్రేసరునిచే సమర్పింపబడిన యీ మృణ్మయమైన

తులసీకుసుమావళిని బ్రీతితో స్వీకరించుచున్నావు." ఇట్లు తొండమాను నిచే బ్రార్థింపబడిన శ్రీనివాసు డతనితో నిట్లనియె.

## 53. భీముడను కులాలుని వృత్తాంతము

"నా కనేకమంది భక్తులు కలరు. వారిలో భీముడను దరిద్రుడగు కులాలు డొకడిచ్చటి కుత్తరభాగమున యోజనదూరమున కలడు. ఆ కులాలుడు మిక్కిలి భక్తితో భిత్తికాబిలమధ్యను దారురూపమున నున్న నన్ను బ్రతిదినమును పూజించుచున్నాడు. బ్రతిదినమును తన కృత్యమును సమాప్తిచేసికొని, స్వస్థుడై శాంతుడై స్నానముచేసి విధియుక్తముగా మృణ్మయములైన తులసీదళములతో నన్ను పూజించుచున్నాడు. అతని భక్తికి తుష్టుడైనవాడనై యతని పూజ నంగీకరించుచున్నాను. అచ్చటికి బ్రతిదినమును బోయి యతనిని నతని భార్యను చూచి బహువిధములైన విరాగులగు నా భక్తులు కలరనియు, "నేనే నీభక్తుడను" అని నీవు పూర్వము చెప్పినది యహంకారపూరితమైన మాటలనియు తెలిసికొనుము." ఆ మాటలను వినిన వెంటనే రాజు దేవాయతనమును విడిచి పాదచారియై రాజగౌరవములను విడిచి కులాల గృహమార్గమున బయలుదేరెను. మార్గమున పథికుల నాకులాలుని గృహము నడుగుచు చివర కక్కడకు చేరెను. వీధిగుమ్మము దగ్గరకు వచ్చినవెంటనే రాజు తెలివితప్పి క్రిందపడెను. ఈ సంగతి విని కులాలుడు పైకి బరుగెత్తి వచ్చి "ఏమి, యీ కష్టము. రాజు పడిపోయెనే. నా యపరాధమేమున్నదో. నే నతని యాజ్ఞానుసారము బ్రవర్తించుచున్నానే." అని యిట్లు కులాలుడు విలపించుచుండగా రాజు సంజ్ఞతెచ్చుకొని "ఏడీ! భీముడను కులాలు డెచ్చటనున్నాడు? అతడు గొప్పహరిభక్తుడు. అతని పాదయుగళమును నెల్లప్పుడును నేను నమస్కరించుచున్నాను." అని దీనముగా బలికెను. ఇట్లు రాజనుచుండగా నా కులాలుని యెదుట భక్తవత్సలుడగు

భగవంతుడు ప్రత్యక్షమయ్యెను. కులాలు డత్యానందభరితుడై భగవంతు ననేకవిధముల స్తోత్రముచేసెను. వెంటనే భగవంతు డాకులాలుని తన దగ్గరకు తెమ్మని గరుడు నాజ్ఞాపించెను. గరుడు డట్లుచేయగా కులాలుడు దేవదేవునకు నమస్కరించి యిట్లు పలికెను. "ఓ పరమాత్మా! నీ వేల శూద్రుడనగు నా గృహమున కేగితివి. నేను విదురశబరగజేంద్రోద్ధవ విభీషణులవలె జ్ఞానిని కానే. నీకియ్య తగినది నాగృహమునం దేమున్నది?" ఇట్లతను పలుకగా నతని భార్యయగు తమాలిని యిట్లు పలికెను. "ఓ గోవిందుడా! నాబుద్ధి నీయందేయున్నది. నేను మంత్రముల నెరుగను. కర్మల జేయలేదు. మావంటి నీచజాతివారికి వేద మెక్కడిది, తపమెక్కడిది. నాయొక్కయు నాభర్తయొక్కయు భక్తిచే సంతోషించినవాడవై నేను వండిన యన్నమును యథేష్టముగా తినుము," ఇట్లు భక్తి యుక్తముగా నామె చెప్పినమాటలను విని సుప్రసన్నుడై భగవంతు డామెతో నిట్లనియె. "ఓ తమాలినీ! భక్తితో నీవు పెట్టిన యన్నమును తప్పక భుజించెదను." భక్తవత్సలుడగు భగవంతు డిట్లు పలికి రమాసమేతుడై యా కులాలదంపతులచే పెట్టబడిన యన్నమును భుజించి వారికి పరమపదము నిచ్చెను. ఇదిచూచి దేవతలందరును శ్రీనివాసుని స్తుతించిరి. దేవదుందుభులు మ్రోగినవి. ఆకాశమునుండి పుష్ప వృష్టి పడినది. ఇంతలో స్వర్గమునుండి యొక విమానమువచ్చెను. ఆ విమానము వచ్చుటనుజూచి శ్రీనివాసుడు తన కిరీటమును, శంఖచక్రములను, కౌస్తుభమును, పీతాంబరమును, నలంకారములను నాకులాలున కిచ్చెను. రమయొక్క భూషణములను తమాలిని కిచ్చెను. ఇట్లు శ్రీ మహావిష్ణువుచే నియ్యబడిన వైభవము కలవారై కులాలదంపతులు దివ్యవిమానము నెక్కి తొండమానురాజు చూచుచుండగా వైకుంఠమున కేగిరి.

## 54. శ్రీనివాసుడు తొండమానునకు మోక్షము నిచ్చుట

ఇట్లు వైకుంఠమునకేగిన కులాలదంపతులను జూచి తొండమానుడు లజ్జితుడై శ్రీనివాసునితో నిట్లనియె. "దేవా! నారాష్ట్రము నందుండు శూద్రుడును, సర్వదా పాపకారియు నగు కులాలునకు సద్గతి నిచ్చితివి. నీకు బంధువగు నా కేమిగతి చెప్పెదవు." అని యడిగిన, శ్రీనివాసు డిట్లుత్తర మిచ్చెను. "ఈ దేహమును విడిచి, మరియొక దేహము నాశ్రయింపుము. అప్పుడు నన్నాదరించి వైకుంఠమును బొందుము." శ్రీనివాసు డట్లనగానే తొండమానుడు పోయి స్వామి పుష్కరిణిలో స్నానముచేసి యీ దేహమును విడిచి దేహాంతరమును బొంది, శ్రీనివాసు నారాధించి యాయన పూర్వము చెప్పినట్లుగా మోక్షమును బొందెను.

ఏవం హరి స్తత్ర చరిత్రమద్భుతం కుర్వన్ జగన్మాతృసమన్వితో గిరౌ।
ఆస్తేజగత్యాం చ సురౌఘపూజితో దదద్యథేష్టం చ మనోరథాన్ సతామ్॥
(భవిష్యోత్తరపురాణము 14-వ అధ్యాయము.)

యః శృణోతీదమాఖ్యానం మనోరథఫలప్రదమ్।
ఇహ లోకే సుఖం భుక్త్వా సోఽథ యాతి హరేః పదమ్॥

భవిష్యోత్తరపురాణోక్త వేంకటాచలమాహాత్మ్యము సమాప్తము.
తృతీయాశ్వాసము సంపూర్ణము.



శ్రియః కాన్తాయ కళ్యాణనిధయే నిధయేఽర్థినామ్।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్॥
శ్రీవేంకటాద్రినిలయః కమలాకాముకః పుమాన్।
అభఙ్గురవిభూతిర్న స్తరంగయతు మంగళమ్॥



శ్రీరస్తు

అథ శ్రీ వారాహపురాణాన్తర్గత

# శ్రీ వేఙ్కటేశాష్టోత్తర శతనామ ప్రారమ్భః

---

శ్రియఃకాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్ ॥
శ్రీవేఙ్కటాచలాధీశం శ్రియాధ్యాసితవక్షసమ్ ।
శ్రితచేతనమన్దారం శ్రీనివాసమహం భజే ॥

## శ్రీ వేంకటేశాష్టోత్తర శతనామావళిః

మునయః ॥ సూత సర్వార్థతత్త్వజ్ఞ సర్వవేదాన్తపారగ । యేన చారాధిత స్సద్యః శ్రీమద్వేఙ్కటనాయకః ॥ ౧ ॥ భవత్యభీష్టసర్వార్థ ప్రదస్తద్బ్రూహి నో మునే । ఇతి పృష్టస్తదా సూతో ధ్యాత్వా స్వాత్మని తత్క్షణాత్ ॥ ౨ ॥ ఉవాచ మునిశార్దూలాన్ శ్రూయతామితి వై మునిః ॥ శ్రీసూతః ॥ అస్తికిఞ్చిన్మహద్గోప్యం భగవత్ప్రీతికారకమ్ ॥ ౩ ॥ పురా శేషేణ కథితం కపిలాయ మహాత్మనే । నామ్నామష్టశతం పుణ్యం పవిత్రం పావనాశనమ్ ॥ ౪ ॥ ఆదాయ హేమపద్మాని స్వర్ణదీసమ్భవాని చ । బ్రహ్మా తు పూర్వమభ్యర్చ్య శ్రీమద్వేఙ్కటనాయకమ్ ॥ ౫ ॥ అష్టోత్తరశతైర్దివ్యైర్నామభిర్మునిపూజితైః । స్వాభీష్టం లబ్ధవాన్ బ్రహ్మా సర్వలోక పితామహః ॥ ౬ ॥ భవద్భిరపి పద్మైశ్చ సమర్చ్యస్తైశ్చ నామభిః । తేషాం శేషనగాధీశ మానసోల్లాసకారిణామ్ ॥ ౭ ॥ నామ్నామష్టశతం వక్ష్యే వేంకటాద్రినివాసినః । ఆయురారోగ్యదం పుంసాం ధనధాన్య సుఖప్రదమ్ ॥ ౮ ॥ జ్ఞానప్రదం విశేషేణ మహదైశ్వర్యకారకమ్ । అర్చయేన్నామభిర్దివ్యై ర్వేఙ్కటేశ పదాఙ్కితైః ॥ ౯ ॥ నామ్నామష్టశతస్యాస్య ఋషిర్బ్రహ్మా ప్రకీర్తితః । ఛన్దోఽనుష్టుప్తథా దేవో వేఙ్కటేశ ఉదాహృతః ॥ ౧౦ ॥ నీలగోక్షీర సమ్భూతో బీజమిత్యుచ్యతే బుధైః । శ్రీనివాస స్తథా శక్తిర్హృదయం వేఙ్కటాధిపః ॥ ౧౧ ॥ వినియోగ స్తథాభీష్ట సిద్ధ్యర్థే చ నిగద్యతే ॥

* ఓం నమో వేఙ్కటేశాయ శేషాద్రినిలయాయ చ ॥ ౧౨ ॥ వృషదృగ్గోచరాయాఽథ విష్ణవే సతతం నమః । సదఞ్జనగిరీశాయ వృషాద్రిపతయే నమః ॥ ౧౩ ॥ మేరుపుత్రగిరీశాయ సరస్స్వామితటీజుషే । కుమారాకల్పసేవ్యాయ వజ్రిదృగ్విషయాయ చ

॥ ౧౪ ॥ సువర్ణలానుతనయస్తసైనాపత్యభరాయ చ । రామాయ పద్మనాభాయ సదా వాయు స్తుతాయ చ ॥ ౧౫ ॥ త్యక్తవైకుణ్ఠలోకాయ గిరికుఞ్జవిహారిణే । హరిచన్దన గోత్రేన్ద్ర స్వామినే సతతం నమః ॥ ౧౬ ॥ శఙ్ఖరాజన్య నేత్రాబ్జ విషయాయ నమో నమః । వసూపరి చరిత్రాత్రే కృష్ణాయ సతతం నమః ॥ ౧౭ ॥ అబ్ధికన్యాపరిష్వక్తవక్షసే వేఙ్కటాయ చ । సనకాది మహాయోగి పూజితాయ నమో నమః ॥ ౧౮ ॥ దేవజిత్ప్రముఖానన్తదైత్యసఙ్ఘ ప్రణాశినే । శ్వేతద్వీపవసన్ముక్త పూజితాఙ్ఘ్రియుగాయ చ ॥ ౧౯ ॥ శేషపర్వతరూపత్వ ప్రకాశనపరాయ చ । సానుస్థాపితతార్క్ష్యాయ తార్క్ష్యాచల నివాసినే ॥ ౨౦ ॥ మాయాగూఢ విమానాయ గరుడస్కన్ధవాసినే । అనన్తశిరసే నిత్య మనన్తాక్షాయ తే నమః ॥ ౨౧ ॥ అనన్తచరణాయాఽథ శ్రీశైలనిలయాయ చ । దామోదరాయ తే నిత్యం నీలమేఘనిభాయ చ ॥ ౨౨ ॥ బ్రహ్మాది దేవదుర్దర్శ విశ్వరూపాయ తే నమః । వైకుణ్ఠాగత సద్ధేమ విమానాన్తర్గతాయ చ ॥ ౨౩ ॥ అగస్త్యాభ్యర్థితాశేషజనదృగ్గోచరాయ చ । వాసుదేవాయ హరయే తీర్థపఞ్చకవాసినే ॥ ౨౪ ॥ వామదేవప్రియాయాఽథ జనకేష్టప్రదాయ చ । మార్కణ్డేయ మహాతీర్థ జాతపుణ్యప్రదాయ చ ॥ ౨౫ ॥ వాక్పతిబ్రహ్మదాత్రే చ చన్ద్రలావణ్యదాయినే । నారాయణనగేశాయ బ్రహ్మక్లుప్తోత్సవాయ చ ॥ ౨౬ ॥ శఙ్ఖచక్రవరానమ్ర లసత్కరతలాయ చ । ద్రవన్మృగమదాసక్త విగ్రహాయ నమో నమః ॥ ౨౭ ॥ కేశవాయ నమో నిత్యం నిత్యయౌవనమూర్తయే । అర్థితార్థప్రదాత్రే చ విశ్వతీర్థాఘహారిణే ॥ ౨౮ ॥ తీర్థ స్వామిసరస్స్నాత జనాభీష్టప్రదాయినే । కుమారధారికావాసస్కన్దాభీష్టప్రదాయ చ ॥ ౨౯ ॥ జానుదఘ్న సముద్భూత పోత్రిణే కూర్మమూర్తయే । కిన్నరద్వన్ద్వశాపాన్త ప్రదాత్రే విభవే నమః ॥ ౩౦ ॥ వైఖానసముని శ్రేష్ఠపూజితాయ నమో నమః । సింహాచలనివాసాయ శ్రీమన్నారాయణాయ చ ॥ ౩౧ ॥ సద్భక్తనీలకణ్ఠార్చ్య నృసింహాయ నమో నమః । కుముదాక్ష గణశ్రేష్ఠ సైనాపత్య ప్రదాయ చ ॥ ౩౨ ॥ దుర్మేధ ప్రాణహర్త్రే చ శ్రీధరాయ నమో నమః । క్షత్రియాన్తకరామాయ మత్స్యరూపాయ తే నమః ॥ ౩౩ ॥ పాణ్డవారి ప్రహర్త్రే చ శ్రీకరాయ నమో నమః । ఉపత్యకాప్రదేశస్థ శఙ్కరధ్యాత మూర్తయే ॥ ౩౪ ॥ రుక్మాబ్జసరసీకూలలక్ష్మీ కృతతపస్వినే । లసల్లక్ష్మీ కరామ్భోజ దత్తకల్హారక స్రజే ॥ ౩౫ ॥ సాలగ్రామనివాసాయ శుకదృగ్గోచరాయ చ । నారాయణార్థితాశేష జనదృగ్విషయాయ చ ॥ ౩౬ ॥ మృగయారసికాయాఽథ వృషభాసురహారిణే । అఞ్జనాగోత్రపతయే వృషభాచల వాసినే ॥ ౩౭ ॥ అఞ్జనాసుతదాత్రే చ మాధవీయాఘహారిణే । ప్రియఙ్గుప్రియ భక్షాయ శ్వేత కోలవరాయ చ ॥ ౩౮ ॥ నీలధేను పయోధారాసేక దేహోద్భవాయ చ । శఙ్కరప్రియ మిత్రాయ చోళపుత్రప్రియాయ చ ॥ ౩౯ ॥ సుధర్మిణీసుచైతన్య ప్రదాతే మధుఘాతినే । కృష్ణాఖ్య విప్రవేదాన్తదేశికత్వప్రదాయ చ ॥ ౪౦ ॥ వరాహాచలనాథాయ బలభద్రాయ తే నమః । త్రివిక్రమాయమహతే హృషీకేశాయ తే నమః ॥ ౪౧ ॥ అచ్యుతాయ నమో నిత్యం నీలాద్రినిలయాయ చ । నమః క్షీరాబ్ధినాథాయ వైకుణ్ఠాచలవాసినే ॥ ౪౨ ॥

ముకున్దాయ నమో నిత్య మనన్తాయ నమో నమః । విరిఞ్చాభ్యర్థితానీత సౌమ్యరూపాయ తే నమః ॥ ౪౩ ॥ సువర్ణముఖరీస్నాత మనుజాభీష్టదాయినే । హలాయుధజగత్తీర్థ సమస్త ఫలదాయినే ॥ ౪౪ ॥ గోవిన్దాయ నమో నిత్యం శ్రీనివాసాయ తే నమః ।

అష్టోత్తరశతం నామ్నాం చతుర్థ్యా నమసా న్వితమ్ ॥ ౪౫ ॥ యః పఠే చ్ఛృణుయా న్నిత్యం శ్రద్ధాభక్తి సమన్వితః । తస్య శ్రీవేఙ్కటేశస్తు ప్రసన్నో భవతి ధ్రువమ్ ॥ ౪౬ ॥ అర్చనాయాం విశేషేణ గ్రాహ్యమష్టోత్తరం శతమ్ । వేఙ్కటేశాభిధేయైర్యో వేఙ్కటాద్రి నివాసినమ్ ॥ ౪౭ ॥ అర్చయే న్నామభి స్తస్యఫలం ముక్తిర్న సంశయః । గోపనీయ మిదం స్తోత్రం సర్వేషాం న ప్రకాశయేత్ ॥ ౪౮ ॥ శ్రద్ధాభక్తియుజా మేవ దాపయేన్నామ సఙ్గ్రహమ్ । ఇతి శేషేణ కథితం కపిలాయ మహాత్మనే ॥ ౪౯ ॥ కపిలాఖ్య మహాయోగి సకాశాత్తు మయాశ్రుతమ్ । తదుక్తం భవతా మద్య సద్యః ప్రీతికరం హరేః ॥ ౫౦ ॥

ఇతి శ్రీవారాహపురాణే శ్రీ వేంకటాచలమాహాత్మ్యే
శ్రీ వేఙ్కటేశాష్టోత్తరశతనామ కథనం
నామైక షష్టితమోఽధ్యాయః



